# తొలిపలుకు

బ్రహ్మ సృష్టిలో మానవుఁ డుత్తమోత్తముఁడుగా పరిగణింపఁబడుచున్నాఁడు. అందు కితర జీవజంతువులకు లేని జ్ఞానమతని కుండుటయే కారణము. భగవంతుఁడు కరుణాళువై ప్రసాదించిన యీ జ్ఞానము సాహాయ్యమున మానవుఁడు తురీయ పురుషార్థమైన మోక్షమును బొందుటకు యత్నింప వలయును. అతఁడట్లు చేయనిచో నాహారభయ నిద్రాదులతోఁ గాలము పుచ్చుచుండు నితర జీవులకును అతనికిని ఆకారమున మాత్రమే భేదముండును. మోక్ష ప్రాప్తికి మన పూర్వులు మూఁడు మార్గములను నిర్దేశించి యుండిరి. అవి జ్ఞాన, కర్మ భక్తి మార్గములు. ఈ కలియుగమున వీనిలో మొదటి రెండు మార్గములను అవలంబింపఁ జాలువా రరుదుగా నుందురు. ఇంక మూఁడవదైన భక్తి మార్గమును స్త్రీలనక పురుషులనక, బాలురనక, వృద్ధులనక, పండితులనక, పామరులనక అందఱు ననుసరించి మోక్షసౌధమును జేరవచ్చును.

వేదార్థోపబృంహణార్థమై భగవంతుఁడగు కృష్ణద్వైపాయనుఁడు బ్రహ్మసూత్ర శ్రీమద్భాగవతములతోపాటు పదునెనిమిది మహాపురాణములను ఉపపురాణములను కూడ రచించియుండెను. ఇవి కథోపాఖ్యాన పూర్వకముగా వేదనిక్షిప్తములైన ధర్మ నీతి తత్త్వములను జిజ్ఞాసువు లందఱికిని సుబోధ మొనరించును. పదు

నెనిమిది పురాణములలో భాగవత మొకటి. ఇది శ్రీమద్భాగవతమా, దేవీ భాగవతమా, అను విషయమున పండితులలో వివాదమున్నది. కాని పలువురది శ్రీ మద్భాగవతమేయని భావించుచున్నారు. ఇది యెంత మనోహరమో, భాషాభావము లందంత క్లిష్టమైనది. అందు చేతనే "విద్యావతాం భాగవతే పరీక్షా" అను నానుడి యేర్ప డుటయు, పోతరాజు "భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు శూలి కైనఁ దమ్మిచూలికైన" నని చెప్పుటయు సంభవించినది. "భగవతః ఇదమ్" (భగవంతునికి సంబంధించునది) అని భాగవత శబ్దమునకు వ్యుత్పత్తి ఇందు భగవన్మాహాత్మ్య బోధకములైన విషయములు కథలు అనేకములుండును.

సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరములు, వంశాను చరితము అను పంచలక్షణములు పురాణమునందుండును. శ్రీ మద్భాగవతము పురాణమగుటచే నిందా పంచలక్షణములును కలవు. వీనితో పాటిందు శ్రీమన్నారాయణునికి సంబంధించిన ఏక వింశత్య వతారములును (21) వర్ణింపఁబడియున్నవి. "యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత" "పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం, ధర్మ సంస్థాప నార్థాయ సంభవామి యుగే యుగే" అని శ్రీ మద్భగవద్గీతలో భగవంతుఁడు చెప్పినట్లాతఁడు ధర్మ సంస్థాపనము కొఱకును, సాధురక్షణ, దుష్టశిక్షణముల కొఱకును భూమిపై నవతరించుచుండును. ఆ యవతారముల విషయమే శ్రీమద్భాగవతము నందు ప్రపంచింపఁబడినది. మత్స్య కూర్మాద్యవతారములన్నియు నవతార ప్రయోజనములను నిర్వ

హించినమాట వాస్తవమేయైనను "కృష్ణస్తు భగవాన్ స్వయ" మ్మను సూక్తి ననుసరించి యిందు దశమస్కంధమున శ్రీ కృష్ణుని జన్మాదివృత్తాంతములు విపుల తరముగా వివరింపఁబడినవి. భాగవత తారహారమునకు దశమస్కంధము తరళ ప్రాయము.

శ్రీ మద్భాగవతమున కర్మజ్ఞాన విషయములు కూడ ప్రతిపాదింపఁబడినను భక్తికే అందు ప్రాధాన్యము. మోక్షప్రాప్తి కదియే, పరమసాధనమని యది బోధించును. అందలి కథోపాఖ్యానము లన్నియు భక్తిమహత్త్వ ప్రతిపాదనము నందే పర్యవసించును. జగద్గురు శ్రీ శంకరాచార్యులవారు కూడ భక్తిని నిరసింప లేద నుటకు ''మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ" అని వివేక చూడామణిలో చెప్పియుండుట నిదర్శనము. సత్యముకూడనంతే. కలియుగము నందలి జనులు కర్మజ్ఞాన మార్గముల నవలంబింపఁ జాలని వారగుటచే భక్తినే ఆశ్రయింపవలయును. సంసార సాగర తరణమున భక్తియే నిరపాయమైన నౌక. వ్యాసభగవానుఁడు భాగవతము నిగమ కల్ప తరువు నుండి జాఱిన ఫలమని చెప్పియుండెను. అది కల్పతరువువలె భక్తులకు సర్వాభీష్టములను సిద్ధింపఁజేయును.

వ్యాసుఁడు సంస్కృతమున రచించిన శ్రీ మద్భగవతమును మహాభక్తుడును, కవిపుంగవుఁడునైన బమ్మెర పోతరాజు గద్య పద్యాత్మకముగా తెలుఁగున కనువదించెను. ఆతఁడు రచించిన భాగవతము నందలి కొన్ని భాగములే కారణమ చేతనో శిథిలమగుటచే వాని నతని మిత్రులో శిష్యులోయైన గంగన, సింగన, నారయ యను

వారు పూరించిరి. అయినను తెలుఁగున భాగవతము మాట విన్నం తనే పోతరాజే తలంపునకు వచ్చును. ఆంధ్ర దేశమున నతని భాగ వతమున కున్నంత ప్రచారము మఱే గ్రంథమునకును లేదనుటలో నతిశయోక్తి లేదు. అందుకతని పద్యములందలి ధారాశుద్ధియు నా న్యతో దృశ్యమైన మాధుర్యమును కారణములు. అందలి పద్యము లొండో, రెండో నోటికి రాని అక్షరాస్యుఁడు మొన్న మొన్నటి వఱకు ఆంధ్ర దేశమున నుండెడివాఁడుకాదు. కాలవైపరీత్యముచే నిప్పుడందలి పద్యములను కంఠగతము లొనరించుకొనువారి సంఖ్య చదువుకొన్న వారిలోనే చాల తక్కువైనది. పోతరాజు సంస్కృత భాగవతమును యథాతథముగా నాంధ్రీకరించియుండలేదు. భక్తిభావ భరితమైన భాగముల నాతఁడు పెంపొందించి యుండెను. అది గాక పద్యకావ్యముల నర్థము చేసికొనఁగలవా రిప్పుడెందరో యుండరు. అందుచే సంస్కృత భాగవతమునకు రెండు మూడు వచనానువా దములు కూడ వెలసినవి. భాగవతమువంటి ఉత్తమ గ్రంథమెంత అధికముగా ప్రచారము పొందిన లోకమున కంతమేలు కలుగును.

తపోనిష్ఠాగరిష్ఠులు, యోగిపుంగవులు, భక్తశిఖామణులునైన శ్రీశ్రీశ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారు జగద్ధితార్థమై శ్రీ భాగవ తము నందలి విషయములను కథదృష్టాంతానుభవపూర్వకముగా సరళసుందరమైన హిందీభాషలో నఱువది సంపుటములుగా వచన రూపమున రచించియుండిరి. అది హిందీ బాషాభిజ్ఞుల అదృష్టము. వానిని భక్తవరేణ్యులు శ్రీ రామశరణ్ కుందుర్తి వేంకటనర్సయ్య గురుపుంగవులు సర్వసుబోధమైన భాషలో తెలిఁగించి యుండిరి. భక్తి ప్రధానమైన శ్రీ మద్భాగవతమును భక్తవరేణుఁడైన పోత

వారు పూరించిరి. అయినను తెలుఁగున భాగవతము మాట విన్నంతనే పోతరాజే తలంపునకు వచ్చును. ఆంధ్ర దేశమున నతని భాగవతమున కున్నంత ప్రచారము మఱే గ్రంథమునకును లేదనుటలో నతిశయోక్తి లేదు. అందుకతని పద్యములందలి ధారాశుద్ధియు నాన్యతో దృశ్యమైన మాధుర్యమును కారణములు. అందలి పద్యము లొండో, రెండో నోటికి రాని అక్షరాస్యుఁడు మొన్న మొన్నటి వఱకు ఆంధ్ర దేశమున నుండెడివాఁడుకాడు. కాలవైపరీత్యముచే నిప్పుడందలి పద్యములను కంఠగతము లొనరించుకొనువారి సంఖ్య చదువుకొన్న వారిలోనే చాల తక్కువైనది. పోతరాజు సంస్కృత భాగవతమును యథాతథముగా నాంధ్రీకరించియుండలేదు. భక్తిభావ భరితమైన భాగముల నాతఁడు పెంపొందించి యుండెను. అది గాక పద్యకావ్యముల నర్థము చేసికొనఁగలవా రిప్పుడెందరో యుండరు. అందుచే సంస్కృత భాగవతమునకు రెండు మూడు వచనానువాదములు కూడ వెలసినవి. భాగవతమువంటి ఉత్తమ గ్రంథమెంత అధికముగా ప్రచారము పొందిన లోకమున కంతమేలు కలుగును.

తపోనిష్ఠాగరిష్ఠులు, యోగిపుంగవులు, భక్తశిఖామణులునైన శ్రీశ్రీశ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారు జగద్ధితార్థమై శ్రీ భాగవతము నందలి విషయములను కథదృష్టాంతానుభవపూర్వకముగా సరళసుందరమైన హిందీభాషలో నఱువది సంపుటములుగా వచన రూపమున రచించియుండిరి. అది హిందీ బాషాభిజ్ఞుల అదృష్టము. వానిని భక్తవరేణ్యులు శ్రీ రామశరణ్ కుందుర్తి వేంకటనర్సయ్య గురుపుంగవులు సర్వసుబోధమైన భాషలో తెలిఁగించి యుండిరి. భక్తి ప్రధానమైన శ్రీ మద్భాగవతమును భక్తవరేణుఁడైన పోత

నిగమకల్పతరో ర్గళితం ఫలం
శుకముఖాదమృతద్రవ సంయుతం
పిబత భాగవతం రస మాలయం
ముహురహో రసికా భువి భావుకాః

- సంస్కృత భాగవతము

లలితస్కంధము కృష్ణ మూలము శుకా
లాపాభిరామమ్ము మం
జులతాశోభితమున్ సువర్ణ సుమన
స్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వల వృత్తమ్ము మహాఫలమ్ము విమల
వ్యాసాలవాలమ్మునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరు వు
ర్విన్ సద్ద్విజశ్రేయమై

- శ్రీమదాంధ్ర మహాభాగవతము

—

# విషయ సూచిక

# భాగవత కథ

## జగన్మోహినీ

## పరోపకారమే ప్రభువు యొక్క పరమారాధన

శ్లో॥ తప్యంతే లోకతాపేన, సాధవః ప్రాయశో జనాః ।
పరమారాధనం తద్ధిపురుష స్యాఽఖిలాత్మనః ॥

శ్రీభాగ. ౮ స్కం. ౭ అ. ౪౪ శ్లో॥

క॥ పరహితము సేయ నెవ్వఁడు
పరమ హితుండగును భూతపంచకమునకుం
బరహితమె పరమధర్మము
పరహితునకు నెదురలేదు పర్వేందుముఖీ ॥

క॥ హరిమది నానందింపఁగ
హరిణాక్షి జగంబులెల్ల నానందించున్
హరియును జగములు మెచ్చఁగ
గరళము వారించుటొప్పుఁ గమలదళాక్షీ ॥

శ్రీమదాంధ్ర భాగవతము

సర్వత్ర శ్రీహరిని జూచుటయే సర్వసాధనములకును మూలము. ఒక్క శ్రీహరి యనేకరూపములను ధరించినాడు. ఒక్క బంగారమే కాసులు కంటె, కుండలములు, కంకణములు, కమ్మలు మొదలగు వివిధాభరణము లైనట్లే విశ్వంభరుడు చాలగనయ్యెను. జీవుడు తత్వతః తెలిసికొనినాడో ఆతఁడు కృతార్థుఁడగును ద్వితీయాద్వై భయమ్. రెండవదుండినచో నెల్లప్పుడును భయముండును. ఏకత్వమున భయము లేదు. ఏకత్వమెచ్చటకలదో అచ్చట ప్రేమ కలదు. ప్రేమయే ప్రభుస్వరూపము. రెండుగాఁగనఁబడు సమష్టి, వ్యష్టి కలిసి సర్వభూతైక్యమే యైనపుడు, అచ్చటనే ప్రభువు ప్రకటమగును. ఇదినీది, ఇదినాది యను నీద్వైతమెచ్చట యున్నదో అచ్చటనే కలహము. రాగము, ద్వేషము, యుద్ధము, పోట్లాట, దుఃఖము, శోకము, నానావిధములగు నుపద్రవములు బయలుదేరును. కావున గురుదేవుడు సమస్త సాధనములను గూర్చి చెప్పుచుఁ జివరకిట్లనెను :- "హరి సర్వత్ర కలడు. ఘటఘటముల గలఁడు. అందరలోఁ నాతనిని జూడుము. ఎవ్వరియెడలను రాగ ద్వేషములను జెందరాదు." అర్చావిగ్రహమందు హరివ్యాపించి యున్నాడు, కాని యాతఁడు మాటలాడఁడు, కాని జనతారూపమగు జనార్దనుని సేవ ప్రత్యక్షసేవ, అచ్చట నడుగడుగునకును సంయమ. ఆత్మాన్వేషణములకు సమయము చిక్కును. అందుకనియే మనుష జీవకోపకారా రాధనమును బరమారాధనముగఁ జెప్పినారు.

శ్రీశుకదేవుఁడిట్లనెను :- "రాజా! సమాధిసుఖమును వదలి శంకరుడు హాలాహలము సేవఁబానము చేసెనని నీవడిగితివి. రాజా! సమాధిలో నుండుటెందులకో నీవు చెప్పుము."

రాజిట్లనెను :- "స్వామీ ! ఈజగత్తును, మరవవలయును. ప్రపంచములో నెన్నిసుఖ దుఃఖములు, పుణ్యపాపములు, ధర్మాధర్మములు మొదలగు ద్వంద్వములు కలవో ఇవన్నియును బరిణామమున దుఃఖము నొసంగును. సమాధిలో నీద్వంద్వములుండవు. నిర్ద్వంద్వులై నిజానందమున మగ్నులగుదురు. ఆత్మసుఖాను భవమును జెందుదురు."

శ్రీశుకుఁడిట్లనెను :- "అనఁగా దీనిభావము స్వపర భేదమునకు సంబంధించిన మిథ్యాభి నివేశమును మరవవలయుననియే. మనమీసంపూర్ణ జగత్తును నాశ్రీహరి స్వరూపముగ భావించి, యన్నిటి యందును నారాధా రమణుని యందు రమించుచుండుటను జూచుటకుఁ బ్రయత్నించు చుండినఁ గన్నులు తెరచుకొని యున్నను సమాధియే యగును."

రాజిట్లనెను :- "స్వామీ ! అదెట్లుకాగలదు ?"

శ్రీశుకుఁడిట్లనెను:- "అదెట్లనగా మనము, పరులను భేదమును త్యజింపవలయును. పరాయివారెవరును లేరు. పరులనఁబడువారు తనవారే. తనకాలికి ముల్లుగ్రుచ్చుకొనిన నెట్లుబాధపడుదుమో అట్లే యితరుల కష్టములయెడలను ననుభవింపవలయును. మనకు దుఃఖములు కలిగిన వానిని నివారించుకొనుట కెట్లు ప్రయత్నించెదమో యితరుల దుఃఖములను గూడ తమ దుఃఖములనుకొని వానిని నివారించుటకుఁ బ్రయత్నింప వలయును. ఇదియే సర్వత్ర శ్రీహరినిఁ జూచు సాధనము."

రాజిట్లడిగెను :- "స్వామీ! ఇది శ్రీహరి ఆరాధనముకాదు. ఇది పరోపకారము, పుణ్యకార్యము, పుణ్యకార్యమునకు ఫలము స్వర్గము. స్వర్గమును నశ్వరమైనదే. అట్టి యెడలఁ బరోపకారము ప్రభువు యొక్క పరమారాధన మెట్లు కాఁగలదు ?"

శ్రీశుకుఁడిట్లనెను :- "రాజా! నీవు శ్రద్ధగా నీవిషయమును విచారించుము. మనమితరుల దుఃఖములకు దుఃఖించి వారి దుఃఖములను బోఁగొట్టుటకుఁ బ్రయత్న శీలురమైనచో సర్వత్ర ఆ హరినే చూడగలుగుదుము. ఇట్లు చేయఁగాఁ జేయఁగా స్వపరభేదభావము తొలగిపోఁగలదు. పుత్రుఁడెట్లు తండ్రియొక్క రూపమో అట్లే జగత్తు భగవంతునియొక్క రూపము. నీవేదైన వస్తువును పుత్రునకిచ్చిన సంతోషించినట్లు తండ్రికిచ్చిన నాతఁడు సంతసింపఁడు. అట్లే తనస్వరూపమగు జనతాసేవవలనఁ బ్రసన్నుఁడైనట్లు భగవానుఁడు తన పూజచేఁ బ్రసన్నుఁడుకాఁడు. కావున జప, తప, పూజా పారాయణాది భగవదారాధనము కంటె జనతా జనార్దనుని సేవ యొనర్చుటయే పరమారాధనము.

ఇదివిని శౌనకుఁడిట్లడిగెను :- "సూతా! జనతాసేవ యొనర్చువారలపై భగవానుఁడింతగాఁ బ్రసన్నుఁడేల యగుచున్నాఁడు ?"

అంత సూతుఁడిట్లనెను :- "స్వామీ! ఒకానొక రాజట నాడుచుండెను. ఒకవ్యక్తిపోయి ఆతఁడాడు ప్రదేశమును సుందరముగ నొనర్చెను. అచ్చటిపూలకు నీరుబోసి చల్లి స్వచ్ఛమొనర్చి

చిమ్మెను. ఇంకొకఁడు కలఁడు, ఆతఁడు రాజు వచ్చుచున్నప్పుడు వంగివంగి నమస్కారములను జేయుచుండును. వాని పాదములను బట్టుకొనును. ఆతని సమ్ముఖమునఁ దలవంచుకొని నిలుచుండును. బుద్ధిమంతుఁడగు రాజు ఆటస్థలమును బాగుచేసినవానియెడలఁ బ్రసన్నుఁడగునా లేక వంగి వంగి నమస్కారము లొనర్చినవారి యెడలనా ? తన యాటకు సహకార మొనర్చుచు, నాయాటస్థలము నలంకరించి బాగుచేసినవాని యెడల నూరకఁ బ్రణామ మొనర్చిన వానిమీఁద కంటె నెక్కువగఁ బ్రసన్నుఁడగునని చెప్పవలసివచ్చును. ఈ విషయమున నొక సుందర దృష్టాంతమును వినుఁడు."

ఒకదినమునఁ జాలమంది భక్తులొక మందిరమందు శంభు కీర్తన మొనరించుచుండిరి. చాలమంది పూజలొనర్చుచుండిరి చాల మంది నిరాహార మొనర్చి శివునారాధించు చుండిరి. భక్తులు గుంపులు గుంపులుగ నుండిరి. అచ్చట నొక వ్యక్తియుండెను. ఆతఁడు శివుని శ్రీవిగ్రహమును సేవించుటలేదు. నిరంతరము జనులసౌకర్యమును జూచుచుండెను. జనులకెట్లు మేలుకలుగునా యను నాలోచనమున నిమగ్నుఁడై యుండెను. తన శక్తిసామర్థ్యములకొలఁది యితరుల దుఃఖములను దూరమొనర్చుటకు సదా ప్రయత్నశీలుఁడై యుండెను. ఇట్లుండగాఁ బైనుండి ఒక విమానము దిగుట నందరును జూచిరి. దానిలో యమధర్మరాజు యొక్కమంత్రి చిత్రగుప్తుఁడు కూర్చుండియుండెను. లేఖినితో నేదో వ్రాయుచుండెను. దిగియాతఁడు క్రిందికివచ్చెను. భక్తులందరును విమానము చుట్టును మూగిరి. "దేవా ! మీరేమి వ్రాయుచున్నారని ఒకరడిగిరి."

చిత్రగుప్తుఁడిట్లనెను :- "భగవంతుని మీఁద భ్రమ కలవారి పేర్లను వ్రాయుమని, భగవదాజ్ఞయైనది. నేను దానిని వ్రాయుచున్నాను."

ఇది వినఁగానే అందరును బరువిడి వచ్చిరి. ఒక్కఁడిట్లనెను :- "నేను భగవంతు నెక్కుడుగఁ బ్రేమించుచున్నాను." ఇంకొకఁడు "నేను భగవన్నామ జపమును జేయుచున్నాననెను, నేను నామకీర్తనమును జేయుచున్నాను నృత్యమును జేయుచున్నాను, గానమును జేయుచున్నాను, వాద్యములను వాయించుచున్నాననెను. మేమాతని ప్రేమతో మునిఁగి యిచ్చట కూర్చుండినాము. మా పేరులు తప్పక వ్రాయవలయుననిరి."

ఇంతలోనే ఆ పరోపకార వ్యక్తి వచ్చి యిట్లనెను : "దేవా! మీరు నా పేరు నీపట్టిలో వ్రాయవలదు, భగవంతునిఁ జూడలేదు. చూడనప్పుడు నేనాతనిని బుద్ధిచే నెట్లు ప్రేమింపఁగలను ? నాకాతడు రచించిన సృష్టి కనఁబడుచున్నది. నేను జనతారూపమునసే జనా ర్దను నెఱుఁగుదును. నేనీ జీవులను బ్రేమించెదను."

చిత్రగుప్తుఁడిట్లనెను:- "అయ్యా! నేనెవరైనఁ గోరిక నామ మును వ్రాయువాఁడనుగాను. ఇంకొకరు వలదనినఁ జేపను గొట్టి వేయువాఁడనుగాను. నా కుచితమని తోచినవి వ్రాసెదను." ఇట్లు పలికి యాతఁడు పేర్లను వ్రాసుకొని వెడలిపోయెను.

మఱునాఁడు మరలదే భక్తులావిమానము దిగుటను గాంచిరి, నేఁడు చిత్రగుప్తుఁడేమియును వ్రాయుటలేదు లేఖిని యాతని చెవిలో

నుండెను. ఆతడొక పట్టికచేసుకొని చదువుచుండెను, ఆతని విమా
నము క్రిందకుదిగఁగానే భక్తులలో నొకఁడిట్లనెను:- "దేవా ! మీరేమి
చదువుచున్నారు."

చిత్రగుప్తుఁడిట్లనెను:- "భగవంతునిచేఁ బ్రేమింపఁబడు వారి
పేర్లను జదువుచున్నాను."

అందఱును నుత్సాహముతో వచ్చి ఇట్లడిగిరి:- "మాపేరు
న్నదా ? భగవానుఁడు మమ్ముఁ బ్రేమించుచున్నాడా ?"

పరోపకారి సజ్జనుఁడిట్లను కొనెను:- "నాపేరీపట్టిలో నుండ
నేయుండదు. ఏలయనగా నేను జనులను ప్రేమించుచున్నాను."

భక్తులు బలవంతము చేయఁగా జిత్రగుప్తుఁడా పట్టికను జది
వెను. జనుల యాశ్చర్యమునకు మేఱలేదు, అన్నిటి కంటెను ముం
దుగా నా జనసేవకుని పేరు పట్టికలోనుండెను.

సూతుఁడిట్లనెను;- "మునులారా ! సేవక ధర్మము సర్వ
శ్రేష్ఠమైనదిగాఁ జెప్పఁబడినది, సేవచేయునపుడు సేవకునకు నేని
తరులకు మేలొనర్చుచున్నానను నభిమానముండరాదు. తన వలన
నింతమందికి ఉపకారము జరుగుచున్నదనుకొనరాదు, ఇట్లనుకొన
వలయును:- "నేను ప్రభుసేవ చేయుచున్నాను, నాకర్తవ్యము
నెఱవేర్చుకొనుచున్నాను, చేయువాఁడును జేయించువాడును
శ్రీ హరియే కావున మహారాజా ! శివుఁడు విషపానమొనర్చి పరోప
కార మహత్యమును జెప్పెను. ఉపాసన యొక్క ఉత్కృష్టాదర్శ
మును సాధకులకుఁ జెప్పెను.

శ్రీ శుకదేవుడు పరీక్షిన్మహారాజుతో నిట్లనెను:- "రాజా! భవానీ నాథుని యీ యద్భుత కార్యమును గాంచి. అందఱుకామనలను నెరవేర్చు దేవాధిదేవుఁడగు మహాదేవుని నిస్స్వార్థత్యాగమును గాంచి సమస్తప్రజలును శ్రద్ధా, మైత్రి, దయా, శాంతి, తుష్టిపుష్టి క్రియా, ఉన్నతి బుద్ధి, మేధా, తితిక్షా, హ్రీ, మూర్తి, స్వాహా స్వధా మొదలగు వారందఱును సతీదేవియొక్క కనేక ప్రశంస లొనర్చిరి. తమ చెల్లెలి కిట్టి భర్త దొఱకినందులకై సాధు వాదముల నొనర్చిరి. బ్రహ్మ తన నలుముఖములతో సాధు సాధు అను శబ్దములను బలికెను. విష్ణు భగవానుఁడు భవానీ పతిని బ్రశంసించి ప్రశంసించి తృప్తినిఁ జెందలేదు.

శ్రీ శుకుఁడిట్లనెను:- "రాజా! విషపాన మొనర్చు నెడ విశ్వేశ్వరుని చేతినుండి కొంచెము విషము క్రిందఁబడెను, దానిని తేళ్ళు, పాములు, నల్లిగజ్జెపాములు మొదలగు విషజంతువులును విషముష్టి, నాభి మొదలగు విషసంబంధమగు ఓషధములందును చేరెను, అవి వానిని గ్రహించినవి. పైనఁ జెప్పఁబడినవి కఱచినను వానినిఁ దినినను ప్రాణులు చచ్చెదరు. విషమును విశ్వేశ్వరుఁడు త్రాగిన మీఁదట మరల దేవాసురులు క్షీరసముద్రమును మథింపసాగిరి ఉపారి దానిలో నుండి రత్నములు బయటఁబడు చుండెను.

క॥ హాలాహల భక్షణ కథ
హేలాగతి విన్న వ్రాయ నెలమిఁ బఠింపన్
వ్యాళానల వృశ్చికముల
పాలై చెడరెప్డు జనులు భయ విరహితులై॥

......

# క్షీరసాగరమునుండి రత్నోత్పత్తి

శ్లో॥ పీతేగరే వృషాంకేణ ప్రీతాస్తేఽమరదానవాః ।
మమథ్నుస్తరసా సింధుం హవిర్ధానీ తతోఽభవత్ ।
తామగ్నిహోత్రీ మృషయో జగృహుర్బ్రహ్మవాదినః ।
యజ్ఞస్య దేవయానస్య మేధ్యాయ హవిషే నృప ॥

శ్రీ భాగ. ౮ స్కం. ౮ అ. ౧-౨ శ్లో ॥

క॥ గరళంబుఁగంఠ బిలమున
హరుఁడు ధరించుటకు మెచ్చి యౌరా ననుచున్
హరియు విరించియు నుమయును
సురనాథుఁడుఁబొగడి రంత సుస్థిరమతితోన్ ॥

వ॥ మఱియు నారత్నాకరంబు సురాసురులు ద్రచ్చునెడ

క॥ తెల్లని మేనును నమృతము
జిల్లున జల్లించు పొదుఁగు శితశృంగములుం
బెల్లుగ నర్థుల కోర్కులు
వెల్లిగొలుపు మొదవు పాలవెల్లిం బుట్టెన్ ॥

ఆ॥ అగ్నిహోత్రి యనుచు నాసురభిని దేవ
మునులు పుచ్చుకొనిరి మున్నెఱింగి
విబుధ సంఘములకు వెరపుతో నధ్వర
హవులు పెట్టుకొఱకు నవని నాథ ॥

శ్రీ మదాంధ్ర భాగవతము.

దేనిలో స్వచ్ఛతయును, గాంతియును, బవిత్రతయును, దేజస్సును, నోజస్సును గలదో దానికి రత్నసంజ్ఞ కలదు. రత్నములలో లక్ష్మి నివసించును ప్రపంచములో నవరత్నములు ప్రసిద్ధములు ధేనురత్నము, తురంగ రత్నము, గజరత్నము, వనస్పతి రత్నము, స్త్రీ రత్నము, మణి రత్నము, ధన రత్నము, వారుణీ రత్నము, ఈ యన్నిటి యందును శ్రీదేవి నివసించును. ఈ రత్నములన్నియును బ్రయత్నముచే, బురుషోత్తము నాశ్రయించుటచేఁ బ్రాప్తించును. "ఉద్యోగి నం పురుష సింహముపైతి లక్ష్మి." ఉద్యోగియగు పురుషునకు లక్ష్మి ప్రాప్తించును. ఉద్యోగ మొనరించినను సఫలత శ్రీహరి చేతిలోఁ గలదు కావునఁ బ్రయత్న మొనర్చుచు హరిని సదా స్మరించు చుండవలయును.

శ్రీ శుకదేవుఁ డిట్లనెను :- "రాజా! శివుఁడు విషపాన మొనర్చుటచే విపత్తు తప్పిపోయినది. అందరకును సంతోషము కలిగెను. అందఱ చింతలును దూరమయ్యెను. ఇప్పుడందరను మరల నవీనోత్సాహము తోడను, నూతన స్ఫూర్తితోడను నడుములు బిగించి పూర్తి శక్తితో మిక్కిలి వేగముగ సముద్రమును మథించుచుండిరి. పెరుగును జిలుకు నప్పుడు నురుగు రానంతవరకు వెన్నరాదు. నురుగురాఁగానే వెన్నవచ్చుటకు కాలస్యముండదు ఇఁకఁ ద్వర త్వరగా వెన్న బయటకు వచ్చును. అవే విధముగ విషము రాఁగానే యిప్పుడు నురుగు బయలు దేరెను. ఇంతలోనే వెంటనే మంచి కొమ్ములు కలిగి పొడుగు తోఁకతో నత్యంత దర్శనీయమైన గామధేనువు దానినుండి యుత్పన్నమయ్యెను.

అంత శౌనకుఁ డిట్లనెను, సూతా! దీనిముందు గోవులు లేవా? సూతుఁడిట్లనెను:- 'ఉన్నవి ఎందులకు లేవు తప్పక యున్నవి: కాని దుర్వాసుని శాపముచే సమస్త గోవులయొక్క శ్రీ నశించిపోయెను. అవి చిక్కి శల్యములై పాలీయక శ్రీహీనము లయ్యెను, దేవాసురుల ప్రయత్నముచే సమస్తకోరికల నిచ్చు కామ ధేనువుత్పన్న మయ్యెను. ఎవరి వద్ద సుందరములును స్వఛ్ఛము లును హృష్టపుష్టములగు గోవులుకలవో వారికి కొదువయేమి కలదు బ్రాహ్మణులయొక్క శ్రీ యజ్ఞ తపములందు కలదు ఘృతమున యజ్ఞములు జరుగును, ఘృత, దుగ్ధ, దధ్యాదులచే యజ్ఞములందు ప్రాయశ్చిత్త శుద్ధియగును. గోమయము, గోమూత్రము, గోఘృతము గోదధి, గోదుగ్ధములు పంచ గవ్యములు. గోవులు తేజోహీనలై పోఁ గానే బ్రాహ్మణులును తేజోహీనులైరి ఆ తేజమంతయును బుంజీ భూతమై మరల సముద్రము నుండి వెలువడి సమస్త బ్రాహ్మ శ్రీని ప్రసాదించు నదియై గోరూపమున సముద్రమునుండి వెలువ డెను అందువలన గోవును సర్వశ్రేష్ఠమగు రత్నమనిరి చతుష్పా దయై సుందర సుమనోహరమును దర్శనీయమగు గోవునుగాంచి అగ్నిహోత్రము కొనచ్చు మునుల మనస్సు ఉవ్విళ్ళూరెను, వారి ట్లనుకొనిరి:- "ఈ గోవు మాకు లభించినచో సమస్తమును మాకు బూర్ణము కాఁగలదు. ఇది అగ్ని హోత్ర సామగ్రినుత్పన్నము కావించునది, బ్రహ్మలోక మార్గ స్వరూపమగు యజ్ఞాదులుపయో గించు ఘృత దుగ్ధాదులు దీనివలన నుత్పన్న మగుచున్నవి, కావున నిది మన తేజస్సును దపస్సును నోజస్సును వృద్ధినిఁ బొందించును.

గోవు పుట్టఁగనే దీని నెవరు తీసుకొనవలయునను గోల పుట్టెను. ఇది యెవరి భాగమునకు రావలయుననఁగా నంత భగవానుఁ డిట్లనెను:- "మీరిద్దరును గశ్యపముని యొక్క సంతానము ఇద్దరును ధర్మ మర్మములను దెలిసిన వారు. మీరిద్దరును గో బ్రాహ్మణభక్తులే. శాస్త్రీయ నియమమేమనఁగా దన యింటిలోనున్న యన్నమును, ఫలమును నింకేమైన వస్తువును సర్వప్రథమ వస్తువును దానిని ముందుగా బ్రాహ్మణులకు దానము చేయవలయును. సమస్త శుభకర్మల పూర్తికొరకు గోదాన మొనర్పవలయును. మీరందరమృతము కొఱకై సముద్రమంథనమను మహాకార్య మొనర్చుచున్నారు. కావున నిద్దరును గలిసి ముందుగా నుత్పన్నమైన నీ రత్నమును బ్రాహ్మణుల కొసంగుడు. బ్రాహ్మణులు సంతుష్టులైనచో దీనినుండి శీఘ్రాతిశీఘ్రముగ నొక దానికి మించినది మరి యొకటిగ ననుపమ సుందర రత్నములుత్పన్నము కాఁగలవు."

భగవంతుని యాసలహా దేవాసురులకు నచ్చెను. ఏలయనఁగా నిద్దరును నగ్నిహోత్ర మొనర్చువారే. ఇద్దరును బ్రాహ్మణులను గౌరవించి దానము నొసంగువారే. కావున దైత్యుల పక్షమున బలియును, దేవతాపక్షమున దేవేంద్రుఁడును గామధేనువుతోఁకను బట్టి కొసిరి. వేదపాఠులగు బ్రాహ్మణులు విధి విధాన పూర్వకముగ సంకల్పమును జదివి యా గోదానమును గ్రహించిరి."

ఇప్పుడు మరల సముద్రమును మథించుచుండిరి. ఈసారి అది సుందరమైన, అత్యంత దర్శనీయమైన నుచ్చైఃశ్రవమను

నశ్వము పుట్టెను. అది అత్యంతము హృష్టపుష్టముగను, మనో హరముగను నుండెను. అది చంద్రునివలె శ్వేతవర్ణముగనుండెను. అది చంచల దృష్టులతో, మెడమీఁదఁగల జూలును గదలించుచు నటునిటుఁ జూచుచుండెను. దేవతలిట్లనుకొనిరి :- "ఇది మనకు దక్కవలయును. అచ్చట అసురరాజగు బలి పైకిరాఁగానే లొట్టి వేసినాడు. ఆతఁడు నిర్భయముగ నిట్లనెను :- ఈ గుఱ్ఱమును నేను తీసికొందును.

మీరేవస్తువు కొరకై ఆశపడ రాదనియు, బోరాడరాద నియు భగవానుఁడిది వరకే దేవతలకు నేర్పియుండెను. కావున దేవేంద్రుఁ డిట్లనియె :- "మంచిది నీవు దానినిఁ దీసికొనుము. నీవు పెద్దవాఁడవు. పెద్దవస్తువు పెద్దలకే యుపయోగము." ఈ విధ ముగ నాగుఱ్ఱము విరోచన పుత్రుఁడును నసురరాజునగు బలి భాగ మునకు వచ్చెను. మరల సముద్రము మథింపఁబడు చుండెను.

ఇట్టి యందమైన గుఱ్ఱము వచ్చు నప్పటికి అందరకును నుత్సాహమినుమడించెను. అందరును ననుపమ వస్తువులకొరకై మరలఁ బూర్ణమగు శక్తితో మథించుచుండిరి. కొంచెము సేపిట్లు చూడగా సముద్రమందు పెద్దపెద్ద నాలుగు దంతములు కలిగి, కైలాస శిఖరమువలె లావుగ నుండి తెల్లగనున్న నైరావతమను గజరాజ ముత్పన్నమయ్యెను. దాని కాంతి అనుపమానముగ నుండెను. మందరాచల పర్వతము కడనది నిలుచుండిన నెట్లున్న దనఁగా శ్వేతగిరి సుతుఁడు గిరిరాజు మందరాచలము కొఱకేదో

సందేశమును గొనివచ్చినట్లుండెను. దానిని జూడగనే యింద్రునకు మిక్కిలి లోభము కలిగెను. భక్తవత్సలుఁడగు భగవానుఁడాతని భావమును గ్రహించి యిట్లనెను :- "ఇప్పుడు వంపిణి సరిగాఁ గుదిరినది. ఒక వస్తువును బలి గ్రహించినాఁడు కావున న్యాయతః దీనికధికారి దేవేంద్రుఁడు."

దైత్యుల కీవిషయములో వాదములేదు. వీరికిరత్నములకు గొడువలేదు. దేవత లమృతమునకై సముత్సుకులై యుండిరి. అందువలన వారిట్లనిరి:- "అవును, ఇదియుచితమే. దీనిని శచీపతి యింద్రుఁడే తీసికొనవచ్చును." ఆ దినమునుండి ఐరావతమింద్రునకు వాహనమయ్యెను.

సముద్రము మరల మథింపఁబడు చుండెను. ఈ సారి మిక్కిలి ప్రకాశించుచు దశదిశలను బ్రకాశింపఁ జేయుచుండు, కౌస్తుభమను నొక పద్మరాగమణి యుత్పన్నమయ్యెను. దానిమీఁదకు భగవానునకు మనస్సుపోయెను. అతఁడిట్లను కొనెను :- లక్ష్మీదేవి వచ్చినచో నామెకు నాహృదయము తప్ప వేఱుస్థానము ప్రియమైనది లేదు కావున నామె కూర్చుండుట కాసనము కావలయును. లక్ష్మినివాస స్థానము మణియే అందులకనియే ధనిక శ్రీమంతులు కంఠమున మణిమాలను ధరించు చుందురు." ఇట్లాలోచించుకొని భగవానుఁ డిట్లనెను :- "చూడుఁడు. అందరును నెవరికి రుచికలిగిన వస్తువును వారు తీసికొని పోవుచున్నారు గదా పరిశ్రమను నేనుగూడ చేయుచున్నాను. నేనింక నేమంతగా నడుగునది లేదు కాని నియమాను సారముగ నీసారి నావంతు, తరువాత మీయిష్టము.

భగవానుఁడిట్లు డొంకతిరుగుడు మాటలు మాటలాడఁగానే విని యీ కౌస్తుభమణిని శ్యామసుందరుఁడు గైకొనఁ జూచుచున్నాఁ డని తెలిసికొనిరి. అంతనందఱును నైక్యకంఠమున నిట్లనిరి :- "ప్రభూ! ఈ మణిమీకే యుపయోగము. మీరి మణిని దీసికొన్నచో మాకందఱకును సమ్మతమే దీనిని మీ వక్షఃస్థలమునందు ధరించుఁడు" అందరును జెప్పఁగా భగవానుఁడు దానిని వక్షఃస్థలమున నలంకరించుకొనెను.

ఒకదాని తరువాత నొకటి సుందర రత్నములుత్పన్నమగు చుండుటను గాంచి వారందరి యుత్సాహము నూఱు రెట్లధిక మయ్యెను. అందరును నేమాత్రము నాలస్య మొనర్పక క్షీరసాగర మును మథించుచుండిరి. తదనంతరము కదలుచు గ్రదలుచు సుందర పత్రములు గల కల్పవృక్ష ముత్పన్నమయ్యెను. దానికి పుష్పము లుండెను. వాని గంధము యోజనముల కొలఁది కొట్టుచుండెను. అది యుత్పన్నము కాఁగానే ఆస్థానమంతయును సురవాసితమయ్యెను. దాని నెవరు గైకొనవలయునని యుద్ధరకును వాద వివాదములు కలిగెను."

అప్పుడజిత భగవానుఁ డిట్లనెను :- "అయ్యలారా! ఇట్టి వస్తువే ఒక్కరికో యుండరాదు. ఇది సమ్మడి వస్తువు. స్వర్గము మీఁద నధికారమెవరికైన నప్పుడిది వారిది. స్వర్గమునకుఁబోవు స్వర్గీయ పుణ్యాత్ముల కోరికల నన్నిఁటిని నిది పూర్ణము కావించును. ఈ నాయభిప్రాయము మీకందరకును సమ్మతమేమో చెప్పుఁడు."

అందఱేక కంఠమున నిట్లనిరి :- "స్వామీ! నమ్మతమే వివాదము సమాప్తమైనది. కల్పవృక్షమును స్వర్గమునకుఁ బంప వచ్చును."

సముద్రము నింకను మథించుచుండిరి. ఈసారిదానిలో నుండి మిక్కిలి చక్కనివారును, సుకుమార శరీరులును, యౌవనమదముచే నుండి అందర మనములను మథించువారును. వస్త్రభూషణాలంకృతులునగు నప్సరస లెందఱో యుత్పన్నమైరి. వారివైఖరిలో మాదకత కలదు. వారు హాసవిలాసములతో నిండిన జంచల దృష్టులతోడను లజ్జతో సురాసురులను జూచుచుండిరి. వారి నడకలు మనోహరముగను నాకర్షకముగను నుండెను. ఆ స్వర్గీయలలనలు మూర్తీభవించిన నానందస్వరూపులుగనుండిరి. వారినిఁ గాంచి దేవతలును దైత్యులును నిర్ఘాంతపోయి, పనులనన్నిటిని వదలి వారినట్లె చూచుచు నిలువఁబడిపోయిరి సముద్రమంథన కార్యమాగిపోయెను. భగవానుఁడిట్లనుకొనెను :- "ఈ స్త్రీరత్నములు విచిత్రముగవచ్చిరి. వీరంతయును వేడుకను బెల్లముగఁ జేసినారు. మాఖేలనమును జెడఁగొట్టిరి. వీరికొఱకై దేవాసుర సంగ్రామము జరుగునని తోఁచుచున్నది." దేశకాలముల నెఱిఁగిన హరి యిట్లనెను :- "స్త్రీరత్నము లన్నిటికంటె శ్రేష్ఠరత్నములు. గోవుతోఁక పవిత్రమందురు. మేఁక చెవులు పవిత్రములు. కొన్నిటి కంఠము పవిత్రమైనది కాని స్త్రీకి సర్వాంగములు పవిత్రములైనవి. వీరు నిర్దోషులు. వీరిదర్శనము మంగళప్రదములు. ఆ దువలన వీరిని మంగళ ముఖులందురు. నీతి శాస్త్రజ్ఞులు "స్త్రీరత్నదుష్కులాదపి" స్త్రీరత్నము దుష్కులములో

నుత్పన్నమైనను దానిని గ్రహింపవలయును. వీరు మానవస్త్రీలు కారు. వీరు స్వర్గస్త్రీలుగ వ్యవహరింపఁ బడెదరు. వీరివలన స్వర్గ శోభ వృద్ధినిఁ బొందును. వీరొక్కరి సంపత్తుకాదు. వీరిమీద స్వర్గములోని పురుషు లందరకును సమానాధికారము కలదు. స్వర్గ నివాసు లందరును వీరి నుపభోగించెదరు. అయినను వీరిపవిత్రత కేమియును లోపముకలుగదు. వీరు మావాండ్రను కావలయునని యెవరును గోరఁగూడదు."

భగవానుని యీ వాక్యములచే నందరును సంతుష్టులైరి. మేమేనదా స్వర్గమున కధికారుల మయ్యెదమని అసురులనుకొను చుండిరి. వీరు తమకు దక్కఁగలరను కొనిరి. దేవతలును దీని కభ్యంతరము పెట్టలేదు.

సూతుఁ డిట్లనెను :- "మునులారా! ఈ విధముగ నాలు రత్నము లుత్పన్నమయ్యెను. అమృతము కొరకు సముద్ర మంథ నము జరుగుచునే యుండెను.

......

# సముద్రమునుండి లక్ష్మి పుట్టుట

శ్లో॥ తతశ్చా విరభూత్సాక్షాచ్ఛ్రీ రమా భగవత్పరా ॥
రంజయంతీ దిశః కాన్త్యా విద్యు త్సౌదామనీ యథా ॥

శ్రీ భాగ. ౮ స్కం. ౮ అ. ౮ శ్లో॥

క॥ తొలుకారు మెఱుఁగు కైవడిఁ
దళ తళ మని మేను మెఱవ ధగధగ మనుచున్
గలుముల నీనెడు చూపులఁ
జెలువంబుల మొదలి టెంకి సిరిపుట్టె నృపా ॥

శ్రీమదాంధ్ర భాగవతము

ఐశ్వర్య, తేజ, యశ, శోభా, జ్ఞానవైరాగ్యరూపమగు సంపత్తిని గోరని వారీలోకములో నెవరుందురు ? శ్రీయనిన నందరకును నిష్టమే. శ్రీహీనుఁడగువ్యక్తి ప్రపంచములో నేమియును చేయఁజాలఁడు, శ్రీకనేక రూపములు కలవు, బ్రాహ్మణులకడ నామె బ్రాహ్మీశ్రీరూపమున నుండును. క్షత్రియులకడ నామె రాజ్యశ్రీరూపమున నివసించును, వైశ్యులకడ నది వ్యాపారాదులందు లక్ష్మిరూపమున నుండును, శూద్రులకడ నది సేవారూపమున దర్శనమొసంగును, ఒక్కొక్కచోట కాంతిగను, నింకొకచోట శోభారూపమునను, నింకొకచోట సమృద్ధిరూపమునను, మఱియొక యెడ మున్నతి రూపమునను దర్శన మొసంగుచుండును, భగవంతుని

వదలి కేవలము లక్ష్మినే కోరి, ఆమె నారాధించినచో నచ్చటికామె పోవునుగాని, అన్య మనస్కుయైపోవును. ఆమెను గలిగినవానికి మనశ్శాంతి యుండక యెప్పుడు నశాంతిగనుండును, ఆచ్చట తన ప్రియతముని దిరస్కారమును గాంచి యెక్కువ కాలముండదు. కావున నొంటరిగా లక్ష్మి దేవిపై మాత్రమే మనస్సును బోనిచ్చి నచో నామెను ననునయ వినయముశొనర్చినచో నామె యూరక వారివైపునకుఁ జూచును గాని వారిని వరింపదు. ఏలయనఁగా నామె స్వర్గములోని సురవధుటీ మణులవంటిది కాదు, ఆమె శ్రీహరి కనన్య. ఆమె భగవంతుని వదలి యెచ్చటను నివసింపదు. ఆమె ఒకరూపమునఁ జంచలమై ప్రపంచమునఁ దిరుగుచున్న నొక్క రూపమున శ్రీనివాసుని చరణసన్నిధిని నిత్యనివాసమొనర్చుచుం డును, తన పతి నెవ్వఁడు ప్రేమించునో ఆమె వారి యధీనమున నుండవలసి వచ్చును.

శ్రీ శుక దేవుఁడిట్లనెను:- "రాజా ! శ్రీదేవి ఛాయవలె భగ వంతుని వెంటనుండునే, ఆమె ఇప్పుడు సముద్రము నుండి విష్ణు వల్లభ శ్రీయుత్పన్నమైనది.

అంత శౌనకుఁడిట్లడిగెను:- "సూతా ! లక్ష్మిదేవి శ్రీహరిని వీడియుండదనియు, ఛాయవలె సదా శ్రీహరి వెంటనుండుననియుఁ జెప్పితివి, ఇప్పుడామె సముద్రము నుండి యుత్పన్నమైనదని చెప్పుచున్నావు, లక్ష్మిదేవి భృగుపుత్రియని మేము వినియున్నాము దీని తాత్పర్యమేమి ?"

ఇదివిని సూతుఁడిట్లనెను:- "స్వామీ ! దీనికిఁ బ్రత్యుత్తర మును నేనిదివరకే యిచ్చియున్నాను. లక్ష్మీదేవి భగవంతునకు నిత్యసహచరి, ఆమె యెన్నఁడును భగవంతుని నొక్క క్షణమైనను వీడదు. ఆమె యుత్పన్నమగుట కేవల ముపచార మాత్రమే మనము ప్రాతఃకాలముకాఁగానే సూర్యుఁడుదయించి నాఁడందుము, సూర్యుఁడుదయించుటేమిటి ? మీరు ధ్యానముతో విచారించుఁడు సూర్యుఁడెన్నఁడును నస్తమించువాఁడుకాఁడు. అతఁడు సదా ఉదయించుచుండును. సుమేరుచ్ఛాయ అడ్డమువచ్చి కనఁబడక పోవుటచే సూర్యాస్తమైనదనుచున్నాము. మరలఁ గనఁబడినచో నుదయించె ననుచున్నాము. ఇదే విధముగ లక్ష్మీదేవియును సాంసారికులమగు మన దృష్టికిఁ గొంతకాలము కనఁబడక పోవుటచే నప్పుడు శ్రీనష్టమై పోయిన దందుము, మరల నది బయటఁబడినచో నుత్పన్నమైనదందుము. అనేక కల్పములలో ననేకస్థానములలో నుత్పన్నమగును. ఒకానొకప్పుడామె భృగుపుత్రియయ్యెను. ఇంకొకసారి కమలము నుండి యుత్పన్నమైనది. అందులకే ఆమెకు 'కమల' యను పేరువచ్చినది. ఒకప్పుడు శివశక్తి ఉమాయంశమున నుత్పన్నమైనది, ఇంకొకప్పుడు సముద్రమునుండి యుత్పన్నమైనది. వారు పుట్టుటయనునది ఒక క్రీడా మాత్రమే." దుర్వాసుని శాపముచే లక్ష్మీదేవి సముద్రమున నదృశ్యమయ్యెను. అజిత భగవానుఁడు వివాహ మొనర్చుకొనవలసియుండెను. లక్ష్మి అతనికి నిత్యసహచరి, ఆమెను వదలి అతఁడింకొక దానిని వివాహమాడఁడు. అందువలన భగవానుఁ డమృత లోభమును గలిగించి దేవదైత్యులచే సముద్రమును మథింపఁజేసెను, ఏనుఁగును, గుఱ్ఱ

మును నొసఁగి యిద్దరను సంతుష్టిపఱచెను, అప్సరసలను, గల్ప వృక్షమును సార్వజనికమగు నుమ్మడి సొత్తుగ నొనర్చెను, కౌస్తుభమణి తానే అడిగి తీసికొనెను. ఇంకనిప్పుడు లక్ష్మిపుట్టినది.ఆమె అతని వస్తువే. అందువలన నాతఁడిది యెవరిభాగమని యడుగ లేదు."

శ్రీ శుక దేవుఁడిట్లనెను:- "రాజా! మెఱుగుతీఁగ వలెఁదన వస్త్రభూషణముల మెఱపులచే దశదిశలను దన యనుపమ ప్రకాశముచే ననురంజితము కావించుచు లక్ష్మీదేవి బయలు వెడలఁగానే ఆమె దర్శనమాత్రముచేతనే అందఱ మనస్సులును ముగ్ధులయ్యెను అందఱును నామెను ననురాగభరిత దృష్టులచేఁ జూడసాగిరి, అందఱు నామెను బొందుటకు సముత్సుకులైరి. లక్ష్మీదేవి లజ్జించుచుఁ దన రూపౌదార్య, యౌవన వర్ణమహిమముచే నందఱ మనస్సులను ముగ్ధులను గావించుచు, విలాసపూర్ణమగు దృక్కులతోఁ జూచుచు మంద మంద మనోహరగతిచే నడచుచు నందఱ మధ్యకువచ్చి నిలుచుండెను; ఆమెనుగాంచి అందఱును నిర్భ్రాంతపడిరి. అందఱును మనస్సులను బోఁగొట్టుకొనిరి, అందఱును విమూఢులైరి. ప్రతి వారును నీమె మాకు దక్కవలెననుకొనుచుండిరి; కాని ఆమె ఎవ్వరి వైపునను జూచుట లేదు. బ్రాహ్మణులు వ్యగ్రతతో నిట్లనిరి:- "మీరేమది చూచు చున్నారు. ఈమె త్రిలోకేశ్వరి యుత్పన్నమైనది. ఈమెకు విధివిధానముగ నభిషేకింపుడు. అభిషేకమైన తర్వాత నీమె యెవరిని వరించిన నాతఁడీమెకుఁ బతికాఁగలడు." ఇది వినఁగానే అందఱకును గొంచెము కొంచెముగా నాశలు కలిగెను.

కొందఱు తమకై శ్వర్యము కలదు కావునఁ దమ్మే వరించునను కొనిరి. కొందఱు తపఃప్రభావమును గూర్చి యోచించుచు నిట్లనిరి:- "మేము గొప్ప తపస్వులము, లక్ష్మీదేవి మమ్ములను వీడజాలదు" ఈ విధముగఁ గొందఱు తేజఃకారణముననుఁ, కొందరు తపము, ఐశ్వర్యము, ప్రతిష్ఠ సౌందర్యము సహాయమున లక్ష్మినిఁబొందుట కాశించుచుండిరి. లక్ష్మి తమయెడలఁ గృపజూచునని యిప్పుడంద రును గొద్దిగనో గొప్పగనో స్వాగతసత్కారము లొనర్చు చుం డిరి. నానా ఉపాయములను, గానుకలను నొసంగుచుండిరి అందఱ కంటె ముందుగా నింద్రుఁడామె కూర్చుండుటకై బహుమూల్యమగు నాసనము నొసంగెను. తదనంతరము గంగా, యమునా, సరస్వతీ మొదలగు నదులు మూర్తిమంతములై వచ్చిరి. వారు సువర్ణకలశము లతో జలములను నింపుకొని అభిషేకము నిమిత్తమై సిద్ధముగ నుంచిరి, భూమి పవిత్రములగు నోషధులను దెచ్చిసమర్పించిరి గోవులు పాలు, పెరుగు, నేయి, గోమూత్రము, గోమయము ఈ పంచగవ్యములను స్వయముగ వచ్చి యిచ్చెను. వసంతఋతువు చైత్ర వైశాఖములలో వచ్చు ఫలపుష్పములన్నిటినిఁ దెచ్చి యిచ్చెను. అన్ని సామగ్రులును ప్రోవైవ తరువాత వేదవాదులగు ఋషులు విధిపూర్వకముగ లక్ష్మీదేవికి అభిషేకించిరి.

ఆహా! ఆ యభిషేకోల్లాసవర్ణనము నేవిధముగఁ జేయఁ గలను. అది చూచితీరవలసిన సమారోహము. అందరును లక్ష్మీ దేవి యొక్క రూప, శీల, యౌవన, వర్ణ, సౌందర్య, హాస, విలాస, స్వభావములకు విమోహితులై కింకరులవలెఁ బనిచేయుచుండిరి.

లక్ష్మీదేవి తమవైపునకే కటాక్షపాత మొనరింపవలయునని కోరు కొనుచుండిరి. ఒక్కసారి తమవైపునకుఁ గన్నెత్తిచూచినఁ జాలు ననుకొనుచుండిరి. అభిషేక సమయమున గంధర్వులు మంగళగీత ములు పాడసాగిరి అప్సరసలు హావభావములను జూపుచు సుమధుర నృత్యమును గావించుచుండిరి. ఆకాశమునందున్న మేఘగణము మూర్తిమంతములై మృదంగ, పణవ, మురజ, ఆనక, గోముఖ, శంఖ, ఘంటా, వీణా వంశీ మొదలగు వివిధ వాద్యములను వాయించుచుండిరి. నలువైపులనుండి "జయ జయ" శబ్దములును, నమోనామేతిశబ్దములు వినబడుచుండెను, జయ జయకారములచేఁ నాకాశము ప్రతిధ్వనించెను. దశదిశలనుండి వచ్చిన దిగ్గజములు తమ తొండములందు సువర్ణకలశములను గ్రహించి లక్ష్మీదేవి నభి షేకించెను. ఆసమయమునఁ గమలాదేవిచేత గ్రీడాకమలములను ధరించి మందహాసమొనర్చుచు, గొంచెముగ సిగ్గుచే తలవంచుకొని నిలుచుండెను. వేదజ్ఞులగు బ్రాహ్మణులు మధురవాక్కులతో నస్వర ముగ స్వస్త్యయనమును బఠించుచుండిరి. గాయన, వాద్య, నృత్య స్వరములందు వేదపాఠ స్వరమును కలిసి ఒక నవీనస్వరలహరిని నిర్మాణ మొనర్చుచుండెను. తండ్రియగు సముద్రుఁడు తన ప్రియ పుత్రిక ధరించుటకై ప్రేమపూర్వకముగ రెండు సుందరబాహు మూల్యములగు బట్టువస్త్రముల నొసంగెను. వరుణుఁడొక వైజయంతీ మాల నొసంగెను. మధుమత్తములైన మధుకరములు నలువైపులను ముసురుకొనెను. అన్నిసామగ్రులున్నవిగాని భూషణములు లేకున్న బాగుండలేదని విశ్వకర్మ తలఁచి ఆతఁడు వివిధాభరణము లను తీసికొనివచ్చెను. అప్సరసలు కమలాదేవి కా యాభరణముల

న్నిటిని ధరింపఁజేసిరి. తన సహచరి అలంకరించుకొన్నదని తెలిసి కొని సరస్వతీదేవి మిక్కిలి ప్రేమతో మిల మిల మెఱయుచుండిన హారము నొకదాని నామె మెడలోవైచి యిట్లనెను :- "సోదరీ ! ఈ హారముచే శోభరాలేదు; కాని నీ కమనీయ కంఠమందీహార మత్యంత శోభను బొందినది. ఇది విని ముత్యాలవలెఁ దెల్లగను, స్వచ్ఛము గను, చిన్నవిగనున్న దంతముల కాంతిని నల్దిక్కుల వెదఁజల్లుచుఁ గమలాదేవి నవ్వెను; బ్రహ్మదేవుఁడు కమలాసనుఁడు. ఆతఁడు కమలమునుండియే పుట్టినాఁడు; కమలము మీఁదనే కూర్చుండును. ఆతనికిఁ గమలమనినఁ బ్రియము అందువలన నాతఁడొక క్రీడా కమలమును దీసికొని ఆమెకొసంగి "అమ్మా ! ఈ కమలములను దీసికొని ఆడుకొమ్ము." ఆకమలములను గైకొని కమల యధార్థ ముగఁ గమల మయ్యెను. నాగులు రెండు కుండలములను దెచ్చి యిచ్చిరి. వానిని ధరించుటచే నామె నునుపారిన బుగ్గలు మెరయు చుండెను.

సూతుఁడిట్లనెను :- "మునులారా ! త్రైలోక్యసుందరియగు లక్ష్మీదేవి అభిషేకమైన తరువాత వస్త్రభూషణములతో సుసజ్జిత యయ్యెను. ఇప్పుడామె తనకు యోగ్యుఁడైన భర్తకొరకు జయ మాలను దీసికొని లేచెను.

..........

# వర వర్ణినియగు లక్ష్మీదేవి

శ్లో॥ తతః కృతస్వ స్త్యయ నోత్పల స్రజమ్
నదద్ద్విరేఫా పరిగృహ్య పాణినా।
చచాల వక్త్రం సుకపోల కుండలమ్
సువ్రీడహాసం దధతీ సుశోభనమ్॥

శ్రీభాగ. ౮ స్కం. ౮ అ. ౧౭ శ్లో॥

ఆ॥ చంచరీక నికర ఝుంకార నినదంబు
దనరు నుత్పలముల దండవెట్టి
మేఘకోటి నడిమి మెఱుఁగుఁ బుత్తడిమాడ్కి
సురలనడుమ నిల్చె సుందరాంగి॥

శ్రీమదాంధ్ర భాగవతము

ఈ ప్రపంచ మంతయును గుణదోషమయమైనది. ఎవరిలో నధికముగ గుణములు కలవో వారిని గుణవంతులందుము. ఎవరిలో నవగుణములెక్కువగనుండునో వారిని నిర్గుణులందుము. వాస్తవమున మంత్రముగాని అక్షరము లేదు. ఓషధికాని వస్తువులేదు. కొంచెముగనో గొప్పగనో గుణములు లేనిమానవుఁడు లేఁడు. అవ గుణముల కారణమున గుణములు ప్రకటము కాకుండుటయును, అధికగుణముల కారణమునను, స్నేహకారణమునను నితరులదోష ములు కనఁబడ కుండుటయును వేఱువిషయము. కాకున్న గుణ

దోష రహితుఁడొక్కఁడును లేఁడు. కేవలమొక్క శ్రీహరియే సమస్త సద్గుణములకా శ్రయము. బ్రహ్మయే నిర్దోషుఁడు. ఆ నిర్దోషుఁడగు బ్రహ్మనే యాతని నిత్యశక్తియగు లక్ష్మి భజింపఁగలదు. శ్రీహరి తప్ప ఆమెకింకనెవరును పతి కాఁజాలరు. ఇట్టిలక్ష్మిని మోసావశమునఁ దనదానినగాఁ జేసికొనఁదలఁచినను నామెపై సర్వథా అధికారమొనర్పఁ జూచినను వారు చివరకాశాభంగము చెందవలసివచ్చును. కావున శక్తివంతునితో నాశక్తిని మాతృభావముతోఁ జింతింపవలయును. దీనిలోనే సుఖముకలదు ఇదియే కళ్యాణమునకుఁ బ్రశస్తమగు రాజబాట.

శ్రీ శుకదేవుఁ డిట్లనెను :- "రాజా ! లక్ష్మీదేవి వస్త్రభూషణములతో బాగుగా సుసజ్జితకాఁగానే బ్రాహ్మణులు విధి పూర్వకముగ నామెకు స్వస్త్యయనము కావించెను. అప్పుడామె వయ్యారముగఁ జేతిలో నత్యంత మనోహర గంధయుక్తమగు కమలములతోఁ జేయబడిన విజయమాలను గైకొని మందమంద గతితో హంసినివలెఁ దన పాదపద్మ నూపురఝంకారముతో నాసభాస్థలిని ఝంకృత మొనర్చుచు బయలుదేరెను. ఆమె తన ప్రాణ పతియు, జీవన సహచరుఁడునగు శ్రీహరిని నా సమూహమునుండి గుర్తించుటకు వెదకుచుండెను. ఇచ్చటఁ గాళ్ళయందుండిన నందెలు, గజ్జెలు నూపురముల ఝణఝణ ధ్వనులను, నటు నడుముకు బెట్టుకొనిన గజ్జల మొలనూలు, బంగరుమొవ్వలు తమ తాళమును నూపుర ధ్వనులతోఁ గలుపుచుండెను. కర కంకణములు గజ్జలధ్వనులతోఁ బాటుగా మ్రోగుచుండెను. చేతిలో ధరించిన కమల మాల మీఁద

వ్రాలిన మత్త మధుకరములు గునగునమని గంజారవ మొనర్చు చుండెను. ఇచ్చట వీణా పణ వాది మంగళవాద్యములు మధుర మధుర స్వరమున మెల్లమెల్లఁగ మ్రోగుచుండెను. ఈ ధ్వనులన్ని టిచే నడుయొక్క హృత్తంత్రులు ఝంకృత మొనర్చుచుండెను. అందఱును దదేక దృష్టితో విలాసగతిచే గమన మొనర్చు కమల యొక్క మనోహర ముఖమువైపు ఆశాభరిత దృష్టులతోఁ జూచు చుండిరి. ఆహా! ఆ సమయమున లక్ష్మీదేవి యొక్క శోభయెంత యపూర్వముగ నున్నది! నాగులచే నీయఁబడిన నామె కమనీయ కర్ణకుండలములు. సముద్రమును బుట్టిన చంద్రునిమీఁద రెండు మత్స్యములు తపతపలాడుచున్నట్లు కదలుచుండెను. చందనకుంకు మాది సుగంధ ద్రవ్యములచే ననురంజితయై, ఒకటి నొకటి యొరుసుకొనుచున్న నున్నత పీన పయోధర భారముచే నమితయై పృథుల శ్రోణియొక్క భారముచే మంద మంద గతిని నడచుచు, నుదరము కృశమై యుండుటచే నూగుచు, నామె సువర్ణలతవలె నుండెను, సముత్సుక, ఇచ్ఛుక వ్యక్తుల కర్ణ కుహాలములందుఁ దన నూపుర ఝుంకారములతో మాదకతను, మోహకతను గలి గించును. నామె ముందుకు నడుచుచుండెను. చంద్రునివలెనున్న నామె వికసితాననమందు మందహాసమును, అభిలాషయును, నిచ్ఛయను, లజ్జయు, సుందర, మనోజ్ఞ, సర్వగుణసంపన్నుఁడగు వరుని యందు సముత్సుకతయు నుండెను.

సురలును, దైత్యులును, యక్షకిన్నర, గంధర్వ, ఋషి, ముని, సిద్ధ చారణులును, వివిధ దేవోపదేవతలును బాగుగా నలంకి

రించుకొని కూర్చుండి యుండుటను రమాదేవి గాంచెను. వీరంద రలోనుండి ఆమె ఒక వరునిఁ గోరుకొనవలసి యున్నది. సభా హృదయమున ద్వంద్వ యుద్ధము జరుగుచుండెను. ఎవ్వరును దాను హీనుఁడనని చెప్పుకొనుటకు సిద్ధముగ లేకుండిరి. కొందఱు తప స్సును గారణముగను, గొందఱు జ్ఞానము గారణముగను, కొందఱు మహత్వమును గారణముగను, గొందఱైశ్వర్యమును గారణముగను గొందఱు ధర్మమును గారణముగను, గొందఱు శుభకర్మలు కార ణముగను, గొందఱు త్యాగమును గారణముగను, గొందఱు బల మును గారణముగను, గొందఱు విరక్తిని గారణముగను, గొందఱు దీర్ఘాయువు కారణముగను, దమ్ము సర్వశ్రేష్ఠులుగఁ దలఁచుచుండిరి. లక్ష్మీదేవి యెటుఁబోవుచుండిన నటు లేచిలేచి ముందుకువంగుచు వారికిఁ దమముఖమును జూపుచుఁ దమ మహత్వమును జెప్పుకొను చుండిరి. కాని కమల సర్వగుణ సంపన్నుఁడగు బతినిఁ గాంక్షించు చుండెను. ఆమెకు సాధారణపతివలన సంతోషములేదు. కావున నామె అందరయందుఁ దనకు మనోనుకూలమగుఁ బతిని వెదకుచుఁ గ్రీడా విలాసములతో రంగభూమికి వచ్చెను.

మునుముందునా నామె గొప్ప గొప్ప జడలను ధరించి, తపముచే జాజ్వల్యమానులై రూక్షశరీరము కలిగి, ఘోర తపో నిరతులైన దుర్వాసాది మునులను గాంచెను వారందరును దమతపః ప్రభావముచే శాపానుగ్రహ సమర్థులై నూతన సృష్టినిఁ జేయఁగల సమర్థులు, నూతన, బ్రహ్మాండమును రచింపఁగలరు. చక్రవర్తు లను గూడ గడగడ వణఁకించిన పరమ తపస్విలగు మునులు

కూర్చుండియుండుటను గాంచెను. లక్ష్మీదేవి ఒక దృష్టిని వారిపై నుంచెను. రమాదేవి సంతోషించి వారినే వరించునని వారికాశ కలదు. కాని రమాదేవి భావుకతా ఆవేశమునఁబడునది కాదు. ఆమె యిట్లనుకొనెను :- "తపస్సు మంచివస్తువు. తపస్సులో గొప్ప శక్తి యున్నది. తపస్సుచేఁ బ్రాణి యేది కావలయునన్న దానినిఁ జేయఁగలరువారు. కాని చూడఁగాఁ దపస్వులలోఁ గ్రోధమెక్కువగ నుండును. తపస్వులు యత్కించి లోపమునకైనను దారుణశాపము నొసంగెదరు. అగస్త్య మహాముని యింద్రద్యుమ్న మహారాజు కడకుఁ బోయెను. ఆతఁడు మౌనియై జపమును జేసుకొనుచుండెను. నీవుగజమవు కమ్మని వానిని శపించెను. ఏవరైనఁజూచి నవ్విరా, రాక్షసుఁడవు కమ్మని శపించెదరు. దుర్వాసమహాముని శాప మొసంగుటలోఁ బ్రసిద్ధులు, ఇదిగాక శాప మొసంగని మునియే లేఁడు, బదరికాశ్రమములోని యిద్దరు మునులు తప్ప, కావున నీ కోపిష్ఠి పతులతో నేను వేగలేను. వారితో నాకు గుదురదు. కోపి యగు పతి భార్యను బ్రతిక్షణమును శంకించుచుండును. ఆమెకు దినమున నన్నము సహింపదు. రాత్రియందు సుఖనిద్ర పట్టదు. భగవానుఁడు క్రోధియగు పతిని నేస్త్రీకిని నీయకుండును గాక !" ఇట్లాలోచించుకొని రమాదేవి వారివైపునఁ గన్నుల నెత్తియైనను జూడక ముందుకుఁబోయెను. ఆతపస్వులకు నిరాశ కలిగెను.

లక్ష్మీదేవి యింకను ముందుకుఁబోయెను. పోయి చూడఁగా దేవతా గురువు బృహస్పతియును, అసురుల గురువు శుక్రాచార్యు లును, నింకను నీతి శాస్త్రజ్ఞులును, ధర్మశాస్త్రజ్ఞులును, బ్రహ్మ

వాదులగు జ్ఞానులును, మునులును గూర్చుండియుండిరి. అందర కును ప్రపంచములో జ్ఞానులే సర్వశ్రేష్ఠులు, మేము జ్ఞానులమను నహంకారముకలదు. లక్ష్మీదేవి వారినే తప్పక వరించుననుకొను చుండిరి. లక్ష్మీదేవి తన ముసుఁగును గొలఁదిగాఁ దొలిగించి తీక్ష్ణ ముగఁ జూచునప్పటికి వారి హృదయములు వచ్చఁబడెను. కమలా కటాక్షవిక్షణముచే వారియొక్క ఆశాలతకు మారాకువైచెను. పచ్చ పడి యూఁగజొచ్చెను. లక్ష్మీదేవి యిట్లనుకొనెను :- "వీరందరును జ్ఞానులే, కాని జ్ఞానులకు శోభనిస్సంగత. వీరు వేదశాస్త్రజ్ఞాను లయ్యును వీరు తమ యజమానుల యధీనములో నుండవలయును. వారేమి చెప్పిన దాని నంగీకరింపవలయును. దాన దక్షిణలకొరకై వారుచితానుచిత కార్యములందు తోడ్పడవలసి యుండును. వశిష్ఠు డంతటి జ్ఞాని యితరునిచే యజ్ఞమును జేయింపవలసివచ్చిన కారణ మునఁ గుపితుఁడై నిమికి శాప మొసంగెను. బృహస్పతి ఇంద్రుఁడు చెప్పఁగా దనకు కులపరంపరగా యజమానియగు మరుత్తును బరి త్యజించినాఁడు. ఈ విధమగు జ్ఞానులలో నిస్సంగతలేదు. ఈ యవుననిన నౌనను రకముతో మనకేమిపని యని ఆమె ముందుకుఁ బోయెను. జ్ఞానులగు మునులను నామె ఇంకొకసారి తిరిగియైన జూడలేదు.

ఇంకను ముందునకుఁబోఁగా మహత్వము కల ప్రజాపతులు కూర్చుండి యుండిరి లోక పితామహుఁడగు బ్రహ్మ కూర్చుండి యుండెను విశ్వామిత్ర, పరాశర, సౌభరి మొదలగు మహా మహిమగల ప్రజాపతులు కూర్చుండి యుండిరి. లక్ష్మీదేవి కన్ను

లను దెరచి వారిని(జూచెను. లక్ష్మీదేవి తమ్మెతప్పక వరించునని వారూహించిరి. ప్రపంచములో సర్వత్ర మహత్వమున కాదరము కలదు. మహత్వాకాంక్ష ప్రాణిమాత్రున కుండును మహత్వశాలితో సంబంధము నేర్పరచుకొనుట తమకు గౌరవమని అందరును భావించుచుందురు; కాని లక్ష్మీదేవి వారివైపు చూచియును ననురాగమును బ్రదర్శింపలేదు. ఆమె యిట్లనుకొనెను :- "వీరందరును గొప్ప మహత్వశాలురైనను, ప్రపంచమునవీరి కఖండఖ్యాతి యున్నను వీరు కామమును జయింపలేదు. సంధ్యను జూడ(గనే బ్రహ్మమనస్సు సంచలించినది. చంద్రుడు(డు తన మహత్వాభిమానముచే( జేయరాని పనులెన్నో చేసెను. విశ్వామిత్రుడు(డు నూతన సృష్టినొనర్చెను. తన మహత్వముచే వశిష్ఠుని వశపరచుకొనెను, కాని కామమును జయింప(జాలక పోయెను. ఏ పతివ్రతయును సతీసాధ్వియును గామియగు( బతియెడల( బ్రసన్నురాలు కా(జాలదు. తన పతి యాచరణ శుద్ధముగ నుండని దానికంటె వేరొక దుఃఖము స్త్రీలకుండదు. ఎట్టి స్త్రీ యైనను సదా సదాచారి యగు బతినిచ్ఛించును." ఇట్లాలోచించుకొని లక్ష్మీదేవి యింకను ముందుకు( బోయెను.

ఇంకను ముందుకు(బోగా నింద్రు(డును, గుబేరుడును, వరుణు(డును, నాగలోకా ధీశ్వరు(డును, పాతాళ లోక, పృథివీ లోక, అంతరిక్ష లోకములలోని అధిపతులందరును( గూర్చుండి యుండిరి. వారిని గాంచి లక్ష్మీదేవి కొంచెము సేపాగెను. లక్ష్మీదేవి తమ వైపునకు( జూచుటను గాంచి అందరి యొక్క మన

ముకురములు వికసించెను. లక్ష్మీదేవి నిలుచుండి యిట్లనుకొనెను:- "వీరందరను దమ నామముల వెంట దేవేంద్రుడు, అసురేంద్ర, నరేంద్ర, రాక్షసేంద్రాది యింద్ర పదములను దగిలించు కొన్నను వాస్తవమున నీ యింద్రులు, స్వామి లేమి సామర్థ్యము కలవారు? ఇంద్రుడసురులచే బరాజితుడైనచో దీనుడై త్రిమూర్తుల నాశ్రయించును. వారి ద్వారముల కడబడి ముక్కు నేల దోకించును. ఏడ్చును, మొత్తుకొనును. ఇట్లితరుల నాశ్రయించు వారిని నేను భర్తగాఁ బొంది యేమి సుఖమును బొందగలను? తన భర్త తనకుఁ స్వామి యగుటయే కాదు, తన నాథుని మాట నందరును విన వలయునని స్త్రీకి ఉండును. ఇతరుల యాశ్రయమున నున్న వానిని బతిగాఁబొంది భార్య యేమి సుఖ మనుభవింపగలదు? పత్ని గృహ మునకే స్వామిని కాదు, తన నాథుని హృదయమునకు నీశ్వరియే తన పతి పరముఖాపేక్షియై, ఇతరుల యధీనమున నుండి జీవి తమును వెళ్ళబుచ్చుకొను చుండినఁ, బరదాసుడైన వానిని బుద్ధి పూర్వకముగ నే స్త్రీ తనకుఁ బతిగా వరించును?" అని యాలో చించుకొని ఆమె యింకను ముందుకుఁ బోయెను.

ఇంకను ముందుకుఁ పోగా గొప్ప గొప్ప ధర్మాత్ములును, యజ్ఞము లొనర్చువారును, ధర్మరక్షణ మొనర్చు వారునునగు, బరశురామాదులు కూర్చుండి యుండిరి. లక్ష్మీదేవి వారివైపునను దృష్టిపాతము కావించెను; ఆమె యిట్లనుకొనెను :- ధర్మము కల వారికిని దయ యుండదు. ధర్మము పేరిట నెందరినో మూక ప్రాణు లను బలి యొసంగెదరు. పరశురాముడు ధర్మము పేరిట నెంద

అనో క్షత్రియులను సంహరించెను, ధర్మము నడ్డముగా బెట్టుకొని యెన్నో ప్రాణులు వధింపఁబడు చున్నవి. సాధారణముగఁ జూచిన ధర్మము పేరుతో సౌహార్దమునకుఁ దిలాంజలు లిచ్చుచున్నారు. సౌహార్ద హీనులగు వారిని వివాహమాడి స్త్రీ యేమి సుఖమును బొందఁగలదు. పతి పత్నులు ప్రేమించుకొనక కేవలము శుష్క-ధర్మమందే యుండిన పతిని స్వయముగ వర వర్ణిని యగు గన్యక యెట్లు వరింపఁ గలదు?" అని తలఁచి యామె యింకను ముందుకు నడచెను.

ముందునకుఁ బోగాఁ గొప్ప గొప్ప త్యాగులు కూర్చుండి యుండిరి. రాజ్యమును ద్యాగ మొనర్చిన వారును, బరోప కారము కొరకు ప్రాణముల నర్పించిన వారును, నాత్యాగులలో గలరు. లక్ష్మి దేవి వారివైపునకు జూచి యిట్లనుకొనెను :- "త్యాగము గొప్ప వస్తువైనను, ద్యాగము చేతనే శాశ్వత శాంతినిఁ బొందవచ్చును, కాని సాధారణముగ వీరన్నమును, ధనమును, వస్త్రములను, రాజ్యమును, జివరకు ప్రాణములను ద్యాగము చేసినప్పటికిని వారు కేవలము స్వర్గ కాంక్షచేఁ జేయుచుందురు. మనకు దీనిచే నక్షయ స్వర్గము ప్రాప్తింపవచ్చును. నృగ మహారాజు స్వర్గ కాంక్ష చేతనే దానము నొనర్చెను. శిబి త్యాగమును స్వర్గము కొఱకే. ముక్తి కొరకు గాని త్యాగము సర్వోత్తమ త్యాగ మనఁబడదు." అని తలఁచి ఆమె యింకను ముందుకు బోయెను.

రమాదేవి యింకను ముందునకుఁబోయి చూడఁగా గొప్ప గొప్ప బలవంతులు, తమ బలముమీఁద నభిమానము బెట్టుకొని, ఆశా భరిత దృష్టులచే లక్ష్మినిఁ జూచుచుండిరి. లక్ష్మీదేవి వారివైపు కటాక్షపాత మొనర్చెను. లక్ష్మీదేవినిఁ జూడఁగనే వారు తమ బల పౌరుషములను మరచిరి. మంత్రముగ్ధుల వలెనామె వైపక్షే నిలు చుండిరి. లక్ష్మీదేవి యిట్లనుకొనెను:- "బలవంతులకు సర్వత్ర విజయము లభించినను అందరునాతని గాంచి భయభీతులైనను, బలవంతునిఁ బతికాఁబొంది పత్నియానందమును జెందినను, ఆమె తన్ను సురక్షితముగా భావించును. అయినను సమర శూరుని భార్య తన సౌభాగ్యము స్థిరమని నమ్మదు. ఏ యుద్దండుఁడు వచ్చి తన భర్తను జంపునోయని ఆమెకు సందేహ మెల్లప్పుడు నుండనే యుండును. రావణుఁడు, హిరణ్యకశిపుఁడు, కార్తవీర్యార్జునుఁడు మొదలగు వారెందరో విశ్వవిజయులగు వీరు లంత మొందిరి. వీరందరు నందరును జయింపఁగలవారు, శూర వీరులు, పరాక్రమ వంతులు, యశస్వులు, తేజస్వులు, తామపరాజితుల మనుకొను వారు, చివరకు వీరును గాలగతినిఁ జెందిరి. వీరును గాలాంతరమున 'గాల' కబళితులైరి. బలవంతులైనను గరాళకాల వేగమునుండి ముక్తికలుగుకున్న నిట్టి సంశయాయవు గల పతినే కల్యాణేచ్ఛ గల కన్యక స్వేచ్ఛగా గ్రహింపగలదు." ఇట్లాలోచించుకొని కమలా దేవి అచ్చటను నిలువక ముందుకుఁ బోయెను.

ఇంకను ముందునకుఁబోగా సనక, సనందన, సనత్కు-మార, సనాతన, నారదాది చాలామంది యూర్ధ్వరేతస్కులగు

మహాత్ములుండిరి. వారు లక్ష్మీదేవి వైపునకుఁ జూచుటయే లేదు. నాసికాగ్ర దృష్టితో ధ్యాస నిమగ్నులై నిజానందమున నుండిరి. లక్ష్మి అచ్చట నిలిచెను. మాటి మాటికిని గాజులను గలగల లాడించెను. కాని వారు లక్ష్మీదేవి వైపునకుఁ దల లెత్తిచూడనైనఁ జూడలేదు. అప్పుడు లక్ష్మి యిట్లనుకొనెను :-"వీరందరును విషయాసక్త రహితులైనను, సదాచారులైనను, క్రోధమును జెందకున్నను సదా ధ్యానముననుందురు నీరసచిత్తము కలిగియుందురు. స్త్రీలకు సరసపురుషులవలన సంతోషము కలుగును ఆమెతో నవ్వుచు, మాటలాడుచు, మధుర మధురముగఁ బ్రేమ వాక్యములను బల్కుచు బ్రతిదినము నేదో యొసంగుచుండిన బాగుండును. సదా ధ్యాన ధారణ మొనర్చు చుండు వానినిఁబతిగాఁ పడసి యే కన్యతన భాగ్యమును విపత్తులలోఁ బడ వేసుకొనును? ఇట్టి నీరససమాధి నిష్ఠునెవతె స్వేచ్ఛగా వరించును." ఇట్లాలోచించుకొని యామె తన నూపురములను ఖనన బ్రమోగించుచు, జడను గదలించుచు మందహాస మొనర్చుచు ముందునకుఁ బోయెను.

ముందునకు బోఁగా వేలకొలఁది, లక్షలకొలది, కోట్లకొలఁది కల్పముల కొలఁది ఆయస్సుగల మహాత్ములు కూర్చొండి యుండిరి. ఆదీర్ఘ జీవులగు ఋషులను గాంచి కమల కొంచెముగ నవ్వియిట్లనుకొనెను :-"దీర్ఘజీవితము నందరును గోరుకొందురు, ఇది సత్యమే. ఈ మార్కండేయుఁడు కల్ప జీవి. లోమశ మహాముని ఆయస్సునకంతే లేదు. ఒక్క బ్రహ్మ మారినచో నాతనికొక రోమము రాలును, కాని యిట్టి దీర్ఘజీవనముచే నేమి లాభము? ఈ ముసలి

వారికి స్త్రీలను సంతోషపెట్టు శక్తియుండదు. వీరిశీలము సరసముగను, సామరస్యముగను నుండదు. మంగళములను గోరు మానినులకు వీరి పొందు మంగళ మయముగ నుండదు. ఆయుష్కాలమంతయును భారముగ నుండును. స్త్రీల చిత్తము చంచలముగ నుండును. వారికి మెదలక పాషాణము వలెను, బుత్తడి బొమ్మల వలె నవ్వులు, ఖేలనములు లేకయుండు పురుషులు ప్రియులుగ నుండరు. ఈ పెద్దపెద్ద జడలు, గడ్డములు గల దీర్ఘజీవులతో నాకు నిస్తారము గాని, నిర్వాహము గానిలేదు." ఇట్లాలోచించుకొని ఆమె ముందుకుఁ బోయెను.

ముందుకుపోఁగా నింకఁగొందరు దీర్ఘ జీవులు కలరు. వారు సరస ప్రకృతి కలవారు. స్త్రీలయందనురాగమును గలవారు, కాని వారు పోరాటము నిచ్ఛించెదరు, వారికి యుద్ధమనిన మిక్కిలి ప్రియము. సదా యుద్ధమనిన మిక్కిలి కాంక్షించుచుఁ గయ్యమునకుఁ గాలుదువ్వువారిని, శత్రుత్వమును వహించుటలోనే ఆనందమును జెందువారినిఁ బతిగాఁ జేసికొని తన మంగళ సూత్రమును సిందూరమును నెవరు సంశయములోఁబడవైచు కొందరు? అందువలన నిట్టివారిని గూడ వదలిపెట్టి కమలాదేవి ముందుకుఁబోయెను.

ఇంకను ముందునకుఁ జూడఁగా దత్తాత్రేయుఁడు, శివుఁడు ఇంకననేక యోగేశ్వరులును గనఁబడిరి, వారు దీర్ఘ జీవులు గూడనై యుండిరి. సరసప్రకృతికలవారు, తమ ప్రియులను బ్రేమించువారే, కాని వీరందర వేషము చేష్టలును జాల విచిత్రముగ

నుండును. ఒకఁడు స్మశానములో నుండును, మండమాలలను ధరించును, కుక్కలతోఁ దిరుగుచుండును, భూతములతో నాడును పుఱ్ఱెలలోఁ దినును, ఒకఁడు కల్లును[?]ద్రాగును, ఇంకొకఁడు చితా భస్మమును నలఁదుకొనును. ఇంకొకఁడ శవవస్తువులతోఁ దన శరీరము నలంకరించుకొనును. ఇట్టి మహా[?]ఘోర సాధువులతోఁ గమలా రాణియుండుట కిచ్ఛగింపలేదు. ఆమె సాత్త్వీక ప్రకృతి కలది. ఆమెకుఁ బవిత్రతయును, శుచిత్వమును, స్వచ్ఛతయును గావలయును. ఆమెకుఁ గావలసినవానికితపముసుండ వలయును. తేజస్సు ఓజస్సు, జ్ఞానము వైరాగ్యమును నుండవలయును. మహత్వశాలి కావలయును. జితేంద్రియుఁడై యుండవలెను. అజరామరుఁడుగ నుండవలెను. బలవంతుఁడగ నుండవలెను. యోగిగా నుండవలెను సుందరుఁడుగ నుండవలయును, సరసుఁడై యుండవలెను. నవ్వు ముఖముగను, మధురభాషిగను, విశ్వవిజయుఁడుగను, బవిత్రుఁడుగను, నలంకారప్రియుఁడుగ నుండవలెను, సారాంశమేమనఁగా నాతఁడు సర్వగుణసంపన్నుఁడుగ నుండవలయును. ఎల్లప్పుడును నలంకరించుకొని యుండవలయును.

సూతుఁడిట్లనెను:-"మునులారా! ఇట్టి భర్తయెచ్చట లభింపఁ గలఁడని కమలాదేవి కన్నులు విచ్చి నలువైపులను దిలకించు చుండెను.

# శ్రీ లక్ష్మి నారాయణుని వరించుట

శ్లో॥ ఏవం విమృశ్యావ్యభిచారి సద్గుణై ః,
వరం నిజైకాశ్రయతాగుణాశ్రయమ్।
వవ్రే వరం సర్వగుణై రపేక్షితమ్.
రమా ముకుందం నిరపేక్షమీప్సితమ్ ॥

శ్రీ భాగ. ౮. స్కం. ౮ అ. ౨౩ శ్లో.

వ. అవి సకల సత్పురుష జనవర్తనంబులు మానించి పరిహరించి

సీ. అమర ముత్తైదువనై యుండవచ్చును
వరుసకు సవతులెవ్వరును లేరు
వెలయంగ నశ్రాంత విభవమీతని యిల్లు
శృంగారచందన శీతలుండు
గలఁగఁడెన్నఁడు శుద్ధకారుణ్యమయమూర్తి
విమలుండు గదిసి సేవింపవచ్చు
నెఱి నాడి తిరుగఁడు నిలుకడ గలవాఁడు
సకల కార్యములందు జడతలేదు

ఆ॥ సాధురక్షకుండు షడ్వర్గ హితుండు
నాథుఁడయ్యెనేని నడపనోపు
నితఁడె భర్తయనుచు నింతిసరోజాక్షుఁ,
బుష్పదామకమునఁ బూజసేసె ॥

శ్రీ మదాంధ్ర భాగవతము

ప్రేమ కొరకై జీవుఁడు తిరుగుచుండును. ఎచ్చటనో తపస్సునుగాంచి అచ్చట నాశించుచుందురు, కాని తపస్వు లెవరికి మిత్రులు. వారికి స్వర్గేచ్ఛ కలదు. ఒక్కొకచో సౌందర్యమును గాంచి ముగ్ధులగుదురు. కాని కనక ఘటమందును లోపల విషము నిండియుండును. కొన్నిచోట్ల మహత్వయశః ప్రశంసాకీర్తులను విని వారికడకుఁ బోవుదురు, కాని వారి అంతరికాచరణమునుగాంచి వారి యెడలను నిరాశను జెందుదురు. ఒకప్పుడు కామినియొక్క సుమధురహాస్యము చేతను, ఆమె వైఖరికిని, ఆమె మధుమయవాక్కులకు ముగ్ధులై అచ్చట నాశపెట్టుకొందురు కాని కామమున్నచోటఁ ప్రేమయెక్కడిది ? తృప్తియెక్కడిది ? అచ్చటనుండియును వారు నిరాశను జెందవలసియుండును. ప్రాణిప్రేమలేక యుండఁజాలడు. ప్రేమ నిర్దోషము, నిశ్చలము, ప్రతిక్షణ వర్ధమానము, ఎచ్చట కామము, క్రోధము, సంగము, దీనత, రూక్షత, ఆసక్తి, నీరసత అపవిత్రత చింత మొదలగు నవగుణములు కలవో వారికి స్థాయియగు ప్రేమ యెక్కడిది! అట్టివారికి స్వార్థ ప్రేమయుండును. గుణగ్రాహి ప్రేమయుండును. ఆగుణములు నశించెనా అచ్చట ప్రేమ శిథిలమైపోవును. కావుననే జీవి సర్వత్ర ప్రేమ నన్వేషించుచుండును, గృహముననుు, బరివారమున , జాతియందుననుు, దేశమందు , సర్వత్ర ఆతఁడు ప్రేమ నన్వేషించుచుండును, కాని పాపములతోఁ బాటుకంటకమును సర్వత్రకనఁబడును. నిర్దోష ప్రేమ యెచ్చటను గనఁబడదు. అప్పుడాతఁడు సంసార విముఖుఁడై, యీ మతల ధర్మముగలవారిపైఁ ప్రేమాశను వీడి మృత్యు

వునుగూడ కొట్టఁగల ముకుందుని శరణు వేడినచో నాతనిఁ బతి రూపమున వరించినచో, ఆతనిని దన స్వామిగాఁ జేసికొనినచో శాశ్వతముగ సుఖమును బొందవచ్చును. ఆతఁడే ఆమెను పురాతన సనాతన ప్రేమాస్పదుఁడు. వానిని మరచి అటునిటు దెబ్బలు తినుచుందుము. అన్వేషించుచుందుము, పురుషప్రయత్న మొనర్చి సె ధనతత్పరుల మయ్యెదము. అధ్వ, మార్గ, పంథలందు బ్రవృత్తులమగుదుము, ముందుకుఁబోవుదము, పోయిపోయి అన్నిటి యొక్క యథార్థ మర్మమును తెలిసికొని సమస్త దర్శనములతో యథార్థ వస్తువు నన్వేషించుము. నేతి నేతీతివాక్యములచే నన్వయించెదము. ఆతనినిఁ బొందినప్పు డాతని కంఠమునకు హారము వేయుట కాదు, ఆతని హృదయమునకే హారమగును, ఆతనిని వరించును పురాతన సంబంధము పెరుఁగును; గమ్యస్థానమును జేరుకొని కృతార్థుఁడగును ఇదియే స్వయంవర రహస్యము.

శ్రీశుక దేవుఁడిట్లనెను :- "రాజా ! లక్ష్మీదేవి లజ్జించుచు స్వయముగఁ బతినన్వేషించుచుండెను. ఆమె విసుగుఁ జెందక గంభీరముగను, వివేకపూర్వకముగను వరాన్వేషణ మొనర్చుచుండెను. అందర గుణములను గాంచెను గాని ఆ గుణములు దోషయుక్తములనియు ననిత్యములనియుఁ దెలిసికొని వారినాదరింపలేదు పూర్వరీతినిఁ బతినన్వేషించుచునేయుండెను. ఇట్లు పీరుకారు, పీరుకారనుచుబోఁగాఁ జివరకు కూర్చుండిన వనమాలినిఁ గాంచెను. ఆతఁడు వయ్యారముగఁ గూర్చుండెను. ఆతనికి యుత్సుకతయునులేదు. ఇచ్ఛయు లేదు, ఆతఁడు నవ్వుచును గూర్చుండెను. అతఁడు

మాటిమాటికి లక్ష్మీదేవినిఁ జూచుటయును లేదు. ఆతఁడు సమస్తై శ్వర్యసంపన్నుఁడు. సౌందర్య సాగరము. నిత్యసద్గుణ సంపన్నుఁడు. ఆతని తపస్సు క్రోధరహితమైన తపస్సు. బదరీవనమున నింద్రుఁడు పంపఁగా మన్మథుఁడును, వసంతుఁడును, మలయానిలమును, అప్సరసలును నాతని తపస్సును భంగమొనర్ప నాశ్రమమునకురాఁగా నాతఁడు క్రోధమును జెందలేదు. చిరునవ్వు నవ్వి వారికి స్వాగతమొసంగెను. వారు తపస్సును దపస్సు కొరకే చేయుచుండిరి. క్రోధించి తపమును నాశనమొనర్చుకొనుట వారెరుఁగరు. వారు జ్ఞానమునకు సాకార స్వరూపులు. వారు సమస్త ప్రాణులకు నిస్సంగులు. అన్నిటినిఁ జేయుచున్నను నన్నిటికిని వేరుగనున్నారు. కాముని నాతఁడు జయించుటకాదు. ఆతనిఁధన పుత్రునిఁగాఁ జేసుకొనినాఁడు. తన పుత్రుఁడేయైనప్పుడాతని జయించుట యను ప్రశ్నయే యుదయింపదు. ఆతనికే యపేక్షయులేదు. ఎవరి యాశ్రయమును గోరడు విశ్వ మాతని యాశ్రయమున నిలుచున్నది. ప్రాణిమాత్రున కేకైకాశ్రయమా యఖిలేశుఁడగు నచ్యుతుఁడే ఆతఁడు సర్వభూతములకునునిజమగు సనాతనసుహృదుఁడు. అందరతోఁ దన చుట్ట పక్కములకంటె నెక్కుడుగఁ బ్రేమించును. ముక్తి ఆతనికి దాసి. కాలమునకును గాలుఁడు సరసత ఆయన కడ శిక్షణమును బొందునా యనునంతటి సరసుఁడు అది ఆయనకు శిష్యురాలై ప్రపంచమందు శృంగారరస ప్రచారమొనర్చును. ఆతఁడు మంగళ స్వరూపుఁడు. సత్వ, రజ, స్తమ గుణములంటనివాఁడయ్యును, దివ్యగుణముల కాకారుఁడు. అణిమాది సమస్త సిద్ధులును, ధర్మ, జ్ఞాన, వైరాగ్యాది సమస్త దివ్యగుణము లాతనికిఁ

గింకరులు. ఇట్టి సర్వగుణాశ్రయుఁడగు ముకుందుని గాంచి రమా దేవి నిలిచిపోయెను. ముకుందుఁడు మందహాస మొనర్చెను కాని యుత్సుకతను, వ్యగ్రతను బ్రకటింపలేదు. ఈతనిలో నన్నియు సద్గుణములే కలవని లక్ష్మీదేవి తెలిసికొనెను. ఈతని నేనెంతగాఁ గాంక్షించుచుంటినో ఆతఁడు నన్నుఁ గోరుట లేదేమోనని అనుకొను చుండెను. ఈతని చేష్టలను గాంచిన నిరపేక్షత ప్రకటమగుచున్న దన నదియును లేదు. తమ్ముఁ గ్రీడా మృగముగఁజూచు పురుషు లను గాంచియు, వారెట్లాచెప్పిన నట్లాడు వారినిఁ గాంచియు, వారి కధీనులై వారి చేతులను నాకువారిని గాంచి స్త్రీలు సంతుష్టిని చెందరు. నవసరమైనపుడు ప్రేమకలహ మొనర్పఁగల వానిని, సమయము వచ్చినప్పుడు తన్ను గాదను నంతటి స్వాభిమానియగు పతిని కోరుకొందురు. కావున నాయెడల నీతనికిఁగల నిరపేక్షా భావమొక మహాగుణమే ఇట్లాలోచించుకొని ఆమె మృణాళ సదృశ మగు తన బాహువులను గొంచెముగఁ బైకి యెత్తెను. అప్పుడా చేతులకున్న కంకణములు, గాజులు, బాజుబాదులు కదలి గలగల శబ్దములొనర్చెను. మత్త మధుకరములు పైనమూఁగి గుంజారవ మొనర్చు చుండిన దివ్యకమలముల జయమాలను గైకొని శ్రీహరి యొక్క కమనీయ కంఠమున వైచెను. ఆ మాలను ధరించి నీలాంజన పర్వతము మీఁద వివిధజాతి పుష్పములు పుష్పించినట్లును, గొప్ప మేఘము చాడ్పున నింద్రధనస్సున్నట్లును శ్రీహరియుండెను. శ్రీహరి నవ్వుచుండెను. ఆతఁడు క్రీగంటి చూపులతోఁ గ్రిందఁ బను వంచుకొనియున్న రమాదేవిని నచ్యుతుఁడు గాంచెను. కాని

రమాదేవి నిరంతరమాతని విశాల వక్షస్థలమునే తదేక దృష్టితోఁ జూచుచుండెను. ఆమె విస్ఫూర్జిత నయనములతో లజ్జా సహితముగ ముసిముసినగవులు నవ్వుచు మాధవుని మనోహర మాధురినిఁ గన్నులార్పక పానమొనర్చుచుండెను. ఇప్పుడామె కదలుటలేదు, మెదలుటలేదు. పాషాణ సజీవ ప్రతిమవలె నిశ్చలభావముతో నటవరుని సమ్ముఖమున నిలుచుండెను.

రమాదేవియొక్క సముత్సుకత పరాకాష్ఠనందుకొనినదనియు నామె హృదయమునఁ బ్రేమ ప్రవాహము పెల్లుబికినదనియు, నామె ప్రేమప్రవాహమునఁ బడదలచినదనియు భగవానుఁడు తెలిసికొని, కనుసన్నచే నామెను దన సమీపమునకుఁ బిలచెను. సిగ్గుపడుచుఁ గొంచెముభయభీతయైనట్లుండి రమాదేవిముందునకుఁబోయెను.శ్రీహరి వక్షస్థలమును నదేపనిగాఁ జూచుచున్నది. అంత శ్రీహరిఁ యిట్లను కొనెను నా హృదయ ప్రవేశమే ఈమె కత్యంత ప్రియమైనదని తోఁచుచున్నది. ఈమె నా హృదయమున నున్న కౌస్తుభమణినిఁ గొంచెమీసుగాఁ జూచుచున్నది. కావున నీమెను గూడ నాహృదయహారముగఁ జేసికొందును. వైజయంతీ మాలకును, గౌస్తుభమణికినిఁ జెలిక త్తెనుగాఁ జేసెదను ఇట్లాలోచించుకొని శ్రీలక్ష్మీదేవిని హృదయహారముగఁ జేసికొనెను. ఆమె నాతని ఱొమ్మున్పైఁ గూర్చుండఁ బెట్టుకొనెను. ఇట్టి యుత్తమ నివాసస్థానమును బొందిన లక్ష్మీదేవి యానందమునకు మేఱలేకుండెను. ఆమె తన సౌభాగ్యమునుగూర్చి పొగడుకొనుచుండెను. ఆమె జగత్స్వామియొక్క హృదయేశ్వరి కాఁగానే ఆమె జగన్మాతయయ్యెను. ఆమె నింకొక భావముతో

జూచుటకిప్పుడెవరి సాహసము కలదు ? అందఱును నామెను దమ జననిగ భావించుచుండిరి. జగన్మాతయగు లక్ష్మీదేవియును త్రిలోక ములను దన సంతానముగ వాత్సల్యదృష్టితో నొక్కసారిచూచెను. సమీపమునం గూర్చుండిన నింద్ర, వరుణ, కుబేర, యమ, వాయు, నగ్ని మొదలగు లోకపాలురను నామె కరుణాదృష్టులతోఁ గాంచ గనే అందఱకును శ్రీవృద్ధియయ్యెను. ఇంతవరకు శ్రీహీనములైనఁ త్రిలోకములు మరల లక్ష్మీదేవి ప్రకటమగుటచేతను, ముకుందుని వరించుటచేతను మరల శ్రీసంపన్నములయ్యెను. ఆ సమయమున గంధర్వులు శంఖ, మృదంగ, పణవ, వీణాది వాద్యములను ప్రయోగించి "జయ రమారమణ గోవింద" యను జయఘోషము లొనర్చిరి. అప్సరసలు నాట్యమాడిరి. ఋషులును, మునులును, స్తుతించిరి. సర్వత్ర ఆనందము వ్యాపించెను. సుఖసరిత్తు ప్రవ హించెను. ఆనంద సముద్ర ముప్పొంగెను. జయజయ శబ్దముల యొక్క మహానాదము త్రిలోకములను వ్యాపించెను. బ్రహ్మాండ మున కావలను ధ్వనివ్యాపించెను. బ్రహ్మ రుద్రేంద్రులు అంగిరాది మహామునులును ఋష్పాంజలులను సమర్పించుచు వేదమంత్రము లతో లక్ష్మీనారాయణులను స్తుతించిరి.

దేవతలు శ్రీసంపన్నులై హృష్ట పుష్టినిఁ జెందిరి. దుర్వా సుని శాపము పూర్తియయ్యెను. దైత్యదానవులు లక్ష్మీదేవి తమ్ము వరించునని కొనిరి. కాని వారియాశ నిరాశగాఁ బరిణమించెను. లక్ష్మీ దేవి వారినిఁ దిరస్కరించెను. ఆమె తన సత్యసనాతన ప్రాచీన పతియొక్క వక్షఃస్థలమందే మరల విరాజమాన యయ్యెను.

శ్రీశుకదేవుఁ డిట్లనెను :- "రాజా! లక్ష్మిదేవి పుట్టి శ్రీఅజిత భగవానుని వరించినఁ దరువాత సముద్రము మరల మథింపఁ బడెను."

....

## ధన్వంతరి అవతారము - అమృతోత్పత్తి

శ్లో॥ అమృతా పూర్ణకలశం బిభ్ర ద్వలయ భూషితః
సవై భగవతః సాక్షా ద్విష్ణోరంశాంశ సంభవః॥
ధన్వంతరి రితి ఖ్యాత ఆయుర్వేద దృగిజ్యభాక్॥
శ్రీభాగ. ౮ స్కం. ౮ అ. ౩౪ శ్లో॥

సీ॥ తరుణుండు దీర్ఘ దోర్దండుండు గంబుకం
ధరుఁడు పీతాంబరధారి స్రగ్వి
లాసిత భూషణాలంకృతుం డరుణాక్షుఁ
డున్నతోరస్కుఁ డతుల్య తేజుండు
నీలకుంచిత కేశ నివహుండు జలధర
శ్యాముండు మృగరాజ సత్త్వశాలి
మణికుండలుఁడు రత్న మంజీరుఁ డచ్యుతు
నంశాంశ సంభవుం డమలమూర్తి

ఆ॥ భూరియాగభాగ భోక్త ధన్వంతరి
యనఁగ నమృత కలశ హస్తుఁడగుచు
నిఖిలవైద్యశాస్త్ర నిపుణుఁ డాయుర్వేది
వేల్పు వెజ్జు గడలి వెడలి వచ్చె॥

శ్రీమదాంధ్ర భాగవతము

భగవంతునియొక్క ఒక్కొక్క లీలలో ననేక కారణము లిమిడి యుండును. రోగములు సనాతనములు. రోగ చికిత్సలును సనాతనములే. రోగములు పాపములవలన వచ్చును. సృష్ట్యాది యందు బొత్తుగాఁ బాపములే లేనప్పుడు రోగములును లేవు పూర్వము కృతయుగమంతము కాఁగానే ధ్యాన స్థానమున యజ్ఞ యాగాదుల ప్రచారము జరిగెను. అప్పుడు నేను గొప్ప నీవు తక్కువయను భావము లుత్పన్నములయ్యెను. రాగద్వేషబీజములు పుట్టెను, దక్షయజ్ఞము నుండి కలహము ప్రారంభమయ్యెను. అప్పటినుండి రోగము లుత్పన్నము లయ్యెను. రోగము లుత్పన్న ములు కాఁగానే వానికిఁజికిత్స నొనర్చి బ్రతుకు వైద్యులు వెలసిరి.

ఆర్యశాస్త్రములందు భావమునకుఁ బ్రధాన మొసంగిరి. నికృష్టాజీవికను నిర్వహించువారు నికృష్టులుగా నెన్నఁబడిరి. శవ హస్తమునుండి దానమును బట్టువాఁడు మహా పాత్రుఁడగు నాచార్య బ్రాహ్మణుడైనను వాని ఆ జీవిక అధమమైన దగుటచే నస్పర్శుఁ డుగ నెన్నఁబడెను. ఈ విధముగనే దుఃఖితులయొక్క దుఃఖమును

బోఁగొట్టుట, రోగ వ్యాకులతను జెందినవారి కౌషధము ద్వారా నిరోగులనొనర్చుటయును నిది గొప్ప పుణ్యకార్యము, కాని దానికి ధనమును దీసికొని ఆ జీవికను నడుపుకొనుట నికృష్టకార్యము. అధర్మవృత్తి. అందువలననే వైద్యవిద్యను వేద వాదులధమాధముగ నెన్నిరి. వైద్యులకు యజ్ఞమున భాగములేదు. భగవానుఁడు భక్తవత్సలుడు. అందువలన నిప్పుడాతఁడు వైద్యావతారమును ధరించెను. ఆతఁడమృతము నొసంగుటచే దేవతలు స్వార్థవశమున వైద్యులకును యజ్ఞభాగము నొసఁగిరి. ప్రపంచమునఁ జమత్కారమునకు నమస్కారము పెట్టవలెను. ఎవరి వద్దనైన నేమైన నుండిన వారితో సంబంధమును బెట్టుకొనుట మనము గౌరవముగ భావింతుము. ఎవరి దగ్గరనైన నేమియును లేకుండిన వారితో మాటలాడుట వ్యర్థమనుకొందుము. కావున నీయవతారము వట్టిచేతులతో రాలేదు చేతిలో నమృతకలశమును బట్టుకొని యుత్పన్నమయ్యెను.

శ్రీశుకదేవు డిట్లనెను :- "రాజా! లక్ష్మీదేవి శ్రీమన్నారాయణుని కంఠమందు విజయమాలను వేయఁగా భగవానుఁడును సంతోషమున నామెను దన హృదయహారముగ జేసికొనగా దేవాసురులు లక్ష్మీదేవి విషయములో నిరాశను జెందిరి. వారందరును నామెను మాతృభావమున స్వీకరించిరి."

సముద్రము మథింపఁబడెను. ఇంతలోనే మదముచే విఘూర్ణనేత్రములు కలిగినదియును, నలసట చెందినదియుఁ, దూగుచుండునదియు, మదమత్తయై యుండినదియు నగు వారుణియను

సుందరి యుదయించెను. అందరును ననురాగభరిత దృష్టులతోఁ జూడసాగిరి ! భగవానుఁడిట్లనుకొనెను :- ఈమెను దేవతలు గ్రహించిరా ! వీరు సదా వారుణీమదమునఁ జూర్ణులై నన్ను మరువఁగలరు. అందువలన నాతఁడు మొదటనే యిట్లనెను:-నాయనలారా! ఈమె యసురుల భాగమునకు సంబంధించిన సొత్తు మనము వారికన్యాయము చేయరాదు.'

అసురులు హర్షోల్లాస స్వరమున శ్రీఘ్రముగ నైక్య కంఠమున నిట్లనిరి :- "అవునవును ఈమె మా భాగమునకే రావలయును. మే మీమెను నవశ్యము గ్రహించెదము." ఇట్లు పలికి ఆ యసురులందరును శ్రీహరి సమ్మతిచే వారుణీ దేవిని గ్రహించిరి. భగవానుఁడు సమ్మతించుటచే సురలు విరోధింపలేదు. వారును దీని ననుమోదించిరి.

సముద్రమంథన మింకను నాగిపోలేదు. అమృతోత్పాదనము కావించు సంకల్పమింకను నెరవేరలేదు. అమృతోత్పాదన మగువరకు బరిశ్రమ మొనర్చుటయే పురుషార్థము. నియమ పూర్వకముగ ధైర్యముతో విఘ్నముల నెదుర్కొనుచు నవ్యగ్రభావముతోఁ దన కార్యమందు నిమగ్నుఁడై యుండువాని కొకానొక దినమున నవశ్యము సఫలత ప్రాప్తించితీరును ఇట్లాలోచించుకొని దేవాసురులు ద్విగుణీకృతోత్సాహముతో సముద్రమును మథించుచుండిరి. ఈసారి వారి పరిశ్రమము సఫలమయ్యెను. సముద్రమునుండి సాక్షాత్తుగ విష్ణుభగవానుని అంశావతారుఁడగు ధన్వంతరి ప్రకటమయ్యెను.

ఆతని భుజములు స్థూలముగను, బొడవుగను, గండర ములు తేలి సుందదముగను మనోహరముగను నుండెను. ఆతని కంఠము శంఖమువలెనుండెను. ఆతని దీర్ఘాయత అరుణ విశాల నేత్రములు వికచకమలములవలె నుండెను. ఆతని శరీరము సుంద రముగను, నునుపుగను, శ్యామవర్ణముగను నుండెను. నవీన తరు ణావస్థగ నుండెను. కంఠమున నమ్లాన పుష్పములతోఁ గూడిన సుగంధిత బృహన్మాల మోఁకాళ్ళ వరకును వ్రేలాడుచుండెను. అంగ ప్రత్యంగములందు తత్స్థానీయ అమూల్యా భరణములను ధరించియుండెను. ఆతని శోభాయుక్తమగు సుందర శరీరమునఁ బీతవర్ణముగ నున్న నులిపిరి పట్టువస్త్రము తళ తళ మెరయుచు శోభించుచుండెను. అది వాయువశమున నటు నిటు నెగురుచుఁ దన బాల సులభ చాపల్యమును బ్రదర్శించుచుండేను. విశాల వక్షః స్థలమున మణి మయహారములు విద్యుత్ప్రభా సదృశముగఁ దళుకు దళుకున మెరయుచుండెను. కర్ణములం ద్యంత స్వచ్ఛములును బ్రకాశ మానములును నగు మణిమయ కుండలములూగుచు మెరయు చుండెను. అవి శోభాయమానముగ నుండెను. నల్ల నల్లగ నున్న నుంగరములు తిరిగిన వెంట్రుకలు సుగంధ ద్రవ్యములచే బాగుగా దువ్వి చిక్కుదీయఁబడి, అలకావళి కదలుచుఁ దమ కుటిలత్వ మందును దమకాంతులను వెదజల్లుచుండెను. అవి దర్శకుల మనము లను దృప్తినిఁ గలిగించుచు నత్యంతాకర్షకముగను మనోహరము

గము నుండెను. ఇట్టి ధన్వంతరి తన అంగుళీయ కంకణాదులచే విభూషితములైన హస్తములందు సువర్ణ పూర్ణకలశమును బట్టుకొని బయటకు వచ్చెను.

శ్రీ శుకుఁడిట్లనెను:- "రాజా! ఈ సముద్రమంథన లీలతో నొక్కసారిగా భగవంతుఁడు ధరించినన్ని యవతారములను నింక నే లీలలోను ధరించియుండలేదు. ఈ ధన్వంతరియును భగవానుఁడు శ్రీహరియొక్క అంశావతారమే. భగవంతుని చతుర్వింశతి అవతారములలో ధన్వంతరి యవతారమును గలదు. ఈతఁడె పృథివి యందాయుర్వేద విద్యను ప్రచారమును గావించెను. దీని వలన వాయువు సురక్షితమగును, వృద్ధియగును, నకాలమృత్యువు లను దప్పించుకొన వచ్చును. ఈతఁడే ఆయుర్వేద విద్యకుఁ ప్రథమాచార్యుఁడుగ నెన్నఁబడుచున్నాడు. ఆతని నామసంకీర్తనముచే సమస్తరోగములును నశింపఁగలవు. ఈతఁడు చేతిలో నమృత కలశమును బట్టుకొని పుట్టెను.

ధన్వంతరి చేతిలో నమృత కలశమును బట్టుకొనియుండుటనుగాంచి అందరును హర్షకారణమున నృత్యము చేయసాగిరి. అమృత రూపమగు రవినిఁ గాంచఁగానే అందర యొక్క ముఖకమలములు వికసించెను. అందరును వెంటనే వాసుకిని వదలివైచిరి. సముద్రమంథన కార్యము సమాప్తమయ్యెను. అందరును నాశాభరిత దృష్టులతో నాయమృత పూరిత కలశమువైపునఁ జూచుచుండిరి. దానినిఁ దీసికొనుటకును, దానిని రుచిచూచుటకును నందరును

వ్యగ్రులై యుండిరి. ఎంతో ప్రతీక్షతోడను, నెన్నో విఘ్నబాధల తోడను నుత్పన్నమైన వస్తువును గాంచుట కెంతో ఉత్సుకత యుండును, ఇట్టి సమయములం దెవరికో గాని ధైర్యముండదు. అజితేంద్రియులును, సాధన మూలమునఁ దమ యింద్రియములను సంయమము చేయనివారును నిట్టి సమయములందు దమ ధైర్యము నుండి విచలితులగు చుందురు, అమృతమును జూడఁగనే అందఱ మనస్సులలోను లోభము పుట్టెను, సమస్త కర్తవ్యములకును దిలాంజలుల నొసంగి, ఎవరికి వారు తమ స్వార్థమును గూర్చి ఆలోచింప అందరును నమృతమును నొంటరిగాఁ ద్రాగివేయుటకుఁ బ్రయత్నించుచుండిరి. అందువలనఁ బుట్టఁగానే అమృతము కొరకు లాగులాట పెనఁగులాట ఆరంభమయ్యెను.

శ్రీ శుకదేవుడిట్లనెను :- "అమృత భరిత కలశమునుగాంచి సమస్త వస్తువులమీఁదను మొదటినుండియు మనస్సును బోనిచ్చిన నసురులిప్పుడు దానిని లాగుకొనుటకుఁ బ్రయత్నము చేయుచుండిరి.

..........

## అమృతము కొరకు అసురులందు బరస్పర కలహము

శ్లో॥ మిథః కలిరభూత్తేషాం తదర్థే తర్ష చేతసామ్
అహం పూర్వమహం పూర్వం నత్వం నత్వమితి ప్రభో॥
శ్రీభాగ. ౮ స్కం. ౮ అ, ౩౮ శ్లో॥

వ. రాజా! అసురులమృత కలశమును గొనిపోఁగా నా యమృతలోలుపులగు దైత్యులందుఁ బరస్పర కలహము చెలరేగెను. నేను ముందు త్రావెదనని నేను ముందు త్రావెదనని ఒకఁడనఁగా నీవు కాదు నీవు కాదని వేరొకఁడు లాగుకొని కలహించుకొనుచుండిరి.

అధర్మముచే-పాశవికబలముచేఁ బ్రాప్తించిన సంపత్తి-ప్రాప్తించినపుడు మాత్రము క్షణిక సుఖము కలుగును, పరిణామమున దుఃఖమే కలుగును. అధర్మముచే నుత్పన్నమైన ధనముచే నెవనికైనను సమృద్ధి కలిగినచో సమస్త చోరులు ధనికులును శ్రీమంతులును గావలయును. చాల రాజకీయోద్యోగులు అభియోగములందు నిత్యమును బ్రజల నుండి మిక్కిలిగ ధనమును నను చితముగఁ గైకొనుచుందురు, దానిని సుకృతమందు వినియోగించినచో నందరును ధనికులగుదురు. కాని సాధారణముగఁ జూడఁగా నీవిధముగ నధర్మముగను నన్యాయముగను ధనము సంపాదించు వానికి కడుపు నిండనే నిండదు. వానివంశము నిలువదు. ధన మే విధముగ వచ్చినదో ఆ విధముగనే పోవును. ఈ విషయమున నొక

గాథ కలదు. ఒకానొక వేశ్య వృద్ధావస్థలో ధర్మకర్మ లొనర్పఁ దలఁచెను. ఆమె యిట్లనుకొనెను :- పితృపక్షమున శ్రాద్ధ మొనర్చుట మహాపుణ్యము కావున నేనును శ్రాద్ధ మొనర్చెదను. ధనము నకు గొదువలేదు. ఆమె బ్రాహ్మణులకు తన యభిప్రాయమును జెప్పెను. అప్పుడిప్పుడెవరె ఘోర దరిద్రుగము రాలేదు. వేశ్య వలనఁ బొత్తరను గ్రహించుటకే బ్రాహ్మణుఁడును నంగీకరింప లేదు. ఈ విషయ మొక ముసలి ధూర్తునకు దెలిసెను. అతఁడు చక్కఁగఁ దిలకమును దిద్దుకొని బ్రాహ్మణ వేషమును ధరించి వేశ్య కడకుఁబోయి "అమ్మా! ఆశీర్వాద"మనెను.

ఆమె లేచి వృద్ధ కపట వేషధారియగు బ్రాహ్మణునకు స్వాగత మొసంగి యిట్లనెను :-"స్వామీ ! మీరు దయచేసినారు మా యింట నిత్యమొక బ్రాహ్మణుఁడు భోజనము చేయవలెను. పొత్తరు తీసుకొని పొండు."

వృద్ధధూర్తుఁ డిట్లనెను ;-"అమ్మాయీ ! ఏమంటివి. మీ ధన ధాన్యములు నికృష్టములైనవి. బ్రాహ్మణుడేల గ్రహించును. కాని మీ బోటివారికి ఉద్ధారమెట్లు కలుగును? కానిమ్ము నేను వట్టి ధాన్యమునే తీసికొందును. వేశ్య దీనిని సహర్షముగ నంగీకరించెను. ప్రతి దినమును మోయనులు తీసికొని పోవుచుండెను. ప్రతిదినము వప్పు పరమాన్నములను జేసికొనుచుండెను. ఆమె ప్రతి దినమును నొక సువర్ణ ముద్రికను దక్షిణ నిచ్చుచుండెను. ఈ విధముగఁ బదునారు దినములు మిక్కిలి యానందముగ జరిగెను. చివరకు

వేశ్య ధూర్తమహారాజు చరణ ప్రక్షాళనమొనర్చి పాద తీర్థమును బుచ్చుకొనెను. వస్త్రధనాదులను దానమొసంగి చేతులు జోడించుకొని యిట్లనెను :- "స్వామీ ! కొంచెముగ నాశీర్వదింపుఁడు."

ధూర్తుఁడు సమస్త వస్తువులను మూటఁగట్టుకొని యుంచు కొని యిట్లనెను.

ఆ॥ హాయిగా జరిగె మ హాలయ పక్షంబు
పప్పుపాయసముల నప్పళింప
పాపద్రవ్య మిపుడు పాపికే పోయెను
వేశ్యదీవు ధూర్త విభుఁడ నేను॥

ఇట్లువలికి ఆతఁడు వెడలిపోయెను. సారాంశ మేమనగా ధనమెట్లు వచ్చినదో అది అట్టి పనికే వినియోగింపఁ బడును. ఇతరులను విశ్వాసఘాత మొనర్చి సంపాదించి తెచ్చిన ధనమును సాధార ణముగ దానిననుభవింపఁ జాలరు.

శ్రీ శుకదేవుఁ డిట్లనెను:- రాజా ! దేవతలు చాలపరిశ్రమ మును గావించిరి భగవదాజ్ఞను మన్నించి సంతోషమును జెందిరి. ఏవస్తువు మీఁదను మనస్సును బోనీయలేదు. దైత్యులకులొంగియే యుండిరి. దైత్యులు వారికంటె బలవంతులు వీరికిఁ గేవల మజిత భగవానుని అండయే. భగవంతుని అండచేతనే వారు ప్రయత్న మొనర్చిరి పరిశ్రమచే నమృతము నుత్పన్నము కావించుకొనిరి. కాని స్వార్థమ్ము నుండియు నొక్క ఆచారమ్ము వచ్చుచున్నది. క్రొద్ది

వారు పరిశ్రమ మొనర్చి యుత్పత్తియునర్చుటయును బలవంతులు దానినుపభోగించుటయును జరుగుచున్నది. ఏలయనఁగా నిర్థరును భగవంతుని విశ్వసింపరు నిర్బలమగు ధర్మమును బలవంతమగు నధర్మ మణచును. నిర్బలుఁడైనను భగవాను నాశ్రయించి ప్రయత్న మొనర్చినచో నాసుమధుర ఫలము వానికి ప్రాప్తించును. బలవంతులు ముఖములు చూచుకొనుచున్నట్లే యుందురు, కొంత కాలమన్యాయియగు బలవంతుఁడు ఆనందమును జెందిన జెందును గాక వారు రిక్తహస్తులు కావలసి వచ్చును.

శ్రీశుక దేవుఁడిట్లనెను:- "రాజా! అసురు లత్యంత లోలుపులు. వారు సముద్రమునుండి వచ్చిన ప్రతివస్తువును దీసికొనఁదలచిరి. భగవంతుఁడు మధ్య నుండుట చేతను దేవతలందరును నోర్పుతో నుండుట చేతను వారింత వరకు తోడ్పడు చుండిరి. పోరాడఁ జాలక పోయిరి. ఇప్పుడు ధన్వంతరి చేతిలో నమృత కలశమును జూడఁగానే వెంటనే వారందరును దాని మీఁద విరుచుకొని వడి, ఆ యమృతమును వారును వీరును లాగుకొనుచుండిరిఁ క్షణములో వస్తువు వారిదయ్యెను. దేవతలూరక జూచుచుండిరి. దైత్యులు వదఁబీసుకొని పోయిరి. వస్తువును దీసికొని పారిపోయిరి.

దేవతల ముఖము నల్లబడి పోయెను. వారత్యంత దుఃఖితులైరి. ఒరినొకరు ధిక్కరించు కొనుచుండిరి. 'నీ యజాగ్రత్త వలననే నిట్లైనదని యొకఁడనును, ఇంకొకఁడంతయును గష్టపడితిమి;

వడఁబీకుకొని పోయిరిగదా !' యనెను. అంతయును బేడయును బెల్లమైపోయెను. వారత్యంతదీనులై మలిన ముఖములతో శ్రీహరి శరణు వేఁడిరి. ఓడినవానికి హరియే దిక్కు.

దీన దయాళుఁడగు దామోదరునకు దేవతల దీనదశను జూఁడగనే దయ కలిగెను. వారినోదార్చుచు నాతఁడిట్లనెను:- దేవతలారా ! ఇంతలోనే బయటపడెదరేల ? చింతింప వలసిన పనిలేదు మీరు నన్ను విశ్వసింపుఁడు. నేను మీరు తప్పక అమృతము నొసంగెదను తప్పక నొసంగెదను. ఇది నా ప్రతిజ్ఞ. నా మాయచే మాయావులగు దైత్యులను మోహమునఁ బడవైచి, వారి కుకృత్యమునకు ఫలమనుభవింపఁ జేసెదను. అమృతమును వారినుండిలాగు కొని మీ కిప్పించెదను. కడుపు నిండ ద్రావించెదను. చివరకువారిని గ్రుడ్ల గూబలను జేసి కూర్చుండ బెట్టెదను."

భగవంతుని యీ యాశ్వాసమున దేవతల దుఃఖము దూరమయ్యెను. వారు భగవద్వచనములను విశ్వసించి నిశ్చింతులైరి. అటుల నసురులమృతమును గైకొని పారిపోయిరి. సమస్తాసురులు వారి వెంటఁబడిరి. దేవతలు మెదలకుండ నచ్చటనే భగవంతుని మీద భారమునువైచి కూర్చుండిరి.

దైత్యులలోను గొందరు బలవంతులు. కొందరు నిర్బలులు. కొందరు చిన్నవారు కొందరు పెద్దవారు. కొందరు మంచివారు కొందరు పోకిరులు. కొందరు సరసులు కొందరు పెడకట్టెలు, మనస్సులోఁ గష్టము కలవాడంధరతోడను గష్టమొనర్చును. అన్న

దమ్ములనుకూడ మోసగించును. తండ్రి బ్రదికి యుండఁగానే వాని పేద నధికారమును వహింపఁజూచును అసురులలో బలవంతు లిట్లనిరి, "ముందుగా మనము త్రాగుదుము. తరువాత నితరులు త్రాగగలరు" ఇంకొకఁడిట్లనెను:- "అదెట్లు ? నీకు బంగారురెక్కలు న్నవా ? ముందుగా మేము త్రాగవలయును" మరియొకఁడిట్లనెను:- "నీవని, నేనని, యెందులకు ? అందరమును సమానముగఁ బంచు కొందుము."

నిర్బలులైన మాటలునేర్పు కలవారు మన కమృతమునీయ రని, ధర్మము నాశ్రయించిరి. ఇచ్చట తమపప్పులుడకవని తెలిసి కొనిన వారు ధర్మమునుగైకొని ధార్మికముగ నది సార్వజనికముగ నుండవలయుననుచుండిరి, ఇట్టిదుర్బలురగు నసురులు జనమునకు ధర్మప్రతినిధులై అసూయాద్వేషములను స్వార్థమును నాశ్రయించి యిట్లనిరి:- 'సోదరులారా ! మేము ధర్మవిషయమును జెప్పుచు న్నాము. దేవతలును దైత్యులును సమానముగఁ బరిశ్రమ మొన ర్చిరి. అందరకును సమానభాగములు లభింపవలయుననుట న్యాయము. బలవంతుఁడంతయు చీల్చివేయ గూడదు. నిర్బలు డట్లు నోరుతెరుచుకొని చూచుచుండవలసినదేనా ? అన్యాయమొన ర్పఁగూడదు. అధర్మము నాశ్రయింపకుఁడు లోక పరలోక విచార మొనర్పుఁడు. 'యతో ధర్మస్తతో జయః' ఎచ్చట ధర్మముండునో అచ్చట విజయము కలుగును. ధర్మము నెవరు రక్షించెదరో వారిని ధర్మము రక్షించును. కావున ధర్మరక్షణ మొనర్చుటచే మీకుఁ గల్యాణము కలుగఁగలదు."సనాతన ధర్మమునకు జయమగుగాక !"

శ్రీశుక దేవుఁడిట్లనెను:- "రాజా! ఆయసురలీప్రకారముగ సమ్మృతము కొరకు బరస్పరము వాదవివాదములొనర్పసాగిరి. దూర ముల నుండి వారికి గలగల శబ్దము వినిపించెను. అసుర లమృత మును మరచి యావైపుననే చూచునంతటి ఆకర్షముగ నాధ్వని యుండెను. వారటు నిటు జూచుచుండిరి.

.....

## మోహినీ అవతారము

శ్లో॥ ఏతస్మిన్నంతరే విష్ణుః సర్వోపాయ విదీశ్వరః ।
యోషిద్రూప మనిర్దేశ్యం దధార పరమాద్భుతమ్ ॥
ప్రేక్షణీ యోత్పల శ్యామం సర్వావయ వసుందరమ్ ।
సమాన కర్ణా భరణం సుకపోలోన్న తాననమ్ ॥
శ్రీభాగ. ౮ స్కం. ౮ అ. ౪౨ శ్లో॥

సీ॥ మెత్తని యడుగుల మెఱుఁగారు జానువు
లరఁటి కంబములదో యైనతొడలు
ఘనమగు జఘనంబుఁ గడులేత నడుమును
బల్లవారుణ కాంతిపాణి యుగముఁ
గడుదొడ్డ పాలిండ్లుఁ గంబు కంఠంబును
బింబాధరముఁ జంద్ర బింబముఖముఁ
దెలిగన్ను గవయును నలికుంతలంబును
బాలేందు సన్నిభ ఫాలతలము

తే॥ సమరఁ గుండల కేయూర హారకంక,
ణాదులేపార మంజీర నాద మొప్ప
నల్లనవ్వులఁబద్మ దళాక్షుడసుర,
పతుల నడిఁగింప నాఁడురూపంబు దాల్చె॥

శ్రీమదాంధ్ర భాగవతము

విరాగులు విరక్తిని వశపరచుకొందురు. ధన లోలుపులు ధనముద్వారా స్వీకరించెదరు. మానవంతుని సమ్మానము ద్వారా తమపక్షమునకుఁ దీసికొనవచ్చును. కొందరను గామినీద్వారా దాసుఁనిగాఁజేసి కొనవచ్చును. ఎవరు దేనినిఁగాంక్షించునో, దేని మీఁదవానికి వ్యసనముండునో వానిని దానిద్వారా వశపరచుకొని వాని చేఁ బనులు చేయించుకొనవచ్చును. ప్రపంచములోఁ బ్రియత్వమపేక్షా కృతమైనది. సాధారణముగ మనకెవరి మీఁదను ద్వేషము లేక, ఆకర్షణమున్నచో వారందరును మనకుఁబ్రియులే, కాని యెవరిలో నెంత యధికముగ నాకర్షణముండునో అంత ప్రియులుగ నెన్నఁ బడుచుందురు. ఎవరి యెడల నాకర్షణ మత్యధికముగ నుండునో వారికి సర్వస్వము నర్పించుచుందురు, వారికీయ రాని వస్తువనునది యుండదు. వర్షాకాలములోఁ బతంగములు జ్యోతినిఁ గాంచి ఆకర్షింపఁబడి దానిలోఁబడును చివరకుఁ దమ సర్వస్వమును బోఁగొట్టుకొని ప్రాణములను గూడ నర్పించును, ప్రపంచములో నీ పాకర్షణమే లేకున్నచో నీప్రపంచ చక్రమే తిరుగదు.

ప్రపంచాకర్షణము చేతనే యీ సృష్టి క్రమము నడుచుచున్నది. జీవిధర్మమును వీడి అనుచితాకర్షణములోఁ బడినచో నాతఁడు మోసఁబడి పోవును. అప్పుడంతయును గోల్పోవును.

శ్రీశుకదేవుఁడిట్లనెను :- "రాజా ! అమృతమును గోల్పోయి దేవతలు దుఃఖులుకాఁగా, దుఃఖితుల దుఃఖములను బోఁగొట్టు దీన దయాళుఁ డిట్లనెను :- మీరు నిరాశను జెందకుడు. నన్ను శరణు వేడినవారు నిరాశను జెందరాదు. నేను మీకిష్టము వచ్చినట్లమృతమును బోసెదను."

దేవతలు నిరాశాస్వరమున నిట్లనిరి :-"స్వామీ ! ఇంకేమి పోసెదరు? ఇప్పుడా దుష్టులగు దైత్యులు లాగుకొని పోయినారు. వారు దానిని మిగులనిచ్చెదరా? పోఁగానే త్రాగివైచెదరు ఇప్పుడు వారితో యుద్ధమొనర్చి బలవంతముగఁ ద్రాగనీయకుండు ప్రయత్న మొనర్చినచో వారు త్రాచను ద్రావరు, మనలను ద్రావనీయరు, నేలమీదఁ బారపోసెదరు నీటిలోఁ గుమ్మరించెదరు. ఇప్పుడు వారి చేతినుండి లాగుకొనుట కే యుపాయమును దోచుటలేదు."

ఇది విని భగవానుఁడు నవ్వి యిట్లనెను :- "దేవతలారా ! మీరు నన్ను విశ్వసించుటలేదు. మీరు మందరాచలమునెత్తఁజాలక పోయితిరి. ఆ సమయమున నేనెట్లు లీలగాఁ దెచ్చితిని ? మీరు మథించుటలో నిరాశ చెందఁగా నా సమయమున నేను స్వయముగ మథించి మీకు సహకార మొసంగలేదా ? మందరము జలములలో మున్ఁగు చుండఁగా నా సమయమునఁ గచ్ఛపమునై నేను దానిని

నావీపుమీఁద ధరింపలేదా ? ఉపాయములు నాకు దెలియును. మీరు చూచుచుండుఁడు. దైత్యుల మృతమును ద్రాగనులేరు, పారవేయరు, సంతోషముతో, బుద్ధిపూర్వకముగ వారు నాకమృత కలశము నొసంగెదరు. నేను ఖాము చావకుండునట్లును బడిత విఱుగకుండు నట్లును జూచెదను మీరు నాచాతురినిఁ జూచుచుండుడు.

దేవతలిట్లనిరి :-"మంచిది స్వామీ ! మీరు సర్వజ్ఞులరు, సర్వసమర్థులరు, సమస్తమును జేయగలరు."

శ్రీశుక దేవుఁడిట్లనెను :- "రాజా ! ఇట్లు పలికి శ్రీహరి అంతర్హితుఁడయ్యెను మాయవిశారదుఁడును, నటనాగురుఁడగు భగవానుఁడు దేవతలేమి, దేవాధి దేవుఁడగు మహా దేవుఁడును నా రహస్యమును దెలిసికొన జాలక, కొంచెముసేపు విమోహితుఁడయ్యెను.

అమృతము కొరకు దైత్యులు పరస్పరము కలహమొనర్చు కొనుచుండిరి. ఆ యమరౌషధము కొరకు స్వాభావిక సౌహార్ద్రము సమఁదిలాంజలి నొసంగి వారు దస్యు ధర్మమందుఁ బ్రవృత్తులై అమృత పాత్రమును లాగుకొనుటకుఁ గలియఁబడుచుండిరి. ఆ సమయమునఁ గమ్మని ధ్వనిని విని వారందరును జెవులను నిక్కఁ బొడిచిరి పిల్లవాఁడేదైనను మారాము చేయుచు నేడ్చుచుండినచో నా సమయమునఁదల్లి నేచో మిఠాయినో, లేక సుందరముగ మెఱయు చుండు నాట వస్తువునో చూపిన నేడ్పును వదలి దాని యందను రక్తుఁడైనట్లు దైత్యులు పోరాటములను మరచి యాధ్వని నన్వే

షించుచుండిరి. ఇంతలో వారటు జూడఁగా నెదురుగాఁ బదనారేండ్లు వయస్సుగల శ్యామ తన ప్రకాశముచే దిశదిశలను దేదీప్యమాన మొనర్చుచు వచ్చుచుండెను. ఆమె రూప సౌందర్యమద్భుతముగను, ననిర్వచనీయముగను ననుపమానముగను, శ్యామముగను నిండుగ నుండెను. ఆమె అంగ ప్రత్యంగములనుండి సౌందర్యము వెలి గ్రక్కుచుండెను ఆమె కర్ణకుండలములు, కించిదున్నతమైన గోళ కపోలములకాంతి నత్యధికాకర్ష మొనర్చుచుండెను. మనోహర ముఖ మున వంకర దిరిగిన ముక్కు చెలుక ముక్కును దిరస్కరించు చుండెను. అర్థోన్మీలిత కమలము వలెనున్న మనోహర ముఖము నందు మందహాసము తళుక్కు మనుచుండెను. ఆమె నుండి మాదక దివ్యగంధము బయలుదేరి దశదిశలను సువాసిత మొనర్చుచుండెను. ఆ గంధమునకును, మకరందమునకును లోభపడిన మత్త మధు పములు కమలమను భ్రమచే నామె ముఖమునకు నలువైపులను మూఁగుచుండెను. యౌవనోత్తేజము కారణమున నామె యౌవన సౌందర్యము రాటుదేలెను. అందులో స్వాభావిక యుద్ధతత్వమును, నైసర్గిక యమాయకత్వమును, స్త్రీ సులభ చాంచల్యమునఁ గ్రీడించు చుండెను. క్రీడార్థముగను, లీలగను ముఖముపై వ్రాలవచ్చిన భృంగములను దోలుచుఁ గరకంకణములను నాభూషణములను గల గల లాడించుచు, గాలికెగురుచు తొలఁగిన వస్త్రమును సవరించు కొనుచు, నామె మంద మందగతిచే నసురులవైపునకు వచ్చుచుం డెను. ఒక క్రీడాకందుకమామె కమనీయ కరకమలము లందుచుం డెను. రెండు కఠోర కందుకములను తన రవికెలో దాచుకొని యుండెను. ఉదరము కృశమైన దగుటచే నామె

లతవలె వంగుచుండెను. నితంబముల భారకారణమున నామె పాద తలము లిసుకలో దిగఁబడిపోవుచుండెను. ఆ పాదముల నెత్తునపుడు ముఖమున శ్రమయుక్తమగు ముడుపుండుటచే స్వేదకణములుచిన్న చిన్న ముత్యములవలె మెరయుచుండెను. సర్పిణివలె నున్న నామె వేణి పృష్ఠదేశమున వ్రేలాడుచు వాయువేగము చేతను గమనశ్రమ నేతను గుటిలముగఁ గదలుచుండెను. దానిలోఁ దురిమిన మాలతీ, మల్లికా కుసుమములు వాడి వాడి అచ్చటచ్చట వ్రాలుచుండెను. కంఠమున నున్న మణులును, రత్నముల మాలలును వక్షఃస్థల స్పర్శచేఁ జంచలము లగుచుండెను. మృణాళ సదృశమగునత్యంత కోమల విశాల భుజములందు కంకణములు, బాబూబందులు, అంగ దాది భూషణములచే నలంకరింపఁబడెను. అవి శబ్దము లొనర్చు చుండెను. నిర్మల వస్త్ర వ్రేష్టితమగు నితంబ బింబద్వయము మీఁద సువర్ణమయమైన మొలనూలు విద్యుత్తువలె మెరయుచు మంజీరము వలె శబ్దించుచుండెను. జఘనోరువుల భారముచే నారక్త పాదద్వ యము నూపుర ఝుంకార సహితముగ మెల్ల మెల్లఁగా నుండి యుండి మ్రోగుచుండెను.

ఆ సబలయగు నబల సలజ్జా మందహాసము తోడను, భ్రూ భంగిమలతోఁగూడిన కటాక్షపాతముతోఁ గూడిన యాయత్యద్భుత రూపమును గాంచిన దైత్యయూథపతుల హృదయములందు గామో ద్దీపన మొనర్చుచుండెను. శ్రీశుకదేవుఁడిట్లనెను :- "రాజా! లీలా వేశమున నీ లీలలన యెవరో కాదు, ఘనశ్యాముఁడగు శ్రీహరియే యీ రూపమును ధరించెనను సంగతి నీవు మరవరాదు. లక్ష్మికి

మగఁడైన వాఁడిప్పుడు లక్ష్మికి జెలికత్తెయై వచ్చినాఁడు. ఎవడీ పరమ పూజనీయమును, వందనీయమునగు రూపమునందు గౌరవ భావమును గలిగియుండునో ఆతఁడు నరకమున కధికారి యగును. దైత్యులే యిట్టి భావమును జెందెదరు. దేవతలీ రూపమునకు నశ్రువిమోచనముగావించి భక్తితో మాటిమాటికిని బ్రణామము కావించెదరు. ఆతని పాదధూళిని శ్రద్ధతో శిరస్సున ధరించెదరు. కావున రాజా! ఈ మోహినీ భగవతి అసురుల మనస్సులను మథించుచు మందహాసముచే మూర్ఖులన్ను మోహింపఁజేయుచు నసురులకుఁ గొంచెము దూరముగ నిలుచుండెను.

ఆమెను జూడఁగానే అసురులందరును దమ్ముఁదాము మరచి పరస్పర మిట్లనుకొనిరి! "ఆహా! ఈ కామినియొక్క కాంతి యెంతటి కమనీయమైనది! ఈమె వేషమెంత విశుద్ధముగను విచిత్రముగనున్నది. ఎంతటి యౌవనారంభ నూతనావస్థ! ఈమె యెవరోకదా! దేవతలకీ సౌందర్యము లేదు. గంధర్వవిద్యాధర యువతులందును నిట్టి యనవద్య సౌందర్యము కనబడుటలేదు. ఇదిసృష్టికతీతమగు సౌందర్యము. ఇట్టి రూపలావణ్యమీ భూమండలమందు నేఁటి వరకెన్నడును విననులేదు, చూడనులేదు. పోయి అడిగిచూద మీమె యెవరో? ఏమి కావలయునో? మనకు దూరముగ నేల నిలువఁబడి యున్నదో?" ఇట్లు పలుకుచుఁ గొందరుత్సాహకముగల అసురులు పరుగిడి సమీపమునకుఁబోయి చెరిరి. చాల మంది పెద్ద అడుగులిడుచు వారిననుగమించిరి. కొందరు పెద్దలును వృద్ధులగువారు పైకి నిరపేక్షాభావమును బ్రదర్శించుచుఁదమ యుత్సాహము నాపుకొనుటచే వెనుకనుబోయి నిలిచిరి.

ఒక్కసారిగా నామె ననేక విధములఁ బ్రశ్నించిరి :- "దేవీ ! నీవెవతెవు ? నీవెచ్చటనుండి వచ్చితివి ? సుశోభనీ ! నీకేమికావలెను? మృగనయనీ ! నీకు మోహన మంత్రము తెలియునా ? భామినీ ? నీవెవరికుమార్తెవు ? ఇంకొకమాట నడుగఁ దలచుచున్నాము. అడుగ - నక్కరలేదు కాని యుండజాలక పోవుచున్నాము. నీ విప్పటి కెవరినైనను వివాహ మాడితివా ?"

మోహినీదేవి యెవరిప్రశ్నకు సమాధానమీయలేదు. తల వంచుకొని మెదలక నిలుచుండెను. మాటలు సాగించుట కసురులు మరల నిట్లనిరి :- "దేవీ ! దేవాసుర, సిద్ధ, గంధర్వ, చారణ, లోకపాలులెవరును నిన్నింతవరకు స్పర్శింపలేదని తోఁచుచున్నది. ఇంద్రాది లోకపాలురే నిన్నుఁ బొందజాలకున్న నిఁక నల్పవీర్యు లగు మానవులసంగతి చెప్పవలసినదేమున్నది ? మేమందరమును నీవిషయమును దెలియ నుత్సహించుచున్నాము. నీవు దేహధారులగు వారి నెవరి వీర్యము వలనను నుత్పన్నము కానట్లు తోఁచుచున్నది. సాక్షాత్తుగ బ్రహ్మ తనచేతులతోఁ బ్రపంచములోని సౌందర్యము నంతను బ్రోవుచేసి నిన్నునిర్మాణ మొనర్చినట్లున్నది. నానాక్లేశము లచేఁ గ్లాంతులగువారి మనస్సుల నానందమొనర్చుటకై దేహధారు లందు గల దయచే దైవము నిన్ను సృష్టించినట్లున్నది. పరస్పర మును గలహమునుజెందు మా అన్నదమ్ముల వాద వివాదమును శాంతింపజేయుటకై మాభాగ్యము నిన్నిచటికిఁ బంపినట్లున్నది. నీవెవరవు ? కృపతో నీ సంగతిని వివరింపుము."

ఇన్ని యడిగినను మోహినీదేవి యేమియును బలుకలేదు. ఆమె మాటిమాటికి అసురులమీఁదఁ గటాక్షబాణములు నాగి యాగి విసరుచు వారి నధికాధికముగ వ్యథితుల నొనర్చుచుండెను. అప్పు డసురు లత్యధికముగ నధీరులై యిట్లనిరి:-"నీవెవతెవైనఁ గానిమ్ము. నీకు నీపారివారక పరిచయముచే నేమి ప్రయోజనము ? నీ పరిచయము ప్రత్యక్షమే, ఇఁక మా పరిచయమును వినుము." ఇప్పుడు మోహినీదేవి కొంచెముగఁ దలనూగించి వారి పరిచయము నొసంగ నాజ్ఞాపించెను. అప్పుడు వారు మిక్కిలి యుల్లాసముతో నిట్లనిరి :- "భగవతీ ! మేమందరమును గశ్యప మహాముని సంతానము, గొప్ప కులీనులము, శ్రేష్ఠకులమందు మేము పుట్టితిమి, మేమందరమును త్రిలోకముల కధీశ్వరులము."

చిరునవ్వు నవ్వుచు మోహినీదేవి యిట్లనెను :- "అయితే మీరిచ్చట నేల గుమికూడినారు ?"

అంత నత్యంతాహ్లాదముతో నసురు లిట్లనిరి :- "భామినీ ! మేమందరమును గలిసి అమృతము కొరకు సముద్రమును మథించితిమి !"

మోహినీదేవి యిట్లనెను :- "అయితే అమృతము వచ్చినదా ? శీఘ్రముగ నసురులిట్లనిరి :- "ఆఁ, వచ్చినది ? చూడు మిదియే అమృతకలశము."

మోహినీదేవి యిట్లడిగెను :-"అయితే త్రాగరేల మీరు ? పోరాడు కొనెదరేల ?"

కొందరు నిర్బలులగు నసురులిట్లనిరి :- ''ఈయమృత కలశమే కలహమునకుఁ గారణము, మా యాబలి ముందుగా మనము కడుపునిండఁ ద్రావి, తరావ్వత నితఱుల కిచ్చెదమనుచున్నాఁడు, పంక్తి భేదము చేయరాదు, అందరకును సమానముగ నొసంగుడని మేమనుచున్నాము, ఈ విషయమున వాద వివాదము జరుగుచున్నది.''

వీణా వినిందితవాక్కులతో మోహినీదేవి నవ్వుచు నిట్లనెను:- "మీఱు కులీనులై జగడమాడు కొనుచున్నారా? న్యాయానుకూలముగఁ బంచుకొని త్రాగుఁడు."

అంతనన్యులు చాలమంది యిట్లనిరి :- "దేవీ ! భగవంతుఁడు నీకు మేలు చేయుఁగాక ! నీవు ధర్మముగఁ జెప్పితివి, మేమందర మన్నదమ్ములయ్యు లోభవశమున నొక వస్తువుకొరకు పరస్పరము వైరమును బెట్టుకొని, వాద వివాదము లాడుకొని, కొట్టుకొనుచున్నాము. నీవు పక్షపాతము లేని దానవు. నీవు మాకు మధ్యవర్తివై అన్నదమ్ములమగు మాకు న్యాయముగ నీ యమృతమును పంచి జాతి ద్రోహమును శాంతింపఁ జేయుము. గృహకలహము వలనఁ గలుగు కుల నాశనమునుండి మమ్ములను రక్షింపుఁము." ఇట్లు పలికి యా యసురు లందరను సంబోధించుచు నిట్లనెను :- "చెప్పుఁడయ్యా ! ఇది యందరకిష్టమేనా ? దేవి నందఱును మధ్యవర్తిగా నుండ నిచ్ఛగించెదరా ?"

అసురులందఱును మోహినీ వేషధారియగు భగవానుని మోహినీ మాయాకారణమున మోహితులైరి వారందఱు నామె

యెట్లు చెప్పిన నట్లుచేయుట కుద్యుక్తులగు చుండిరి ఆమె కటాక్ష సంకేతముచే వారి ప్రాణములనైన నొసంగుటకుఁ గటిబద్ధులై యుండిరి. అందఱును నొకే స్వరమునఁ జేతులనెత్తి యిట్లనిరి :- "మేమందరము సహర్షముగ నంగీకరించుచున్నాము. దేవి మన మధ్యవర్తిత్వమం దధి నాయికగ నుండుగాక! ఆమె మనకు న్యాయాధీశ్వరి యగుగాక! ఆమె నేమియు నీయకున్నను, విష మును ద్రావించినను మాకిష్టమే."

ఇది విని మోహినీదేవి చిరునవ్వునవ్వుచుఁ తనకుటిలకటాక్ష భంగిమములతో దైత్యులవైపుఁజూచుచు నిట్లనెను :- "అసురులారా! మీరు కశ్యపుని సంతానమని చెప్పుచున్నారు. కాని నాకు మీరు వట్టి అమాయకులవలెఁ గనఁబడుచున్నారు."

అసురులు సముత్సుకులై యిట్లనిరి :- ఏమమ్మా! ఏమది? మోహినీదేవియిట్లనియెను :- ఏమున్నది? మీరు స్త్రీమాయలోఁబడి పోయినారు. ఎచ్చటనైనను గామినులను విశ్వసించెదరటయ్యా! ఏస్త్రీయైనను, సతీసాధ్వి, పతివ్రతయగు స్త్రీయైనను, కులీన స్త్రీయైనను, పిరవ్రనవినియగు మాతయైనను విశ్వసింపవచ్చునుగాని పణ్యస్త్రీ, వారాంగన, చంచలచిత్త వ్యభిచారిణిని విశ్వసించువారు తెలిసి తెలిసి అగ్నిలో దుముకుటయే గదా! పతంగముల వలె నామె రూపజ్యోతి లోఁబడి చచ్చుటయే కదా! మీరు నన్నెరుఁగరు. నేనొక యిల్లాలనుగాను. వ్యభిచారిణియగు వేశ్యను. నన్నెవరు ప్రేమించె దరో, నాధ్యానమెవరు చేసెదరో, నావిషయములనే వినుచుందురో,

నాకే తమ సర్వస్వమును సమర్పించెదరో, నాపాదములనే సేవించెదరో, నన్నే హృదయమందు ధరించి నిద్రించెదరో, నన్నుఁదలచుకొని యేడ్చెదరో, నాచింతయందే తమ్ముఁదాము మరచెదరో, నేను వారిదాననగు చుందును. నేను నన్నువారి కర్పించుకొందును. నేను వారి కధీన మగుదును. నన్ను మరచినవారు దుఃఖముల పాలగుదురు. నేనొక్కరికి సంబంధించినదానను గాను. అందరకును గావలసినదానను. ఇట్టిస్త్రీలను విశ్వసించుట మీబోటి స్వాభిమానులకు తగనివని."

ఇది వినఁగానే దైత్యులకు విశ్వాస మధికమయ్యెను. సూతుడిట్లనెను :- "మునులారా ! ఎవఁడైనఁదన యవగుణములను దనకుఁదానే చెప్పఁబూనినచోవాని సత్యత యందందరకును విశ్వాసము కలుగును. కావున మిక్కిలి విశ్వాసముతో నసురులిట్లనిరి :- "నీ వెవతెవైనగానిమ్ము. మమ్ములను ప్రేమభరిత దృష్టులతోఁ జూచినఁ జాలును. ఇదియే మాకు కోర్కె."

మోహిని యిట్లనెను :- "వ్యభిచారిణీస్త్రీల దృష్టి స్వాభావికముగ నిట్లేయుండును. కాముకులు భ్రమవశమున నామెను ప్రేమమయయనుకొనుచుందురు. కమలిని స్వాభావికముగ వికసించును. కానిమధులోలుపులగు మూఢమధుపములు అది తనను గాంచియే వికసించినదనియుఁను, దన్ను రసము ద్రావుమని పిలచుచుఁ గదలుచున్నదనియుఁ దలచును. అట్లే స్వైరిణి స్వభావానుసారముగ నవ్వును. కటాక్ష పాత మొనర్చును; కాని కాముకులు వాడు తమ

# అమృతమును బంచు మోహినీదేవి

శ్లో॥ తస్యాం నరేంద్ర కరభోరు రుశద్దుకూల
శ్రోణీ తటాల సగతిర్మద విహ్వలాక్షీ।
సాకూజతీ కనక నూపుర శింజితేన
కుంభ స్తనీ కలశపాణి రథావివేశ॥

శ్రీభాగ. ౮ స్కం. ౯ అ. ౧౭ శ్లో॥

సీ॥ పాలిండ్లపైనున్న పయ్యెద జాఱించు
జాఱించి మెల్లన చక్కనొత్తు
దళ్కు దళ్కను గండఫలకంబు లొలయించు
నొలయించి కెంగేల నుజ్జగించుఁ
గడుమెఱుంగులు వాఱు కడకన్ను లల్లార్చు
నల్లార్చి ఱెప్పల నండ గొలుపు
సవరని దరహాస చంద్రికఁ జిలికించుఁ
జిలికించి కెమ్మోవిఁ జిక్కువఱచు

తే॥ దళిత ధమ్మిల్ల కుసుమ గంధమ్ము నెఱపుఁ
గంకణాది ఝణంకృతుల్ గడలు కొలుపు
నొడలి కాంతులు పట్టులే కులుకఁ బాఱు
సన్నవలింపుఁ బయ్యెద సౌకళించు॥

శ్రీమదాంధ్ర భాగవతము

జీవి యెవరియందు మోహమును జెందునో వారికి సర్వస్వమును నర్పించివేయును, కామవేగమంత ప్రబలమైనదనఁగా దానిలో వివేక మనునది యుండదు మానవుఁడు దేని మోహములోఁ బడునో దాని మాటలన్నియును బాగుగఁ గనఁబడును. ఆమె యొక్క ప్రతి చేష్టయును సుఖదముగఁ దోచును. వేషము కూడ గుణము ననుసరించియే ఒసఁబడును. మదము దిగిపోయిన తరువాత జ్ఞానము కలుగును. అప్పుడాతని పొరపాటు గోచరమగును.

శ్రీశుక దేవుఁడిట్లనెను :- "రాజా! ఆ మోహినీదేవి తాను స్పష్టశబ్దములతోఁ బణ్యాస్త్రీనని చెప్పఁగాఁ గాముకులగు నాయసురులింకను నెక్కుడుగ విశ్వసించి, యామెను మాటిమాటికిని నమృతమును బంచుమని కోరిరి. ఆమె వయ్యారపు రూపము ముందమృతము తుచ్ఛముగ నుండెను, ఆమె మధుర మందహాసము ముందమృతము నీరసముగను శుష్కముగను నుండెను. అసురులు విశ్వసించి మోహినికి అమృత కలశ మీయఁగానే స్థూణాఖనన న్యాయముచే మోహినీదేవి యిట్లనెను :- "అసురులారా! మీరు తరువాత నన్ను దోషమెంచరాదు. చెవులు తెరచుకొని నా మాటను మరల నొకసారి వినుఁడు. నేను మంచిచేయనిండు, చెడ్డ చేయనిండు, కొందర కధికముగ నిత్తును గొందరకు దక్కువగ నిత్తును కొందరకీయఁ బోవచ్చును. ఈమె పక్షపాత మొనర్చినదని నన్నుఁ దరువాత నిష్ఠూరమాడరాదు."

అసురు లత్యంత ప్రేమతో నిట్లనిరి :- "బాయమ్మా! నీవెట్టి విచిత్రపు పలుకులు పలుకుచున్నావు. మేమొక్క మాట

మాటలాడమని చాలాసార్లు చెప్పితిమి. మాచే నొట్లు పెట్టించుము, ప్రతిజ్ఞాపత్రమును వ్రాయించుకొనుము. గంగ మధ్యలో నిలుచుండ బెట్టి యొట్టు పెట్టించుకొనుము. మాకంతయు నిష్టమే. నీవేది చేసి నను మేము దానిలో జోక్యము గలిగించుకొనము."

ఇది విని మోహినీదేవి నవ్వెను. ఆమె తన హాస్యముచే నందర మనస్సులను మంత్రముగ్ధములు కావించెను. మరల బొమలు ముడిచి నవ్వుచు నధికార స్వరమున నిట్లనెను :- "సరియే, పొండు, మీరందఱును స్నాన మొనర్పుఁడు."

అసురులకు స్నానము కావలెనా ? కాని మోహినీదేవి యాజ్ఞచే వారందఱును నలుగుఁబెట్టుకొని బాగుగ స్నానమాడిరి.

అప్పుడు మోహినీదేవి యిట్లనెను :- "అందఱును గ్రొత్త గుడ్డలు కట్టుకొనవలెను." అసురు లేమున్నది ? వట్టి మూఢులు తామె ప్పుడు క్రొత్తగనే యుందురని క్రొత్త గుడ్డలను గట్టుకొనిరి. గంధ మును బూసుకొనిరి. సుగంధ పుష్పమాలలను ధరించిరి వస్త్రభూష ణములచే సుసజ్జితులై ముస్తాబు చేసికొని వారు మోహినీదేవి సమీ పమునకు సమీపించిరి.

అంతవారు ప్రజ్వలితాగ్నిలో హవనమును గావించిరి కామ ధేనువును బూజించి బ్రాహ్మణులకు దాన దక్షిణల నొసంగిరి. వేద వాదులగు మునులచే స్వస్త్యయనము కావించి, యుల్లాసముతోఁ బిల్లలవలె నామెతో నిట్లనిరి :-"దేవీ ! ఇప్పుడేమి చేయవలయును,"

అందరకును ప్రధాన సభ్యురాలిట్లనెను :-"అయితే, మీరం దరా పెద్ద భవనమునఁ గూర్చుండుఁడు."

మోహినీ యాజ్ఞను బొంది మిక్కిలి శీఘ్రముగ వారందరును బోయి యా విశాల భవనమునఁ గూర్చుండిరి. ఇప్పుడు దేవతలకు సాహసము లేకుండెను. భగవానుని యాశ్వాసనమును మరచి వారి ట్లను కొనిరి :-"ఈ స్త్రీ యందరకును నమృతమును బంచుచున్నది. పొండు మనమును బోవుదము. దయచే మనకుఁ గూడ కొంచెమీయ వచ్చును. ఇట్లనుకొని వారును బరువిడిపోయి యసురులతోఁ గలిసి కూర్చుండిరి. అసురులందరును నుత్సాహముతోఁ దూర్పు ముఖ ముగఁ గుశాసనముల మీఁదఁ గూర్చుండి అమృతము కొరకుఁ బ్రతీ క్షించుచుండిరి, దేవతలును వారిలోఁగలిసిరి.

ఆ విశాల భవనము మణిమాణిక్య సువర్ణాదులచేఁ జేయఁ బడియుండెను. నలువైపులను దానియందు గల్ప వృక్షము యొక్క పుష్పముల దివ్యమాలలు వ్రేలాడుచుండెను. అగరు, ఘృత, చంద నాది చూర్ణముల యొక్కయుఁ గర్పూరము యొక్కయు, ధూపము లచే, నావిశాల భవనము సువాసిత మయ్యెను ఇంకను దేవి అడు గిడలేదే యని అందఱును నదేపనిగఁ గనిపెట్టుకొని చూచుచుండిరి, ఇంకను మోహిని భవనమును బ్రవేశింపలేదు. ఇంతలోనే సువర్ణ నూపుర ఝంకారముల నొనర్చుచు మోహినీదేవి వచ్చుచుండెనని గ్రహించిరి. ఏనుఁగు గున్నల తొండములవలె నున్న బలిసినతొడల మీఁదను, నితంబము మీఁదను దివ్యమగు నులిపిర పీతాంబరము

ధరించియుండెను. ఆ దివ్య దుకూలమునుండి ఆమె ప్రకాశ ముట్టి పడుచుండెను, యౌవన మదముచే మత్త నయనములతో, నామె చంచలతా పూర్వకముగ నలువైపులను జూచుచుండెను. కఠినోన్నతమగు వక్షః స్థలము మీఁది అరుణాంబర మెగిరెగిరి కాముకుల చంచల చిత్తములను నింకను విహ్వలము కావించుచుండెను, రాజా! శృంగార లీలాప్రవాహములో నీబోటి భక్తులు కొట్టుకొనిపోరు. ఈమె కుంభ స్తనియును గామినియుఁ గాదనియు, ఆమె సాక్షాత్తుగ శ్రీహరియే అసురుల మోహింపఁ జేయుటకై యిట్టి మనోహర రూపమును ధరించెనని వారెన్నటికిని మరవరు, భక్తులిట్టి మోహకరూపమును గాంచి ప్రణామ మొనర్చెదరు. కాముకులీ మాయలోఁ బడుదురు.

రాజా ! మోహినీ భగవానుని కర్ణములందు కుండలములు కదలుచుండెను. కర్ణములు సమానముగను, సుందరముగను లఘువుగను నుండెను. ముక్కెరతో నలంకరింపఁ బడిన నాసిక నయనాభిరామముగ నుండెను. కుండలముల కాంతిచే కపోలములు తళతళ మెరయుచుండెను. కంఠమందుండిన బాహుమూల్యములగు ముత్యములు ధగ ధగ మెరయుచుండెను. మనోహర ముఖారవిందము మీఁద మంచు బిందువువలె శ్వేతశ్రమ బిందువు మెరయుచు నామె శోభను సహస్రగుణత మొనర్చు చుండెను. ఆమె చూచుటకు లక్ష్మీదేవి యొక్క శ్రేష్ఠసఖియా యనునట్లుండెను, రాజా! ఆమె మధురమందహాసమున మోహనము కలదు. వైఖరిలో విచిత్రమగు నాకర్షణము కలదు. వాయువులోపలకు ప్రవేశింపగనే పైటనునెగుర

వేయుచుండెను. క్రీడాపూర్వకముగ నొక చేతితో నమృతకల శమును గ్రహించి పైటను సవరించుకొనుచుండెను, చేయి చుట్టఁ బెట్టుటవలనను, వాయువేగమునను సవరించుకొను స్థానమందది యింకను దొరఁగి పోయెను. ఆ సమయమున నామె వపపశతా పూర్వక భావ భంగిమము సలజ్జ మందస్మిత పూర్ణ వైఖరియు సమస్త సురాసురులను విమోహితులను గావించుచుండెను. ఎవ్వరికి వారి శరీరములు వారికి దెలియకుండెను.

ఈసమయమున నామె ముఖము మీఁద నధికార గురుత్వ కారణమున నధిక తేజముండెను. ఆమెతన మిక్కిలి సన్నని గొంతుకతో నధికారపూర్ణ స్వరమున దేవతలను గాంచి కసరుచు నిట్లనెను :- పచ్చ పచ్చని వస్త్రములను గట్టుకొని మీరెవరయ్యా వచ్చినారు.

అసురులు నమ్రతతో నిట్లనిరి :- "దేవీ! వీరును మా సోదరులే"కసరి మోహిని యిట్లనెను - "సోదరులైననేమి? వీరేల నిచ్చటఁ గూర్చుండినారు?"

అంత నసురులిట్లనిరి .- "దేవీ ! మేమును వీరును గలిసి సముద్రమును మథించితిమి ఇంతేకాదు, సముద్రమును మథించు టలో మేమిద్దరమును శ్రమించితిమి." మోహినీ భగవానుఁడిట్లనెను:- "అయితే వీరికిని నమృతమీయవలెనా ?"

అసురు లత్యంత స్నేహపూర్వమున నిట్లనిరి :- "ఇది నీయిష్టమున నాధారపడియున్నది. మేమంతయును నీమీఁదను వదలి వైచితిమి."

అంత దేవతలను గనరుచు మోహినీమోహనుఁడిట్లనెను :-
"మీరందరును వెనుకకుఁబొండు. అసురులకు దూరముగఁ గూర్చుండుఁడు." దేవతలు తలవంచుకొని ఒక ప్రక్కకుఁదొలిఁగి కొంచెము దూరముగ తొలిఁగిరి. వారినిఁ గసురుచు మోహినీ యిట్లనెను :-
"మీరిట్లువినెదరా ! దేవతలు మాటలతో వినెదరా ? సరిగా లేచి అచ్చటికి దూరముగఁ బోయి కూర్చుండుఁడు."

దేవతలకు నిరాశకలిగెను. ఇంత సుందరియగు కోమలాంగి ఒంటరిగా వీరినందరను శాసించుచున్నది. దేవాసురు లందరును నెలుకలవలె భయభీతులరై యీమె సంకేతమున నాడుచున్నారు. కాని చేయునదేమున్నది ? అమృతకలశమీమె చేతిలోనున్నది. పాపము వారు లేచిపోయి దూరముగఁ బోయి కూర్చుండిరి. దైత్యులు లోలోన నానందమును జెందుచుండిరి. చూడుఁడీమెకు పక్షపాతము లేదు. ఎంతటి చురుకో చూడుఁడు. ఎంతటినిర్భీకయై యాజ్ఞాపించుచున్నదో చూడుఁడు. వారును దేవతలను గసరుచు నిట్లనిరి :-
"ఓరీ ! మీరు చెప్పిన పనిరేమి ? దేవి యెట్లాజ్ఞాపించిన దాని నవిలంబముగ ననునచయనకయే పాలింపవలయును."

దేవతలేమి చేయఁగలరు ? దూరముగఁబోయి కూరుచుండిరి. శ్రీశుకదేవుఁడిట్లనెను :- "రాజా ! భగవంతుని విశ్వసింపక యెవరాశను జెందెదరో వారిదేవిధముగ నవమానమును జెందవలసియుందురు."

దేవత లిప్పుడు దూరముగఁబోయికూర్చుండిరి, తనకు దగ్గరగఁ బెద్దపంక్తిలో మోహినీదేవి అసురులను గూర్చుండఁ బెట్టెను. చాలదూరముగ దేవతలను గూర్చుండఁబెట్టెను. ఇట్లు రెండుగా విభజింపఁబడఁగా, దేవతలును దైత్యులును వేరువేరు పంక్తులలోఁ గూర్చుండఁగా, నప్పుడు తామర రేకులవలె గోమలములును, నెట్టనివియు, బలుచనివియునగు తన వ్రేళ్ళను గదలించుచుఁ దన హావభావకటాక్షములచే నసురులను సంతోషపెట్టుచుఁ గోకిలకూజిత కంఠముచే మోహినీదేవి నవ్వుచు నిట్లనెను :- "ఓయీ! కాశ్యపేయులారా! మీరు నామాట నొక్కటి వినుఁడు. ఆకలిచెందిన వాని దృష్టి చాల చెడ్డది. ఎవరైన నేదైనఁ దినుచుండిన దానిమీఁద నాఁకలిచెంది, ఆశతోనున్నవారి దృష్టిపడెనా ఆవస్తువు జీర్ణముకాదు. ఈదేవతలు మిక్కిలి తిండిపోతులు. వీరమృతమువైపెట్టు గుటకలు వేయుచుఁ జూచుచున్నారో చూడుఁడు. నాయభిప్రాయమేమనఁగా బైపైన తేటను జిన్నఉద్దరిణెతో నమృతమును వీరికొసంగి, తరువాత నడుగుననున్న చిక్కని యమృతమును మీకు మిగిల్చెదను. దీనివలన దృష్టిదోషమునుండదు. అన్యాయముగను నుండదు. వీరును బరిశ్రమ మొనర్చిరి కదా!"

మోహినీదేవి తన ప్రణయపూర్ణస్వరూపముచే నసురుల హృదయమును హరించియుండెను. వారినిఁ దన కుటిల కటాక్షముచే మంత్రముగ్ధుల నొనర్చెను. అందువలన సంతోషముతో నిట్లనిరి :- "దేవీ! నీకెట్లిష్టముండిన నట్లుచేయుము. మాకుఁ జెప్పవలసిన పనిలేదు."

అసురుల యీమాటను విని, కలశభారముచేవంగుచు నందర మీఁదను గుటిలదృష్టిని విసరుచు నాకపట నారి మందగమనమున దేవతలవైపునకుఁ బోయెను. దేవతలకుఁ బ్రాణములలోనికిఁ బ్రాణములు వచ్చెను. వారిట్లనుకొనిరి :- "కసరులు, గద్దింపులు వచ్చిన వచ్చునుగాక, యిప్పుడమృతమును లభింపగలదు."

ఇట్లాలోచించుకొని వారు బాచిపట్లతోఁ గూరుచుండిరి. మోహినీదేవి రాఁగానే దేవతలు కడుపునిండ నమృతమును ద్రావ నారంభించిరి.

శ్రీ శుకుఁ డిట్లనెను :- "రాజా! దైత్యుల నుపేక్షించి భగవానుఁడు తన కాశ్రితులగు దేవతలనే సంతోషపెట్టుచుండెను. వారే అమృతమును రుచి చూచుచుండిరి."

......

## సురలకు సుధనిచ్చి మోహిని మోహనుఁడగుట

శ్లో॥ ప్రీతప్రాయేఽమృతే దేవైర్భగవాన్ ల్లోకభావనః ।
పశ్యతామసురేంద్రాణాం స్వం రూపం జగృహే హరిః॥
శ్రీభాగ. ౮స్కం. ౯అ. ౨౬ శ్లో॥

క. ఒక బొట్టుఁ జిక్కకుండఁగ
సకల సుధారసము నమరసంఘంబుల కుం
బ్రకటించి పోసి హరి దన
సుకరాకృతిఁ దాల్చె నసురశూరులు బెగడన్.

శ్రీమదాంధ్ర భాగవతము

భాగ్యము లేక విద్యా పౌరుషము లేవియును ఫలవంతములు కావని శాస్త్రముల యొక్క సుదృఢ సిద్ధాంతము. భాగ్యములో నున్నచో రాతినిఁ బగులఁగొట్టిననైన ధనము వచ్చును. భాగ్యమున లేకున్నచో నింటిలోనుండిన సువర్ణమును మట్టియగును. నలమహారాజు విపత్సమయమున నొకానొక రాజు కడకుఁబోయెను. రాజాతనికి స్వాగతము నొసంగి, ఆతఁడు నివసించుట కొక సుందర రాజభవనము నొసంగెను. రాత్రియందా భవనమున నొకవంకెకు తొమ్మిది లక్షలు ఖరీదుచేయు నొక నవరత్నహారము తగిలింపఁబడియుండెను. ఆహారమును నావంకె మ్రింగుచుండెను. ఇప్పుడే పరిచితుని యింటను నుండఁగూడదని రాజు తెలిసికొనెను. భాగ్యము తనకు విపరీతముగనుండెను. తెల్లవారఁగనే నిర్ధనుఁడగుటచే నలుఁడే యీహారమును దొంగిలించినాఁడని లోకులనఁగలరు. వంకెహారమును మ్రింగినట్లుగిన [illegible] నమ్మఁగలరు ? అనియిట్లాలోచించుకొని ఆ సమయముననే అచ్చటి నుండి వెడలిపోయెను. ఇట్టిదే యింకొక కథయును గలదు. ఇద్దరు భిక్షుకులుండిరి. ఒకఁడు నారాయణుఁ డీయకున్న నరపతి యేమియిచ్చు, ననుచుండును. రెండవవాఁడు భూపతియే యీయకున్న జగత్పతి యేమియిచ్చును" రాజిద్దరి

మాటలను వినుచుండెను. రాజా స్తికుఁడు. ఆతఁడొక దినమున నిద్ర రను బిలిపించి, పెద్దపెద్ద రెండు పొడుగుగల సొరకాయలను దెప్పించి, వానిలో మిక్కిలి నేర్పుగ నూఱు నూఱు మొహరీల నుంచెను. వారిద్దరికిని నొక్కొక్క సొరకాయను మొహరీలున్నవని చెప్పకయే యిచ్చెను. రాజును ప్రశంసించుచు నందొకడు బియ్య మును వగైరాలను గొనుటకై పోయెను వాఁడు దానినొక యణా డబ్బులకు కూరగాయల వానికమ్మెను. భగవంతుని యాధారమున నున్నవాఁడు దాని నింటికిఁ గొనిపోయెను. ఇంటిలో నాతని భార్య యిట్లనెను :- "ఇదిగోనండీ! మనయింట సెనగపప్పున్నది. ఇంకొ కటి ఇట్టి సొరకాయయే మీరు తెచ్చినయెడలఁ జాల దినములకు సొరకాయ దొరికినది కావునఁ గడుపు నిండునట్లు సొరకాయపప్పు వండిపెట్టెదను.'' భిక్షుకుఁడు బజారునకుఁ బోయెను. దైవికముగ నీభిక్షకుఁడా కూరగాయల వానికడకే పోయెను. అచ్చట నా సొర కాయను నాఱు కానులకుఁ గొనెను. రెంటినిఁ బగులఁగొట్టగాఁ వానిలో నుండి నూఱునూఱు మొహరీలు బయటపడెను. మఱునాఁడు రాజు పిలిచి యడుగఁగా నిద్దరును సత్య సమాచారమును జెప్పిరి. అప్పుడు రాజిట్లనెను :- "హరి యీయకున్న భూపతియే మీయఁ గలఁడనుట సత్యము."

శ్రీశుక దేవుఁడిట్లనెను :- "రాజా! భగవానుఁ డసురులను మోసగించుటకే యీ మాయా మోహినీరూపమును ధరించినాఁడు. అసురులాతని రూపజాలమందు బడిపోయినారు. తమ పాదములను

దామే గొడ్డలితో నరకుకొనిరి, ఆ మోహినీమాయ మాయచేసి దేవతల కమృతమును బోయుచుండెను. అసురులలోను గొప్ప బుద్ధిమంతులు కలరు వారా కపటస్త్రీ భావములు గ్రహించిరి. ఇందేదో మోసము కలదని ఆ పంచుటలోనే గ్రహించిరి. వారు తమలోఁదాము గుసగుసలాడుకొనఁ జొచ్చిరి ఆమె రూపముమీద నాసక్తిని జెందిన వారు వారినిఁగసరుచు నిట్లనిరి :- "చూడుఁడు. ఆ పద్ధతి బాగుండలేదు. మీరామెను సర్వాధికారినిఁగా జేసినారు. అట్టియెడ నామె యిష్టమువచ్చినట్లుచేయఁగలదు. మీరు దానినాక్షేపించుట కెవరు? ఇది ప్రేమ తిరస్కారము కాఁగలదు. స్నేహమందు సందేహమునకు స్థానములేదు. మెదలకుండుఁడు. ఏమిచేయునో దానినిఁ జేయనిండు" ఇదివిని వారును మెదలకుండిరి. స్త్రీతోఁబోరాడుటేమిటని యనుకొనిరి. ఆమె కిష్టమువచ్చినట్లు చేయనిండు మనమేదైన మాటలాడిన నామెకు కోపము రావచ్చును" అనుకొని అందరును మెదలకఁ గూర్చుండిరి. కొందరు దేవతలును మన సోదరులేకదా త్రాగనిందమృతమును, వీరికేది మంచిదైన దానినే పొందనిండు.

శ్రీశుకదేవుఁడిట్లనెను :- "రాజా! దేవ, దైత్య, దానవాదులందరును సోదరులే. కశ్యపునకు అదితి, దితి, దనువు, కాష్ఠ, అరిష్ట, సురసా, ఇలా, ముని, క్రోధవశ, తామ్రమ, సురభి, సరమ, తిమి యను పదమువ్వురు భార్యలు కలరు. వారిలో నదితికి నాదిత్యులు అనఁగా దేవత లుదయించిరి. దితికి హిరణ్యకశిపాది దైత్యు లుదయించిరి. దనువు గర్భమున శంబర, ప్రరిష్ట, విప్రచిత్తి మొదలగు దానవులుదయించిరి. దనువు కుమారుఁడగు విప్రచిత్తి

కొక కొడుకుండెను. అతనిపేరు రాహువు. ఆదానవుఁడతి తెలివి కలవాడు. అఁతడమృతము కొరకువివ్విళ్ళూరుచున్నాడు. ఆతఁడు దూరముగఁ గూర్చుండి మోహినీదేవి యొక్క గతివిధులను గమనించుచుండెను. మోహినీ యేవిధముగ దేవతల కమృత మొసంగుచున్నదో చూచి, అమృతమిఁక దైత్యులకు లభింపదని తెలిసికొనెను. అందువలన మాయావియగు నాదైత్యుఁడు దేవతలవలె వేషమును ధరించి దేవతలపంక్తిలోఁ జంద్రసూర్యులకు మధ్యకుఁబోయి కూర్చుండెను. మోహినీదేవి యిప్పుడు త్వరపడుచుండెను. అందరకును బోసెను. ఇంకను నిద్దరుముగ్గురుకంటె నెక్కువలేరు. కపట వ్యవహారమున నడుగడుగునకును శంకయే. ఆమె అందరకును బోసి పారిపోవుటకుఁజూచుచుండెను. ఆతొందరలో సూర్యునకొసంగి, తర్వాత దేవతావేషమునఁ గూర్చుండిన రాహువునకుఁ గూడ యిచ్చెను. తరువాతఁ జంద్రునకును నొసంగెను. చంద్రుడు త్రాగుచుఁద్రాగుచు నిట్లనెను :- "దేవీ! ఈతడు మాజాతివాఁడు కాఁడు. ఈతడు దానవుఁడు."

ఇదివినఁగానే మోహినీభగవానుఁడు తన చక్రముచే వాని శిరస్సును ఖండించెను. ఇప్పుడు నరకిన నేమిప్రయోజనము? అమృతము కంఠము క్రిందకుదిగెను. అందువలన శిరమును నమరమయ్యెను. తోఁక (కేతువు)ను నమరమయ్యెను. ఆతనికి లాభమే కలిగెను. ఒకఁడు రెండుగ నయ్యెను. భగవానుఁడిపుడేమి చేయ గలడు. రాహు కేతువులను గ్రహములుగ నొనర్చెను. మొదట రవి, సోమ, భౌమ, బుధ, గురు, శుక్ర, శని అను నీయేడే గ్రహ

ములు. ఇప్పుడు రాహుకేతువులును గలసి తొమ్మిదిమందిగనైరి, వీరు దానవులును, క్రూరగ్రహములైనను వీరు దేవతలుగా నెన్న బడుచుండిరి. ఎచ్చట సమస్త వైదిక కర్మలందు గ్రహారాధనము జరుగుచుండునో అచ్చట నీరాహుకేతువులకును బూజ జరుగు చుండును. రాహువు దానవుఁడే. సూర్య చంద్రులాతని రహస్య మును జెప్పుటచే నేఁటివరకును సూర్యచంద్రులకు వైరిగ నయ్యెను ఈతని కవకాశము చిక్కినప్పుడు పూర్ణిమలందును నమావాస్య లందును వీరిద్దరును నోఁచుకొని మ్రింగజూచుచుండును. కాని యాతఁడు మ్రింగుట వ్యర్థమగుచున్నది. ఎవరికైన గంతమున నొక రంధ్రమున్నచో దేనినైనఁ దినినను, త్రాగినను నారంధ్రముద్వారా వచ్చుచుండును. అట్లే యాతనికి మొండెము లేకపోవుటచే సూర్య చంద్రులను మ్రింగినపుడు వారు బయటకు వచ్చుచుందురు. కడుపు యుండినచో దానిలోనికిఁ బోయియుండును. అందువలన గ్రహణ మల్పకాలము మాత్రమే యుండును. ఇది గ్రహణముయొక్క అధి దైవిక రూపము. ఆధ్యాత్మికభావ మేమనఁగా నజ్ఞానమల్పకాలము మాత్రము ప్రకాశమానమగు జ్ఞానమును గప్పివేయును కాని అల్ప కాలముననే జ్ఞానమును ప్రకాశించును. ఆధిభౌతికార్థము నందరెరు గుదురు. భూమియొక్క ఛాయ పడుటచే సూర్యచంద్రులు కనఁ బడరు. మసకపడి పోవుదురు. వీరెచ్చటికిని బోరు. వీరిని మ్రింగు వారును లేరు.

రాజా! ఈవిధముగ నమృతమును బంచి, రాహువును జక్రముతో రెండు గ్రహములుగ నొనర్చి, దైత్యులను జూడక

వారిని మోసగించి, అమృతకలశము నచ్చటనే యుంచి మోహినీదేవి మోహనుఁ డయ్యెను. కంటె, కాసులు, ముక్కుపుడక, ముక్కెర, బులాకి, కమ్మలు, బేసరి, వడ్డాణము మొదలగు వాని నన్నిటిని వదలివైచి స్త్రీగ నుండిన నాతఁడిప్పుడు పురుషుడయ్యెను. దేవి దేవుఁడయ్యెను. ఓహో! ఈమాయ నిదియని దైత్యులిప్పుడు గ్రహించిరి. వారు వారి యదృష్టమును నిందించుకొనుచుఁ బశ్చాత్తాపమును జెందిరికాని పొలమును బిట్టలు తినినఁ దరువాత చింతించి యేమిలాభము ?

.....

## శ్రీహరియొక్క కపట వ్యవహారమునకు కారణము

శ్లో॥ ఏవం సురాసురగణాః సమదేశకాల
హేత్వర్థ కర్మ మతయోఽపి ఫలే వికల్పాః।
తత్రామృతం సురగణాః ఫలమంజసాపు
ర్యత్పాద పంకజ రజః శ్రయణాన్న దైత్యాః ॥
శ్రీభాగ. ౮ స్కం. ౯ అ. ౨౮ శ్లో॥

మ॥ అమరుల్ రక్కసులుం బ్రయాస బల సత్త్వార్థాభి మానంబులన్
సములై సద్ధవికల్పులైరి యమరుల్ సం శ్రేయముం బొందిర
య్యమరారుల్ బహుదుఃఖముల్ గనిరి తామత్యంత
దోర్గర్వులై
కమలాక్షున్ శరణంబు వేడని జనుల్ గల్యాణ సంయుక్తులే॥
శ్రీమదాంధ్ర భాగవతము

ఏభావముతోఁ గర్మ చేయఁబడునో దానిఫలమును నట్లే యుండును. ఆర్యశాస్త్రములలోఁ గర్మకుఁ బ్రాధాన్యత యీయఁ బడలేదు భగవంతుఁడు భావమయుఁడు. భగవంతుని మరచి కర్మ యందాసక్తినిఁ జెందినచో నాతఁడు జడత్వమును బొందును. ఏల యనఁగాఁ గర్మ జడమైనది. జడనాదమును బోషించువాఁడు జడ త్వమునే పొందును. కాని కృష్ణార్పణబుద్ధితోఁ గర్మలొనర్చుచు భగవద్భావభావితుఁడగువాఁడు, కర్తవ్యబుద్ధిచే నాతనియాజ్ఞలని భావించుచు, భగవత్సేవాభావముతోఁ గర్మలొనర్చువాఁడు భగవ త్ప్రాప్తినిఁ బొందును. వారు జడత్వమునుండి పైకి లేచెదరు. ఏల యనఁగా శ్రీహరి చైతన్య స్వరూపుఁడు.

శ్రీ శుకదేవుఁడిట్లనెను :-"రాజా ! అన్ని విధముల నసురు లను వంచనచేసి భగవానుఁడు దేవతల కమృతము నొసంగెను. సముద్రమంథన కార్యమున దేవాసురులిద్దరును సమానముగఁ బరి శ్రమ మొనర్చినను, ఇద్దరును క్షీరసాగర తటమున నొకేస్థాన ముపఁ బ్రయత్న మొనర్చినను ఒకే సమయమున నొకే హేతువుచే

సముద్రమును మథించినను, ఇద్దరి కర్మ ఒకేరీతి నున్నను, బురుషార్థమునను భేదమేమియును లేకున్నను, నెవరును దమ తమ కర్మలందు సాపఘానులు కాకున్నను నిద్దరును మథించినను, యథామతి శ్రద్ధతో హృదయ పూర్వకముగఁ బరిశ్రమ మొనర్చినను, బరిశ్రమ ఫలమును లభించె అమృతము వెలువడెను. కాని భోగమందు భేదము కలిగెను. దేవతలమృతమును ద్రావిరి. దైత్యులట్లే నిలుచుండి చూచుచుండిరి."

ఇదివిని శౌనకుఁడిట్లనెను :- "సూతా ! ఇది యన్యాయము కాదా ? దీనివలన భగవంతునకుఁ బక్షపాతమున్నట్లు కాదా ! భగవంతునియొక్క యీ విశ్వాసఘాతమెంతవర కుచితము ? అమాయకులు విశ్వాసమొనర్చి అమృత కలశము నప్పగించినారు. భగవంతుఁడు వారిని మోసగించి దేవతల వైపునకుఁబోయెను. వారి నాశలో ముంచివైచెను. చివరవరకును నిప్పుడేయిచ్చెద నిప్పుడే యిచ్చెదనని వారికాశపెట్టుచునే యుండెను. చివరకేమియును నీయక పారిపోయెను. ఇకఁ భగవంతుని సమదర్శిత్వమెక్కడ ? జగత్తునకు సమానభావమునఁ బాలన కర్తయని యాతనినెట్లు చెప్పవీలగును"

ఇదివిని సూతుఁడు నవ్వి యిట్లనెను :-"స్వామీ ! మీరన్నది సత్యమే. కాని సాధారణుఁడెవఁడైనఁ జేసినచో నీ యభియోగమంతయును నుచితమే. ఇవన్నియును భగవంతునకుఁ జెల్లవు."

శౌనకుఁడిట్లనెను :-“సూతా ! నీవుకూడ పక్షపాత మొనర్చు చున్నావు పెద్దవారు కానిండు చిన్నవారు కానిండు అధర్మమంద రకు నధర్మమే. ధర్మమందరకును ధర్మమే, భగవంతునకు దేవత లును నసురులును నొక్కటే ఆయన భేదభావమును బక్షపాత మును దగదు.”

సూతుఁడిట్లనెను:-“స్వామీ ! భగవంతుఁడు ద్వేషవశమునఁ బక్షపాత మొనర్పఁడు. ఆతఁడు సర్వజ్ఞుఁడు, ఏ పనినిఁ జేసిన నెవరికెట్టి మేలుకలుగుననునది ఆతనికే తెలియును. చూడుఁడు, ఒక తల్లికి పదుగురు పుత్రులుండిరి, ఆమెకు పదుగురు సమానమే. పదుగురను సమానముగఁ బ్రేమించును. కాని భోజన మిడు నప్పుడు పక్షపాత మొనర్చును. జబ్బుతో నున్నవానికి చారుమెతు కులను, గందికట్టునే యొసంగును. పసివానికి పాలనొసంగును, లావుగాఁ బెరిగినవానికి మేదస్సు తగ్గుటకై రొట్టె, మజ్జిగ, తేనె షర్బతు నొసంగును. కేవలము దుర్బలముగను, బక్కగనున్నచో వానికి పాలు, నేయి నధికముగ నొసంగును, వృద్ధులకుఁ గోమల వస్తువుల నొసంగును. ఆమె అందర భోజనములలో భేదభావ మొనర్చినను నామెకందర, మీఁదను ప్రేమ సమానమే. ఏ వస్తువు వలన నెవరికే మేలుకలుగునో ఆమెకు తెలియును. ఆమె యుద్దే శ్యము అందరకును మేలు చేయుటే. ఇంకొక దృష్టాంతము వినుఁడు. తోటమాలి తనతోటలోని చెట్లనన్నిటినిఁ బ్రేమించును. అన్నిటిని రక్షించును. కాని యే చెట్టునకేమియొనర్చిన దానికి మేలు కలుగునో ఆతనికే తెలియును, ఆతఁడొక దానిని నరకును,

ఇంకొకదానికంటు కట్టును. మఱియొక దానినిఁ దీసి వేఱొక చోటనాటును. కొన్నిటి కెక్కువ నీటినిఁబోయును. కొన్నిటికిఁదక్కువ పోయును. కొన్నిటికి నీటినేపోయఁడు. నరకుటలో నాతనికి దుష్టభావము లేదు; కానియట్లు చేయుటచేతనే యావాటికా వృక్షములకు వృద్ధిగ భావించును. చూచుట కాతఁడు నిర్దయుఁడుగ గోచరించును; కాని వాని హృదయములోఁ గళ్యాణ భావనయే యిమిడి యున్నది. భగవంతుని పని విశ్వమును రక్షించుట. సర్పమునకు పాలను బోసిన కొలఁది విష మభివృద్ధినిఁ జెందినట్లే దైత్యుల కమృతమును బోసినచో వీరు నిరంతరమును లోకమును బీడించెదరని యాతఁడు తలఁచెను. అసురుల కమృత మొసంగుట ప్రపంచమున కనిష్ట మొనర్చుటయే. అందువలన జగత్పతి విశ్వకల్యాణార్థము అసురుల కమృతము నొసంగు టనుచితమని తలఁచెను. ఇఁక సమాన పురుషార్థము విషయమున్నది. భగవంతుని మీఁద భారము వైచి చేసిన పురుషార్థమే సఫలమగును. కాని గర్వాహంకారములను జెంది తానే కర్త, ధర్త, హర్త విధాతగా భావించి చేసిన పురుషార్థమున సఫలము వచ్చును గాని దాని నుపయోగించుకొనఁజాలరు. ఫలమును భోగించు వాఁడింకొకఁ డగును. ఒక్కసారియే యిద్దరన్నదమ్ములు వ్యాపారమును జేయుదురు, ఇద్దరకును సమాన లాభము కలిగినది. ఒకఁడా ధనముతో దానపుణ్యములొనర్చును, సుఖోపభోగ సామగ్రులను బ్రోవుచేయును ఆనందముగ నుండును. పిల్లల జల్లలను, బరివారమును బోషించుకొనును. రెండవ వాఁడు తాను దినుచును గొన్నియింటిలోని వారికీయఁడు.

కూడఁ బెట్టును. చివరకు దానినెవరో అనుభవించెదరు. స్వామీ! పురుషార్థ ఫలము కలుగును గాని ఫలోప భోగమును బ్రభువాజ్ఞ కలవారే చేయుచురు. ఆతఁడెవరి మీఁదఁ బ్రసన్నుఁడై అమృత రూపమగు ఫలము ననుభవించుట కొసంగునో వారుధన్యులు. దేవ తలకాశ్రయము భగవంతుఁ డొక్కఁడే. భగదాజ్ఞగా భావించి కర్తవ్య బుద్ధిచే వారు పురుషార్థము నొనర్చిరి. దుఃఖము వచ్చినపుడు భగ వంతునే స్మరించిరి. దానిలో నుండి వచ్చిన వాటినన్నిటిని భగవం తునికే అర్పించిరి. భగవానుఁడు ప్రసాదరూపమున నొసంగిన దానిని స్వీకరించిరి. లోభమును జెందలేదు. ప్రతి వస్తువుమీఁదకు మనస్సును బోనీయలేదు. అమృతము నసురులు కొనిపోఁగానే భగవంతుని శరణుజొచ్చిరి. వారికి విపరీతముగా నసురులు లోభ ముచే సముద్రమును మథింప వచ్చిరి. ప్రతి విషయములోను భగవంతునకు విరోధించిరి. వారు తమ బలపౌరుషములే ముఖ్యము లని తలఁచిరి. అమృతము లభింపఁగా లోభముచే దేవతలను దిరస్కరించి ధన్వంతరి భగవానుని చేతినుండి అమృతమును లాగుకొని పారిపోయిరి. ధన్వంతరి పురుషుఁడు, ఏమియును విరో ధింపక యిచ్చివైచెను. అప్పుడు దేవతలు భగవంతుని శరణు వేఁడఁగా భగవానుఁ డిట్లనెను :-"నాయనలారా! ఇప్పుడు పురుష రూపమునఁ బని జరుగదు. ఇప్పుడు మోహినినై నమృతమును లాగుకొనవలయును.అందువలన నొక విచిత్ర యద్భుతావతారమును ధరించి అసురులను మోసగించెదను."

ఇదివిని శౌనకుఁ డిట్లనెను :-"సూతా! భగవానుఁడు స్త్రీ యవతారము నేల ధరించెను."

నవ్వి సూతుఁడిట్లనెను :-"ఎందులకా స్వామీ ! స్త్రీయవతారము చెడ్డదా ? దుర్గ, కాళీ, పార్వతి, లక్ష్మి, సరస్వతి మొదలగు జగన్మాతలు స్త్రీలు కారా ? వీరందఱును శక్తులే, శక్తిలేక శక్తిమంతుఁడేమి చేయఁగలఁడు ? శివా లేక శివుఁడు శవ ప్రాయుఁడే."

శీఘ్రముగా శౌనకుఁ డిట్లనెను :-కాదు. సూతా ! స్త్రీయవతారము చెడ్డదని నాయభిప్రాయము కాదు. కాని స్వామీ ! మూఁడవతారములను ధరించనే ధరించినాఁడు. దొంగ తేలువలె స్త్రీ వేషమును ధరించి కపట వ్యవహారమొనర్చుట భగవంతునకు శోభయొసంగదు."

సూతుఁడిది విని మిక్కిలిగనవ్వి, నవ్వుచు నిట్లనెను :- "స్వామీ ! ఇప్పుడు మీరు భగవానుఁడీ లీల నేల చేసినాఁడో భగవాను నడుగుఁడు. ఇఁక శోభ విషయముననా స్వామీ ! గొప్పవారేది చేసినను దానిలో శోభ కలదు. చెప్పుఁడు, సూకరమగుట మంచిదా ! భగవానుఁడు సూకరావతారము నెత్తలేదా ? నీటిలో నుండువాఁడని ఆతని నెగతాళి చేయునట్లు మత్స్యావతారము నెత్త వచ్చునా ? అది భగవానునకు శోభయేనా ? సగము మనుష్యుఁడును సగము సింహముగనునై ఒకానొకని ఆంత్రములను దీసి మెడలో మాలగ ధరించుట భగవంతున కుచితమేనా ? స్వామీ ! భగవల్లీల విషయములో నుచితాను చితములులేవు. ఉచితానుచితములున్నచో క్రీడయెట్లు కాఁగలదు ? లీల లందెప్పుడే వేషమావశ్యక మైన నట్టి రూపమును ధరింప వలసియుండును. పిల్లవాడాఁడుచు నాడుచు

నేల నవ్వును ? ఏల యేడ్చును ? ఏల రూపాయలను బార వేయును ? ఏలఁబూలను గ్రహించును. ఏల చంకనుండి దిగి బుర దలోఁ బొరలాడుచుండును ? ఏల సర్పమును బట్టుకొనుటకుఁ బరు విడుచుండును. అదంతయును ఖేలనము భగవంతున కబ్లిష్టమైనది, స్త్రీయైనాడు.

ఇంకొక కారణము కూడ యుండవచ్చును. లక్ష్మీదేవిమాటి మాటికి నలుగుటయు భగవానుఁడు బ్రతిమలాడుటయును జరుగు చుండును. ఒక దినమున నాతని మనస్సులోనికి స్త్రీయైనచో దన మీఁద లక్ష్మి కెంతటి ప్రేమయో అసలు ప్రేమ యున్నదో లేదో చూతమని యనుకొనియుండవచ్చును. అందువలన నాతఁడు శ్రీ సఖీవేషమును ధరించి తన యాకర్షణమును బరీక్షించి యుండ వచ్చును.

మూఁడవ కారణమిది కావచ్చును. పురుషులు మిక్కిలి కఠో రులుగ నుందురు. వారితోఁ బరిచయము కలుగుట కాలస్యమగును. స్త్రీకి స్వభావము మృదువుగ నుండును. చూపులు కలిసెనా వారితో మధురముగ మాటలాడుటయును, ఘనిష్ట సంబంధ మేర్పఱచు కొనుటయును స్త్రీ స్వభావము. ఆసమయమున భగవంతునకు కావలసినది అమృతమును లాగుకొనుటయే.

అన్నిటి కంటె ముఖ్యమైన కారణమిదిగాఁ దోఁచుచున్నది. ఈ సమయమున యుద్ధమొనర్చిన వీరు జయింపజాలరని భగవంతు నకుఁదెలియును. వీరికి ధనమునకు లోపములేదు. వీరితో వీరికి

విరోధమును గలిగింపఁగూడదు. క్షణములో వీరమృతమును ద్రాగి వేయఁగలరు. వీరు కాముకులు. కాముకులను వశపరచుకొనుట కేకైక ఉపాయ మత్యధిక సుందరియగుఁ కామిని యగుట. స్వామీ! సౌందర్య రూపమగు దీప జ్యోతియందు గొప్పగొప్ప వీరులు పతంగమువలె భస్మమై పోయిరి. అస్త్ర శస్త్రములతోడను, బలము తోడను బరాక్రమముతోడను జయించరాని వారొక స్త్రీ కటాక్షముచే జయింపబఁడిరి. స్వామీ! ఈ స్త్రీ రూపము భగవంతుని మోహినీ మాయ, ఇదియే విశ్వము నాడించుచున్నది. మాయ, అవిద్య ఇవియే సంస్కృతికిఁ గారణములు. రావణుఁడు జగజ్జననియగు సీతపైఁ గుదృష్టినిఁ బరుపకుండినచో రావణుని వంటి పరాక్రమ వంతుని జయించుట కెవరికిసాహసము కలదు ? చూడుఁడు. సుందోప సుందులను వారుసోదరులు. ఎంతోబలవంతులు. ఎంతోయోధులు. త్రైలోక్యవిజయులు. ఇద్దరకును బరస్పర ప్రేమయును గలదు. కాని ఒక స్త్రీ కొరకు వారికి వినాశనము కలిగెను, కావున స్వామీ? మోహినీ భగవాఁనుడా యసురులను మోహింపఁజేయవలసి యుండెను. అందువలన శృంగార రసము యొక్క రుచినిఁ జూపించి సరసతా ధారను బ్రవహింపజేసి వారి బుద్ధిని భ్రష్టము కావించెను."

ఇది విని శౌనకుడిట్లనెను :- "సూతా ఈసుందోపసుందు లెవరు ? ఏస్త్రీమూలమున వారు సర్వనాశనమైరి. మీకుచితమని తోచినచో నీకథను మాకువినిపింపుడు."

అంతసూతుడిట్లనెను :- "మంచిది స్వామీ ! నేను మీకీ శిక్షాప్రదమగు నితిహాసమును వినిపించెదను. మీరందఱును దత్త చిత్తులరై శ్రవణ మొనర్పుడు."

.....

## విషయాసక్తిలోనే మృత్యువు కలదు

శ్లో॥ యద్యుజ్యతేఽసువసు కర్మ మనోవచోభిః
దేహాత్మజాదిషు నృభిస్తద సత్పృథక్త్వాత్ ।
తైరేవ సద్భవతి యత్క్రియతేఽ పృథక్త్వాత్
సర్వస్య తద్భవతి మూల నిషేచనం యత్ ॥

శ్రీభాగ. ౮ స్కం. ౯ అ. ౨౯ శ్లో॥

వ. మానవుఁడు తనప్రాణ, ధన, కర్మ మనోవాగాదులచే దేహపుత్రాదుల కొఱకేయే కర్మ నొనర్చుచున్నాఁడో వానికి పృథగ్బుద్ధియుండుటచే వ్యర్థమగుచున్నది; కాని అభేదభావయుక్తులై ప్రాణాది యోగములచేఁ గర్మలొనర్చినయెడల నవి సఫలము లగును. ఏలయనఁగా శ్రీహరి నుద్దేశించి చేసిన కర్మ వృక్షమునకు వేళ్లకు నీరుపోసిన శాఖాదులన్నిటి కెట్లు చేరుచున్నవో అట్లే అందరను దృప్తి పరచును.

తన తపముచేతను, బలముచేతను, బరాక్రమముచేతను, విద్యచేతను, నితరసాధనములచేతను నెవరినైన జయించిన జయింప

వచ్చును గాని కామినిని జయించనివాఁ డంతమందు కామినీవిషాక్త కటాక్ష బాణములచేఁగొట్టబడిమృత్యుముఖమునఁబడును. కాముని జయింపఁగలడు. అట్టివాడు కామజనకుని పాదపద్మముల నాశ్రయించి, తన జీవననౌక నాతని యధీనము గావించును. తపస్సును జేసి యెంతటి శక్తిని సంపాదించినను, నెట్టి దుర్లభ వరములను బ్రాప్తించినప్పటికినిఁ జివరకు కామమునకు గురికావలసి వచ్చును. కావునఁ బ్రపంచములోని సమస్త పదార్థములలోను నాప్రభువు వ్యాపించియున్నాఁడనిభావించి, త్యాగభావముతో ధర్మపూర్వకముగ విషయసేవన మొనర్పవలయును. అధర్మపూర్వకముగఁ బరుల వస్తువులమీఁద మనస్సును బోనీయరాదు. పొరపాటుననైనను గామ వశుఁడు కారాదు. కామాధీనుఁడైనవాఁడు తరువాతఁ బశ్చాత్తాపము చెందవలసి వచ్చును.

సూతుఁడు శౌనకాదిఋషులతో నిట్లనెను :- "ఋషులారా! మీరడిగిన సుందోపసుందుల కథను మీకు వినిపించెదను."

కశ్యపునకు దితియను బత్నియందు హిరణ్యకశిపు, హిరణ్యాక్షులను నిద్దరుదైత్యు లుదయించిరి. హిరణ్యాక్షునకు గొప్ప ప్రతాపశాలియగు నికుంభుఁడుదయించెను. ఈ సుందోపసందులా నికుంభుని ప్రియపుత్రులు. ఇద్దరు నొక్కసారియే స్నానమాడుచుందురు. ఇద్దరు నొకే పళ్ళెరములోఁ దినుచుందురు. ఇద్దరును నొకే సింహాసనమునఁ గూర్చుందురు. ఒక్క పక్కమీఁదనే పండుకొని ఒక్కసారియే నిద్రించెదరు. ఇద్దరు నొకేరీతిని రాజ్య సుఖోపభోగముల ననుభవించుచుందురు. సారాంశమేమనఁగా నీయిద్దరును

ప్రాణపానములవలె సమానముగ నుండిరి. వీరిద్దరికిని నేవిషయము నను నభిప్రాయభేదము లేనంతటి ఘనిష్ఠ ప్రేమయుండెడిది. వారే పని చేసినను గలిసియే చేయుచుందురు.

ఇద్దరును నరణ్యమునకుఁబోయి ఘోరతపస్సు నొనర్చిరి. నిరాహారముగ, శ్వాసను బిగించి వారుగ్ర తపమును గావించిరి. దేవతలు వారి తపమున కనేక విఘ్నములను గావించిరి; కాని యా సోదరులిద్దరును నావిఘ్నములకుఁ జలింపలేదు. ఇంతేకాదు. వాని కారణమున వారింక నెక్కుడుగఁ దప మొనర్చిరి. వారి తపము నకు సంతోషించి లోకపితామహుఁడగు బ్రహ్మ వారి సమీపము నకుఁబోయి వరమును గోరుకొనుమనెను. తమ సమ్ముఖమున లోక పితామహుఁడగు జతురాననుఁడుండుటను గాంచి దైత్యులు చేతులు జోడించుకొని యిట్లనిరి :-దేవా ! మీరు మాయెడల సంతుష్టులైనచో మాకు నాల్గు వరములొసంగుఁడు. ఒకటి మేమమరులము కావల యును. రెండవది మమ్ముల నెవరును జయింపరాదు. మా శరీ రమున కపార బలము రావలెను. మూఁడవది మేము నేర్చుకొనక యే మాకపారశస్త్రాస్త్ర విద్య రావలయును, నాల్గవది మేము మా యిష్టము వచ్చిన రూపమును ధరింపవలయును."

బ్రహ్మ యిట్లనెను :- "నా మాటను వినుఁడు. నేనన్ని వరములను నీయఁగలను, కాని అమరత్వము నొసంగజాలను, అమరులు దేవతలే. జన్మించిన వారేదో ఒకదినమునఁ జచ్చి తీర వలయును. కావున మీరు దీర్ఘజీవులగుటకై యేదైన రక్షణమును

గోరుకొనుఁడు, మీ మృత్యువున కేదైన సంభవ కారణమును గోరుకొనుఁడు. దానిని వదలి నేను మిమ్ము నిర్భయులుగను నమరులుగను జేయుదును."

ఇది విని దైత్యులిట్లనుకొనిరి :- "మా యిద్దరికిని నెవరును భేదభావమును గలిగింపజాఁలరు. ఏ కారణముచేతను మేము పరస్పరము విరుద్ధ భావములు కలవారము కాము." అని యిట్లాలోచించు కొని వారిట్లనిరి :- "స్వామీ! మేమే చరాచర జీవులచేఁ జావరాదు. మాకు మృత్యువు సంభవింపవలసి యుండినఁ బరస్పరము కొట్టుకొని చావవలెను."

బ్రహ్మయిట్లనెను :- "ఏవమస్తు! అట్లేయగుగాక!" అని వరము నొసంగి యాతఁడు పోయెను. బ్రహ్మ పోగానే వారి శరీరముల లోని కపారబలము వచ్చెను. వారభ్యసింపకయే సమస్తాస్త్ర శస్త్రపారంగతులైరి. ఇప్పుడు వారికి గర్వమత్యధికమయ్యెను. వారు సేనను గూర్చుకొని మునుముందుగా స్వర్గము మీఁదకు దండెత్తిరి. దేవతలు బ్రహ్మ యిచ్చిన విచిత్ర వరదాన విషయమును వినిరి. అందువలన వారు స్వర్గమునుండి పారిపోయిరి. అనాయాసముగ వారు స్వర్గమును యుద్ధము లేకయే జయించిరి. వారిద్దరును వరదాన దర్పముచే సందర్పితులై అటు నిటుఁ దిరుగుచు బ్రాహ్మణులకు దుఃఖమును గలిగించుండిరి. వారి యజ్ఞములను విధ్వంసన మొనర్చుచుండిరి. నానా రూపములను ధరించి మునులను దినుచుం

డిరి. వారి రాజ్యమున యజ్ఞ యాగాదులొనర్ప నసంభవమయ్యెను. సర్వత్ర హాహాకారములు వ్యాపించెను. ధార్మిక కార్యములు లుప్త ప్రాయలయ్యెను. జనులలో ననాచారమును, గదాచారమును, వ్యభిచారమును వృద్ధియయ్యెను. త్రిలోకములాతని కధీనములయ్యెను.

వారి నెదుర్కొనఁగలవారును, వారితోఁ బోరాడఁ గలవారును లేకపోఁగా వారు సాంసారిక భోగాసక్తినిఁ జెందిరి. సుందర వనోపవనములకును బర్వత కందరోపత్యకలకును బోయి సురసుందరులతోఁ గామక్రీడ లొనర్చుచుండిరి. చాలమంది గంధర్వ, కింపురుష, విద్యాధర కన్యకలాడుచుఁ బాడుచు వారికానందమును గలిగించు చుండిరి. వారి సంగీతమును విని యానందించుచుండిరి. ఇద్దరును యధేచ్ఛగా వారుణీ పానమునొనర్చి వారితో నామోద ప్రమోదము లొనర్చుచుండిరి. ఇట్లు వారు విషయభోగలిప్తులగుటచే వారు విషయాసక్తులైరి. అయినను వారిలోఁ బ్రేమభావమెప్పటి యట్లే యుండెను. ఒకరినొకరు ప్రాణములకంటె నెక్కుడుగఁ బ్రేమించుకొనుచుండిరి. వారి మూలమున యజ్ఞాది ధర్మకార్యములన్నియును నిలిచిపోయెను.

సూతుఁడిట్లనెను :- "మునులారా ! ఆ దుష్టదైత్యుల అత్యాచారములచే దుఃఖితులై దేవతలును, ఋషులును మునులును గలిసి పితామహుఁడగు బ్రహ్మకడకుఁబోయి, చేతులను జోడించుకొని స్తుతివినయములొనర్చుచునిట్లనెను :-"విభూ ! మీరా దుష్ట దైత్యుల కెట్టి కఠిన వరముల నొసఁగినారు ! వారుసృష్టినంతను సంహరించు

చున్నారు, ధర్మకర్మములన్నియును దెబ్బతినినవి. వారు చచ్చు నుపాయమేదైనఁ జేయకుండినచోఁ బ్రపంచములోని ధర్మమంత యును నశింపఁగలదు."

దేవతల యొక్కయు, ఋషులయొక్కయు మాటలను విని సర్వజ్ఞుఁడగు గమలాసనుఁడు కొంచెముసేపు మౌనముగ నుండి వారినిఁజంపు నుపాయము నాలోచించుచుండెను. మరలనిట్లనెను :- "దేవతలారా ! ఋషులారా ! వారు తపః ప్రభావముచే దుర్లభము లగు వరములను బొందినప్పటికిని నేను వారిని యుక్తితోఁజంపిం చెదను. మీరేవిషయమునను జింతింపవలదు." అని పలికి బ్రహ్మ విశ్వకర్మను బిలిపించి యాతనితో నిట్లనెను :-"విశ్వకర్మా ! నీవు సమస్తవస్తువులను నిర్మింపఁగల మేటివి. నీ వీ త్రిలోకములందెన లేని సుందరి నొకదానిని నిర్మింపుము. నేఁడే నీ చాతురికి పరీక్ష."

బ్రహ్మయొక్క యిట్టి యుత్సాహ వర్ధక వచనములను విని విశ్వకర్మ మిక్కిలి యానందించెను. అతఁడు తన బుద్ధిబలముచే విశ్వములోని సమస్తవస్తువులందు గల సౌందర్యము నంతను బ్రోవు చేసి ఒక స్త్రీని రచించెను. ఆ స్త్రీ సౌందర్య రూపరత్నముగని, అణువణువున సౌందర్యము నంతను నేకత్రము కావించి దాని నిర్మా ణము మిక్కిలి చాతుర్యముతోఁ జేయఁబడినది. అసంఖ్యాకములగు రత్నముల కాంతిని దాని రోమరోమములందును గూర్చెను. ఆమె శరీర మందొక యణువైనను సౌందర్య సుషమలేని స్థలమే లేదు. యౌవన భారముచే మదమత్తయై అలసతను జెందుచు నందఱను దన సౌందర్యముచే నిముగ్ధులను గావించుచు నామె బ్రహ్మసమ్ము

ఖమునఁ జేతులను జోడించుకొని నిలుచుండి నమ్రతతో నిట్లనెను :-
"జగదీశ్వరా ! నన్నేల సృజించితిరి ? నేనేమిపని చేయవలయును?"

బ్రహ్మ యిట్లనెను :- "సర్వశ్రేష్ఠ సుందరీ ! నీవు సుందోప సుందుల కడకుఁబోయి, నీ రూపముచే మోహింపఁజేసి వారిద్దరిని మోసపుచ్చవలెను. వారికి విరోధమును గలిగింపవలయును. నీవు తప్ప యీ ప్రపంచములో వారిని జయించువారును జంపఁగల వారునులేరు, నీ శరీరములో నుత్తమము కాని స్థలమే లేదు, కావున నీవు తిలోత్తమ యనుపేర బ్రసిద్ధినిఁ జెందెదవు."

ఇది విని తిలోత్తమ బ్రహ్మకుఁ బ్రణామమును గావించి, ఆతనికి ప్రదక్షిణ మొనర్చి బయలుదేరుట కుద్యుక్తురాలయ్యెను. మునులారా ! ఆమె సౌందర్యమును గాంచి అందఱును విముక్తులైరి. అందఱును నామె నేకాగ్రదృష్టితోఁ జూచుచుండిరి. ఇంతెందు దేవాది దేవుఁడగు మహాదేవుఁడును నామెను జూచుచుండెను. శ్రేష్ఠ పురుషుఁడాయెను. హీనులవలె నెట్లుచూడఁగలఁడు ? అందువలన నామె పరిక్రమ మొనర్చుచుండ నామె యే దిక్కునకు బోవుచుండిన నటువైపాతని ముఖముండెను. ఇట్లు నలువైపులను నాతనికి ముఖము లేర్పడెను. ఇంద్రునకు రెండు కన్నులతోఁ దృప్తికాలేదు. ఆతనికి ప్రత్యవయవ మందునను గన్నులేర్పడెను. ఆతఁడు సహస్రాక్షుఁ డయ్యెను. సారాంశ మేమనఁగా బ్రహ్మ తప్ప మిగిలిన దేవతలందఱును నామెరూపమును గాంచి విముగ్ధులైరి. ఈ తిలోత్తమ విశ్వ విజయులగు సుందోపసుందులను దనవశము కావించుకొనఁగలదని అందఱును దెలిసికొనిరి.

బ్రహ్మ ఆజ్ఞను బొంది యామె రక్తవర్ణముగనుండు నొక సన్నని చీరెను ధరించి కులుకుచుఁ గమలమును ద్రిప్పుచు భ్రమరములను వదలుచు, హావభావములను జూపుచు, మదమత్తయై ఆ సోదరులిద్దరకడకుఁబోయెను. వన్యప్రదేశమందువసంతశ్రీ వెల్లివిరియుచుండెను. నలు వైపులను బుష్పములు వికసించెను. శీతల, మంద, సుగంధ వాయువు వీచుచుండెను. వృక్షముల మీఁదఁ గూర్చుండి కోకిలలు కుహూఁ కుహూఁయని కూయుచుండెను. ఆ యిద్దరు సోదరులును గంధర్వలలనలతోఁగూడి ఆనంద ప్రమోద మొనర్చుచుండిరి. గంధర్వులు పాడుచుండిరి. సుందరాతి సుందరులగు నప్సరసలు నృత్యము చేయుచుండిరి. వేలకొలది సురసుందరీమణులు సర్వ సమర్థులగు సురరిపులను సేవించుచుండిరి. ఆ సమయమున నా సోదరులిద్దరును దూరమున నిలుచుండినఁ దిలోత్తమను గాంచిరి. ఆమె మందహాస మొనర్చుచుఁ గటాక్షపాత మొనర్చుచుండెను. సుందోపసుందులు సురాపానమదమత్తులై యుండిరి. వారి నేత్రములత్యధికముగ నా సవపానమొనర్చుటచే నెఱ్ఱ నెఱ్ఱగ నుండెను. వారి విఘూర్ణిత నేత్రములుకల లలనా లలామమును దూరమున నుండియే కాంచిరి. చూఁడగానే వారిద్దనును గామవశులై, యిద్దరును నొక్కసారిగా నామెను బట్టుకొనుటకుఁ బరువిడిరి. వారిద్దరొక్కసారిగా నామె దగ్గరకుఁబోయిరి, ఒకఁడెడమ చేతిని మరియొకఁడు కుడిచేతినిఁ బట్టుకొనెను. అంతవారు దీన భరితమగు వాక్కులతో నామెతో నిట్లనిరి :-"త్రైలోక్య సుందరీ! మేము నీకధీనులము. నీవు మాపై దయజూపుము. మమ్ములను స్వీకరింపుము. నీ కింకరులుగ నొనర్చుకొనుము.

ఆమె భయనాట్యమును జూపించుచు నిట్టూర్పు విడుచుచు, మత్తయై యిట్లనెను :- "నేను మీయైశ్వర్యమును బరాక్రమమును గూర్చిన ప్రశంసను విని వచ్చితిని. కాని మీరు సర్వసమర్థులురు కావున నాధర్మమును రక్షింపుఁడు. మీ యిద్దరిలో నెవరైన నొక్కరు నన్ను విధ్యుక్తముగఁ బాణిగ్రహణ మొనర్పుఁడు. ఒక్కరునన్ను భార్యగాఁ గైకొనుఁడు."

ఇది విని సుందుఁడిట్లనెను :- "ఉపసుందా ! నీవు దీని చేతిని విడువుము. నేను దీనిని వివాహమాడెదను. నేను ముందుగా దీనిని మానసికముగ వరించితిని. కావున ధర్మతః ఈమె నాపత్ని యగుటచే నీకుఁ దల్లివంటిది."

ఉపసుందుఁడును దానిపై ననురక్తినిఁ జెందియుండెను. ప్రాణములుండఁగా దానిని వదలుట కిష్టము లేకుండెను. ఆతఁడు క్రోధముతోఁ గన్ను లెఱ్ఱఁజేసి యిట్లనెను :- "అన్నా ! నీవెట్టి ధర్మ విరుద్ధపు పలుకులు పలుకుచున్నావు దీని చేతిని మొదట నేను బట్టుకొంటిని. నాభార్యయగుటచే నిది నీకు కోడలు వంటిది. ఈమెను నీవు వదలుము."

సూతుఁడిట్లనెను :- "మునులారా ! ఇప్పు డింకేమున్నది. కలహబీజమంకురించినది. ఇద్దరును నొక్కరొకరు కువాక్యములను బలుకుకొనుచుండిరి. అంత నస్త్ర శస్త్రములను గైకొని యుద్ధము చేయసాగిరి. యుద్ధముచేసి యిద్దరును జచ్చి నేలఁబడిరి.

దేవతలు జయజయ శబ్దములొనర్చిరి. అప్సరసలు పుష్ప వృష్టినిఁ గురిపించిరి. బ్రహ్మ తిలోత్తమను బ్రశంసించెను. సూర్య మండలముతోఁగూడి తిరుగునట్లును, సురసుందరులలో సర్వశ్రేష్ఠగ నుండునట్లును వరమును బొందెను బ్రహ్మాది దేవతలును జేయలేని కార్యమును దిలోత్తమ మోహినీదేవి క్షణములోఁ జేసి చూపించెను. "మోహినీ భగవతికీ జయ్."

సూతుఁ డిట్లనెను :- "కావున మునులారా! ఈ యసురులు మోహినికి దక్క నింకెవరికిని లొంగరని భగవానునకు దెలియును. అందువలన నాతఁడు మోహిని యయ్యెను. ఆతఁడు మోహిని కానిండు మోహనుఁడు కానిండు, ఆతని చేష్టలన్నియును బ్రపంచ కళ్యాణముకొఱకై యుండును. కర్మమంతయును నొక్కటేకాని భావమున వానిలో భేదము లేర్పడుచున్నవి. తల్లినిఁ జెల్లెలినిఁ, బుత్రికను స్పర్శ నొకే విధముగ, నొకేయంగముతో స్పర్శింతుము కాని భావభేదముచే నా స్పర్శయందు భేదము కనఁబడుచున్నది. మానవుఁడు ప్రాణములను, ధనమును, మనస్సును, వాక్కును, సమస్త కర్మలను దనవిగా భావించుచు భేదబుద్ధితోనే వ్యాపార మును గావించుచున్నాఁడో ఆతఁడు పురుషార్థము నొనర్చినను వ్యర్థమగును. దాని ఫలము తుచ్ఛమైనదగును. ఆ కార్యములనే విష్ణుప్రీత్యర్థముగ, భగవత్సేవాశుద్ధితోఁ జేసినచో నాకర్మలే అక్షయ ములగును. అన్నిటిలో నీశ్వరుఁడున్నాఁడని భావించుచు నాతని ప్రసన్నతకొఱకే సమస్త కార్యముల నొనర్పవలయును.

దేవతలును, దైత్యులును సమానకర్మమునే యొనర్చినప్పటికిని, సమానమైన ఫలమే లభించినప్పటికిని, దేవతలు భగవంతుని నాశ్రయించిరి. అనిత్య అవినాశియగు ప్రభువు ప్రసన్నుఁడగుటకై పరిశ్రమ మొనర్చిరి. అందువలన వారికిఁ ద్రాగుట కమృతము లభించెను. అసురులాసురీబుద్ధిచేఁ గేవలము ననిత్యమును, క్షణభంగురమును నగు శరీర పోషణ కొరకే పనుల నొనర్చిరి. చల కపటములచే లాగుకొని, పీకుకొని అమృతముమీద నధికారమును సంపాదించిరి. అందువలన వారి పురుష ప్రయత్నము సఫలము కాలేదు. వచ్చిన యమృతము చేతినుండి జారిపోయెను. స్వేచ్ఛగా వాదిచ్చి వైచిరి. కావున స్వామీ ! ఈ మోహినీరూపము భగవానుని ఒక లీలయే.

శ్రీ శౌనకుఁ డిట్లనెను :- "సూతా ! భగవంతుని చేష్టలన్నియును లోకకల్యాణార్థమే యుండును. అయితే సరియే. తరువాత నేమైనది ? అమృతమును లాగుకొనినఁ దరువాత దైత్యులవశ్యము క్రుద్ధులైయుందురు. క్రుద్ధులై వారేమిచేసిరి? ఈ సముద్ర మంథన కథను నీవికఁ బూర్తి కావించుము."

సూతుఁ డిట్లనెను:- "అవును. స్వామీ ! దైత్యులుదైత్యులే. అమృతమును గోల్పోయిన తరువాత వారత్యధిక క్రుద్ధులైరి. వారు తరువాత దేవతలతో సంగ్రామమును గావించిరి. ఆ దేవాసుర సంగ్రామమును మీకునేను వినిపించెదను. నాగురు దేవుఁడగు శుక

దేవుఁడు పరీక్షిన్మహారాజున కెట్లు రాఁబోవు కథను వినిపించెనో దానినంతను మీకు వినిపించెదను. దీనిని మీరు సావధానులరై శ్రవణ మొనర్పుఁడు.



....

## దేవాసుర యుద్ధము



శ్లో॥ సపత్నానాం పరామృద్ధిం దృష్ట్వా తే దితినందనాః ।
అమృగ్యమాణా ఉత్పేతు ర్దేవా న్ప్రత్యుద్యతా యుధాః ॥
తతః సురగణాః సర్వే సుధయా పీతయైధితా ।
ప్రతిసంయు యుధః శస్త్రై ర్నారాయణ పదాశ్రయాః

శ్రీభాగ. ౮ స్కం ౮ అ. ౧౪ శ్లో॥

క॥ శుద్ధముగ సురల కమృతము
సిద్ధించిన నసుర వరులు సిడిముడి పడుచుఁ
గ్రుద్ధులు నానాయుధ స
న్నద్ధులు నయి యుద్ధమునకు నడచిరి బలిమిఁ ॥

శ్రీమదాంధ్ర భాగవతము

వ. అంత సురగణమంతయును సుధనుద్రావుట చేతను శ్రీమన్నారాయణు నాశ్రయించుట చేతను బలవంతులై శస్త్రాస్త్రము లతో యుద్ధమునకుఁ దలపడిరి.

జీవి క్రోధ భరితుఁడై నను, తన స్వార్థమున కాఘాతము లభించినను, తాబలిని శూరవీరుఁడును, సాహసి ననుకొన్నప్పటికిని, ప్రతిపక్షుల యొక్క అశిష్ట వ్యవహారము వలన క్షుభితుఁడై నను, దనశక్తి సార్వజనిక ప్రదర్శన మొనర్పఁదలఁచినను, పోరాడుట కుద్యుక్తుఁ డగును. పోరాటము మంచిదికాదు. కాని ప్రాణిపోరాడ కుండఁ జాలఁడు. ప్రేమింపక నెట్లుండఁ జాలఁడో పోరాడకుండ యును నట్లే యుండఁ జాలఁడు. పోరాడుట జీవునకు స్వభావము. యుద్ధము లేనిచోట జీవనమే లేదు. యుద్ధములేనిచోట వృద్ధిలేదు. సమరము లేనిచోట సాహసము లేదు. విపక్షులు లేకున్నచో సచే ష్టత యుండదు. జీవిత మొక యుద్ధమే. ప్రపంచమే యుద్ధస్థలము. ఇందులో నిర్బలులకు నిర్వాహము లేదు. బలమే లేకున్నచోఁ బరా ధీనుఁ డవుగ నుండుము. దుఃఖమును భోగింపుము. సబలుఁడవై వీరుఁడవై నచో వసుంధరలోని సామగ్రులను సుఖపూర్వకముగ నుప భోగింపుము. జీవన సంగ్రామములో ముందుకుపొమ్ము ఇదియే మూల మంత్రము.

శ్రీశుకదేవుఁ డిట్లనెను :- "రాజా! సముద్రమును మథిం పఁగా నమృతము వెలువడును. పరిశ్రమమును దేవదానవులిద్దరును సమానముగ నొనర్చిరి కాని హరివిముఖులగుటచే నసురులు దాని మధురఫలమును బొందఁజాలకపోయిరి. దేవతలు కడుపులునిండ నమృతము ద్రావిరి. శ్రీహరి యనుకూల మగుటచే వారు తాము చేసిన శ్రమకు యథేష్ట ఫలమును బొందిరి. మోహినియై వారినిఁ దృప్తుల నొనర్చెను. సూర్యచంద్రుల కమృతము నొసంగి,

రాహువు శిరమును ఖండించి మోహినీదేవి యెటో పోయెను. ఇప్పు డచ్చట మోహినియునులేదు మోహినీ చీరయునులేదు ఇప్పుడచ్చట పీతాంబరధారియగు మురారి వనమాలి నవ్వుచునుండెను. ఇప్పు డసురులు కన్నులు తెరచిరి. ఇప్పటికి వారికామ మదము దిగెను. వీఁడు మోసగాఁడగు విష్ణువు. బహురూపుడగు విష్ణువు. కపట వేషమును ధరించినాఁడు. మనమీ మిథ్యామోహినీ భ్రమలో బడి వ్యర్థముగ మోసపోయితిమి. మాయావి యగు నీహరి మనల నోడిం చుటకే యీపన్నాగమును బన్నినాఁడు మంచిది. చింతింపఁ బని లేదు. త్రాగనిండీ నపుంసకుల నీయమృతమును ఎవరేమి చేయఁ గలరో చూతము. అమృతమును గొనిన పీరి వనివట్టెదము. ఇప్పుడే విష్ణువును యమసదనమునకుఁ బంపుదము. ఇప్పుడే దేవతలకు మాబల పౌరుషములను జూపించెదము. ఇప్పుడే వీరిని గొట్టి పాఱ ద్రోలుదము. వీరేమి లెక్క? వీరినిమనము చంపెదము. పిండిపిండి చేసెదము." ఈవిధముగ దంతములను బట బట కొఱుకుచుఁ గొట్టుము కోయుము. పట్టు కొనుము పోనీయ వలదు. ఈవిధముగ నఱచుచు వారస్త్ర శస్త్రములను గైకొని దేవతల మీఁదకుఁ బరువిడిరి.

దేవతలిదివరకే జాగ్రత్తగ నుండిరి. అమృతమును ద్రావి వారు సబలులైరి. లక్ష్మీదేవి యుత్పన్న మగుటచే వారు శ్రీసంపన్ను లైరి. అన్నిటికంటె గొప్ప విషయ మేమనఁగా వారు ప్రభుపాద పద్మములను బ్రేమ పూర్వకముగఁ బట్టుకొనిరి, ఒక్క అచ్యుతుని మాత్రమాశ్రయముగ గ్రహించి వారస్త్రశస్త్రములను గ్రహించి అసురుల నెదుర్కొనుటకుఁ దత్పరులైరి. ఈ విధముగ నచ్చట

క్షీరసాగర తీరమున సురాసురులకు రోమాంచకారియగు బరమ భయానకమగు ఘనఘోరయుద్ధము జరిగెను. రోషావేశులై ఒక రొకరు బీరములు పలుకుచుఁ గర్వించుకొను చుండిరి. శత్రుసమ్ముఖ మున గర్జించుచుండిరి. విపక్షవీరుల యుత్సాహమును దగ్గించుటకును వివిధ రణ వాద్యములను వాయించు చుండిరి. వీర యోధులు వాహ నములమీఁద నెక్కి సిద్ధపడుచుండిరి. ఆ సమయమున వీరుల గర్జనములచేతను, గుఱ్ఱముల పదఘట్టములచేతను, రథముల ధణ ధణ శబ్దములచేతను, శంఖ, తూర్యమృదంగ, వీణా, వేణు, పణవ, డమరు మొదలగు వాద్యములను నుత్సాహముతో వాయించుటచేఁ గలిగిన ఘోషము వలనను గలిగిన ధ్వనిచే నాకాశము ప్రతిధ్వ నించెను. నల్దిక్కులను భీషణశబ్దములు చెలరేగెను. రథములు రథములును, పదాతులు బదాతులును, గజములు గజములును, నశ్వ ములు నశ్వములును, దలపడెను. ఒకఁడు వేరొకనిఁ గిందఁ బడ వైచి పైనఁ గూర్చుండెను. ఈవిధముగ నిరుబక్షములందును దుముల యుద్ధము జరిగెను.

దేవతలసేన రథ, తురగ, గజ, పదాతులను జతురంగముగ నుండెను. కాని యసురుల వాహనములు విచిత్రములు. కొందఱ రొంటెలమీఁదను, గొందరు గాడిదలు మీఁదను, గొందరేనుగుఁల మీఁదను, గొందరు గుఱ్ఱముల మీఁదను, కంచరగాడిదల మీఁదను నెక్కిరి. కొందరు దున్నలనెక్కిరి. కొందరు భల్లూకముల మీఁదను, గొందరు వ్యాఘ్రముల మీఁదను, గొందరు మృగములమీదను, గొందరు తోడేళ్ళ మీఁదను, గొందరు పిల్లుల మీఁదను, గొంద రెలు

కల మీఁదను, గొందరు కప్పల మీఁదను, గొందరు పతంగముల మీఁదను, గొంద రుడుతల మీఁదను, గొందరు సర్పములమీఁదను, గొందరు గద్దల మీఁదను, గొందరు డేఁగలమీఁదను, కొందరు పావురముల మీఁదను, కొందరు బాతులమీఁదను, కొంగల మీఁదను, కొందరెడ్ల మీఁదను, గొందరు తేళ్ళమీఁదను, గొందరు సర్పముల మీఁదను, కొందరు జోరీగల మీఁదను, గొందరు మక్షికములమీదను, గొందరు చీమల మీఁదను, గొందరు మిడుతల మీఁదను, గొందరు నల్లుల దోమల మీదను, నెక్కిరి. సారాంశ మేమనఁగా నసురు లెక్కని జంతువులేదు.

అంత శౌనకుఁడిట్లడిగెను :- "సూతా! నీవు బుద్ధికతీతమగు విషయములను జెప్పుచున్నావు. ఒక్కొక్కప్పుడావేశమునఁ బడి అతీతమగు విషయములను జెప్పుచుందువు. ఎక్కడనైన నేనుఁగు, గుఱ్ఱము, ఒంటె, ఎద్దు, గాడిద, కంచరగాడిద, సింహ, వ్యాఘ్రాదులు వాహనములగుట ఉచితముగనే యున్నది. ఎలుక, పిల్లి, నల్లి, చీమ, దోమ, తొండ, ఉడుత, గుడ్లగూబ, ఉడుము, మకరము, మిడుత మొదలగు జంతువులమీఁదఁ బర్వతములంత యసురు లెట్లు కూర్చొండగలరు? ఇది బుద్ధి కతీతమగు విషయము."

అంతనవ్వుచు సూతుఁడిట్లనెను :- "స్వామీ! అవి సాధారణ నల్లి దోమలు కావు. ఆ యసురులే యిట్టిరూపములను ధరించిరి. ఒక్కఁడు వాహనమై రెండవవాఁడు దానిపై నెక్కును మాయావులగు దైత్యు లిచ్ఛానుసారముగ రూపధారణ మొనర్పఁ

గలరు. మాయచే వారేది కావలయుననిన నదికాఁగలరు కావున వారు తమయిచ్ఛానుసారముగ రూపమును ధరించిరి. ఇవన్నియును మాయానిర్మితములని తలంపుము. ఇప్పుడు మీరీ యుద్ధమును మానవీయ యుద్ధముతోఁబోల్చినచో బండి ముందునకు సాగనే సాగదు. ఇదిమాయాయుద్ధము. మాయలో నసంభవమనునది లేదు. మాయలోనన్నియును సంభవమే."

శౌనకుఁడిట్లనెను :- "సరియే, సూతా ! కానిమ్ము, తరువాత నేమైనది ?"

సూతుఁడు శీఘ్రముగా నిట్లనెను :- "ఇంకేమైన దనెదరు స్వామీ ! తుములయుద్ధము జరిగినది. తడ తడ, చెట్ పట్, ఖటా ఖట్ అయినది. ఇప్పుడువాఁడు వీనినిఁగొట్టినాఁడు వీఁడు వానిని గొట్టినాఁడు. వీఁడు వానినిఁబడవైచినాఁడు వాడు వీనిని దొరలించి నాడు. ఒకఁడొకని శిరమును దెగఁగొట్టెను. ఇంకొకఁడు వీనినిఁ దెగఁదిట్టెను. ఈ విధముగవారు పరస్పరము యుద్ధమొనర్చుకొను చుండిరి. రెండు సేనలలోని వీరుల పతాకములెగురు చుండెను. సేనయంతయును యుద్ధముకొఱకు తలపడెను. తెల్లని నిర్మలఛత్ర ములు మెఱయుచుండెను. మనోహరమణిమయ కిరీటములు తళతళ లాడుచుండెను. తెల్లని చామరములు విసరఁబడు చుండెను. నానా రంగులు కలిగిన వస్త్రములు వాయువశమున నెగురుచుండెను. ఆ సమయమున దేవాసుర సేన ధనుష్కోటిలో రెండు సముద్రములు

కలిసి పరస్పరము పోరుచున్నట్లు పోరుచుండెను. వానియొక్క ఉత్తాల తరంగములు పరస్పరము దెబ్బకొట్టుకొని ఆకాశము వైపునకు శబ్దముతోఁ పైకెగురుచుండెను."

దైత్య సేనాధి నాయకుఁడుగఁ బ్రహ్లాదుని పౌత్రుఁడును విరోచనుని పుత్రుఁడునగు బలిచక్రవర్తి యుండెను. ఇచ్చట దేవ సేనాపతిగ శచీపతి యింద్రుఁడుండెను. దైత్యరాజగు బలి మయ దానవునిచే నిర్మింపఁబడిన వైహాయసమను విమానమునెక్కి యాకాశమున నపర సూర్యుఁ డుదయించినట్లుట్టి పడుచుండెను. ఆతని ప్రబల ప్రతాపముచే దశదిశలను బ్రకాశిత మొనర్చుచుండెను. అన్య దైత్య యూథపతు లాతని ననుకరించుచుండిరి. ఆతనిపైన నుజ్వల శ్వేతఛత్రముండెను. అటునిటు చామరములు వీవఁబడు చుండెను. ఆతఁడాకాశమున నుత్తమగ్రహము వలెను, శరచ్చంద్రుని వలెను గనఁబడుచుండెను. ఆతని రక్షణ నిమిత్తము విమానము చుట్టును, నముచి, శంబర, విప్రచిత్తి, అయోముఖ, ద్విమూర్ధ, కాలనేమి, విరోచన, హయగ్రీవ, శంకశిరా, కపిల, మేఘదుందుభీ, తారక, శుంభ, నిశుంభ, జంభ, ఉత్కల, అరిష్టనేమి, మయ, త్రిపురనివాసులు, ప్రహేతి హేతి, ఇల్వల, వాతాపి, శకుని, భూతసంతాప, వజ్రదంష్ట్రుడు, నుపులోముని వంశములోని యసురులును, కలేప, నివాత కవచాది గొప్పగొప్ప మాయావులును, బలవంతులగు దైత్యులును, శస్త్రములను గొని యుద్ధార్థులై నిలుచుండిరి. వారుగొప్ప గొప్ప బలవంతులు. వారనేక సార్లు దేవతలను బరాజితుల నొనర్చి అనేకసార్లు దేవతలచేనోడిరి. అమృతము

లభింపనికారణముచే వారత్యంతకుపితులైరి. ఒకరినొకరు ఉత్సాహ పరుచుకొనుచుండిరి. పండ్లు పొడిపొడి చేసికొనుచుండిరి. చవ్వట్లు చరచుచుండిరి. తొడలుచరచుచుండిరి. అస్త్ర శస్త్రములను ద్రిప్పు చుండిరి. దేవతలను బిండి పిండి చేయఁదలఁచుచుండిరి. వారివారి శంఖముల నూదుచుండిరి. వాహనములను సరిచేసుకొనుచు ఖడ్గము లను గదలించుచుండిరి. వీరందఱును రణరంగదుర్మదులే. అసురు లన్ని విధముల సుసజ్జితులై సురసేనపై విఱుచుకొనిపడిరి.

ఇటు నమరాధిపుఁడగు నింద్రుఁ డసురులు సుసజ్జితులై యుద్ధోత్సుకులగుటను గాంచి క్రుద్ధుఁడయ్యెను. ఆతఁడటు నిటుఁ దిరుగు పర్వతమువలెనుండు నైరావతముపై నెక్కెను. గంధర్వు లాతని గుణములను గానము చేయుచుండిరి. త్రైలోక్యలక్ష్మి ఆత నిని మరల వరించెను. అమృతమును ద్రాగుటచే వారు నిర్భయులై నిశ్శంకులై, సాహసయుక్తులైరి. పర్వతశిఖరము నుండి రెండు సెలయేరులు పారుచున్నట్లు ఐరావతము నుండి మదము కారు చుండెను. దానిమీదఁ గూర్చుండిన దేవేంద్రుఁడుదయాచలమున నుద యించిన భువన భాస్కరునివలె నుండెను. ఆతని చుట్టును నలుబది తొమ్మిది మంది మరుత్తులును, వరుణ, కుబేర, యమ, సూర్యచం ద్రాది ముఖ్యముఖ్య దేవతలను, వారివారి వాహనముల మీఁదనెక్కి ఆతని ననుగమించుచుండిరి. ఇప్పు డిరు పక్షములనుండియును పోరు ప్రారంభమయ్యెను. అందఱును వారివారి జోడీలను జూచు కొనిరి. తమకు సమానులగు వీరులతోఁ దమ శక్తినంతను వినియో గించి సురాసురులు యుద్ధము చేయుచుండిరి. ఇంద్రుఁడు బలితో

భయంకర రోమహర్షణములగు యుద్ధము నొనర్చుచుండెను. పరస్పరము తీక్ష్ణ బాణములతోఁ గొట్టుకొనుచుండిరి. ఒకరినొకరు దివ్యాస్త్రములను బ్రయోగించుకొని క్షతవిక్షతుల నొనర్చుకొనుచుండిరి.

శ్రీశుకదేవుఁడిట్లనెను :–"రాజా! బలియును నింద్రుఁడును నెట్లు యుద్ధముచేయుచుండిరో మిగిలిన దేవాసురులు ప్రాణపణముగ ఘన ఘోరయుద్ధ మొనర్చుచుండిరి.

.....

## దేవదానవుల ద్వంద్వ యుద్ధము

శ్లో॥ తేఽన్యోన్య మభిసం సృత్య క్షిపన్తోమర్మభిర్మథః।
ఆహ్వయన్తో విశన్తోఽగ్రే యుయుధుర్ద్వంద్వ యోధినః॥
శ్రీభాగ. ౮ స్కం. ౧౦ అ. ౨౭ శ్లో॥

వ. వారన్యోన్య మివ్విధంబునం గలసి పెనంగి ద్వంద్వ యుద్ధంబు సేయుచుండిరి. వారొకరిపై నొకరస్త్రశస్త్రములను విసరుకొనుచుండిరి.

శ్రీమదాంధ్ర భాగవతము

చాలమంది కలిసి ఉత్సాహములో నేదైనను బనినిఁ జేయు చుండినచో నితరులకును సాహసము పెరుగును. వారును బ్రభావమునఁబడి తమశక్తికిమించిన కార్యము లొనర్చుచుందురు. చాలమంది ఒకానొక సంస్థకు దానమొసంగుచుండినచో దానినిఁ జూచుచున్న కృపణులును గొంతగానిచ్చెదరు. చాలమంది భావుక భక్తులు భజన కీర్తన మొనర్చుచుండినచో నచ్చటనున్న నితరులును దానిలోఁ జేరుదురు. అదే విధముగ వీరయోధులు పోరాడుచుండుటను గాంచినను, రణదుందుభులు మ్రోగినను బిరికివారి రక్తనాళముల లోనికి వీరరక్తము సంచార మొనరించును. వారును నుత్సాహభరితులై పోరాటములోఁ జేరుచుందురు. తమ పక్షము వారికిని సైనిక సేనాపతులకును ఘనఘోరయుద్ధము జరుగుచుండుటను గాంచిన నిరుపక్షములలోని సైనికులును దమ విజయముల కొఱకు సతతము బ్రయత్నము చేయుచుందురు. శక్తియున్నంతవరకూరకుండఁజాలరు.

శ్రీ శుకదేవుఁడు పరీక్షిన్మహారాజుతో నిట్లనెను :- "రాజా! బలికిని దేవేంద్రునకును బరస్పరము యుద్ధము జరుగుచుండ నందర శరీరములందును నుత్సాహ మినుమడించెను. అందఱును దమకుఁ బ్రతిద్వంద్వుల నెన్నుకొని యుద్ధప్రవృత్తులైరి. ఇటు దేవతల కధిపతి దేవేంద్రుఁడుండిన నటు నసురాధిపతి బలి యుండెను. అసురశిల్పియగు మయాసురుఁడు సురశిల్పి యగు విశ్వకర్మతో నిట్లనెను :-"రమ్మ, మనమిద్దరమును గలియఁబడెదము." విశ్వకర్మ దక్కువవాఁడు కాఁడు. ఆతనికిని రణమొనర్పఁ బ్రబ

త్రోత్సాహముండెను. కడుపునిండ నమృతమును ద్రాగియుండెను. ఇద్దరును బరస్పరము తలపడిరి. ఇఁక కొట్లాట నరఁటలాట ప్రారంభమయ్యెను. అటునుండి యయాతి మహారాజెవరి కుమార్తెను పెండ్లాడెనో అట్టి వృషపర్వుఁడు వచ్చెను. ఈతఁడును వైద్య చికిత్సాశాస్త్రనిపుణుఁడని తోఁచుచున్నది. అందువలన నాతఁడు దేవ వైద్యులగు నశ్వినీకుమారులతోఁ దలపడెను. వీరిద్దరును పెనుగులాడుచుండిరి. ఇంతలో నదేసమయమునకు ఏకాక్షియగు శుక్రాచార్యుఁడు వచ్చెను. దేవతల గురువగు బృహస్పతియు నచ్చటనే తిరుగుచుండెను. నవ్వి శుక్రాచార్యుఁడిట్లనెను :-"దేవగురూ ! నేఁడందరును నుర్జీ లేర్పఱచుకొని పోరాడఁ కొనుచున్నారు. కావున మనమిద్దరమును దలపడెదము. బ్రాహ్మణుల పని పోరాటము కాకున్నను, మనము శిష్యులపక్షమును గ్రహించి పోరాడవలసి యుండును. పురోహితులు ధర్మయుద్ధమునఁ బ్రవృత్తులగుట అధర్మము కాఁజాలదు."

ఇది విని నవ్వుచు దేవగురువగు బృహస్పతి యిట్లనెను : "మనకిద్దరకేమిజోడు ? నీకొక కన్ను నాకు రెండు కన్నులాయెను. పోరాడదలఁచినచో ఏక కన్నులవారితో నెవరితో నైనను బోరాడుము. ఏకాక్షిని దర్శించుటయును నశుభమని చెప్పెదరు."

ఇది విని కుపితుడై శుక్రాచార్యుఁడిట్లనెను :- "కన్నుంతో నేమిపని ? యుద్ధము జరుగునది చేతులతో, చేతులు మనకిద్దరకును సమానముగఁ గలవు. నీవు సురపురోహితుఁడవు నే నసురపురోహితుఁడనైనను రెండు చేతులున్నవికదా.

బృహస్పతి యిట్లనెను :-"నేనెవరికిని దీసిపోవు వాఁడను గాను. కాదంటివా రమ్మునాతో." అని శుక్రాచార్యుల వారితోఁదల పడెను. ఇప్పుడు రెండు వైపులను దుముల యుద్ధము జరుగు చుండెను. నేఁడు పురోహితులిద్దరును బోరాడుటనుగాంచి దేవాసురు లిద్దరును బరమ విస్మితులైరి. ఇప్పుడందఱును వారికివారికి ప్రతి ద్వంద్వులెవరో వెదుకు కొనుచుండిరి. హేతియనునసురుఁడు జలాధి పతియును లోకపాలుఁడును నగువరుణునితోఁ దలపడెను. ఆతని సోదరుఁడగు బ్రహేతిమిత్రుఁ డను సూర్యునితో యుద్ధమునకు దిగెను. పరమ పరాక్రముఁడగు గాలనేమితో దండపాశ ధరుఁడగు యముఁడు ద్వంద్వ యుద్ధమొనర్చుచుండెను. శంబరాసురుని మీఁదకు విశ్వరూపుని తండ్రియగు త్వష్ట రణమున దుమికెను. సవితృఁడను సూర్యునితో విరోచనుఁడు తలపడెను, ధృతి అపరా జితునితో నముచి పోరాడుచుండెను. బలిచక్రవర్తికి బాణాసుర ప్రభృతులు నూర్గురు పుత్రులుండిరి. వారితో సూర్యుఁడు పోరాడు చుండెను. చంద్రునితోఁ బూర్వవైరమును స్మరించి శిరముఖండింప బడిన రాహువు యుద్ధము చేయుచుండెను. ఇంద్రుని మామయగు బులోమునితో వాయుదేవుఁడు యుద్ధ మొనర్చుచుండెను. భద్రకాళి శుంభ నిశుంభులతో యుద్ధము చేయుచుండెను. మహాదేవుఁడు జంభా సురుని తోడను, అగ్నిదేవుఁడు మహిషాసురుని తోడను, వాతాపి, యిల్వలను ప్రసిద్ధ దైత్యులు బ్రహ్మపుత్రుల తోడను బోరాడు చుండిరి.

ఇరు పక్షములలోని వీరులును గర్జించుచుండిరి. తర్జించు చుండిరి. ఒకరిమీఁద నొకరు ప్రహారములొనర్చుకొను చుండిరి. దుర్మర్షనితో మన్మథుఁడును ఉత్కలునితో మాతృగణమును, శనైశ్వరునితో నరకాసురుఁడును, నివాతకవచులతో మరుద్గణమును యుద్ధమొనర్చుచుండిరి. కలులతో వసుగణమును, పౌలోములతో విశ్వేదేవ గణమును, క్రోవశులతో రుద్రగణమును సంగ్రామ మొనర్చుచుండిరి. ఎన్నని చెప్పఁగలను ఎవరెవరి కెవరెవరను రూపులనుకొనిరో వారితో వాని కనురూపమైనవారే రణమొనర్చిరి, కొట్టుకొనుచుండిరి. గద్దించుకొనుచుండిరి.

ఇరుపక్షములలోని వీరులును హుంకారమొనర్చుచుండిరి. ఒకరొకరికిఁ గోపమును దెప్పించుచుండిరి. కటువాక్యములను బలుకుచుండిరి. ఖడ్గ, బాణ భల్ల, ముద్గరాదులను, నస్త్రశస్త్రములను నొకరొకరు విసరుకొనుచుండిరి. పెద్దపెద్ద శతఘ్నులను తుపాకులను బ్రయోగించుచుండిరి; ఆకాశమున విమానములపైఁ గూర్చుండి కొందఱు యుద్ధమొనర్చుచుండిరి. కొందఱు నేలపై యుద్ధమొనర్చుచుండిరి. కొందరశస్త్రశస్త్రములు లేకయే ఒకరొకరు కలియఁబడి పడవైచుకొనుచుండిరి. నలువైపులను చక్ర, గదా, ముష్టి, పట్టిశ, శక్తి, ఉల్మక, ప్రాస, వరశర్వధ, నిస్త్రింశ, భల్ల, ముద్గర, భిండిపాల, పరిఘాదులచేఁ బ్రహార మొనర్చుకొనుచుండిరి. ఆ సమయమున యుద్ధ క్షేత్రముయొక్క శోభ దర్శనీయముగనుండెను. అది యొక విశాల సముద్రమువలె గోచరించు చుండెను. వీరుల తలలు మత్స్యములవలెఁ దేలియాడుచుండెను. నలువైపులను రక్తము సము

ద్రమువలెనుండెను; అందులో ఖండిపఁబడిన కరులు మొసళ్ళవలెఁ గనబడెను. వీరుల బాహువులు జలసర్పములు తిరుగుచున్నట్లుండెను. కిరీటములందలి రత్నములు రక్తములో మెఱయుచుండెను. నలువైపుల నుండియును వీరుల శబ్దములు సముద్రము గర్జించుచున్నట్లుండెను. అచ్చట పేరునకుఁ గూడధూళిలేదు. రక్తము ధూళినంతను శోషింపఁజేసెను. నలువైపులను వస్త్ర, భూషణ, ధ్వజ, పతాక, వాహన, వీరులయంగములు తెగిపడియుండెను. తెగిన శిరస్సులు చాల కొట్టుచుండెను. దొఱలుచుండెను. చాలమంది కబంధులు చేతులలో ఖడ్గములను బట్టుకొని, శిరస్సు లేకయే యుద్ధము చేయుచుండెను. శత్రువులను సంహరించుచుండెను. కొందఱు ప్రతిపక్షులను గువాక్యములుపలికి క్రోధమును దెప్పించుచుండిరి. చాలమంది వీరులు విరోధుల చేతులలోఁ దెగి చచ్చుచుండిరి. కొందఱు క్షతవిక్షతులైనను రణక్షేత్రమునఁబడియుండిరి. కొందఱు రక్తమును బానము చేయుచుండిరి. అందఱును నొకరినొకరు పరాజితులనొనర్పఁదలఁచుచుండిరి. అందఱును విజయశ్రీని, జేపట్ట నుత్సహించుచుండిరి.

శ్రీశుకదేవుఁ డిట్లనెను :- "రాజా! ఈవిధముగ నాదేవాసుర సంగ్రామము మిక్కిలి ప్రయత్నముతో నారంభమయ్యెను. మహారాజా! వీరుల యుత్సాహము వేయిరెట్లు వృద్ధినిఁజెందెను. ఇద్దరును తామపరాజితులమనుకొనుచుండిరి. కావున యుద్ధమత్యంత భీషణరూపమును ధరించెను."

..........

# ఇంద్రునితో బలి మాయాయుద్ధము

శ్లో॥ ఏవం దైతైర్మహా మాయై రలక్ష్యగతి భీషణైః !
సృజ్యమానాసు మాయాసు విషేదుః సురసైనికాః॥
శ్రీభాగ. ౮ స్కం. ౧౦ అ. ౬ శ్లో

క॥ ఆ యసురేంద్రుని బహుతర
మాయా జాలంబులకును మాఱుఁగక వ
జ్రాయుధ ముఖరాదిత్యు ల
పాయంబును బొంది చిక్కువడిరి నరేంద్రా ॥
శ్రీమదాంధ్ర భాగవతము.

జీవి ధర్మము నిర్బలమైనదని మాయ నెప్పుడాశ్రయించునో అప్పుడు వానికిఁ బరాజయము కలుగును. మాయావియైన వానినిఁ బ్రబలమాయావియే జయింపవలయును. కాని యెవడేకైక భగవానునే యాశ్రయించినాఁడో వానిని మాయ యేమియును జేయఁజాలదు. ఏలయినఁగా శ్రీహరి సమస్త మాయలకును బతి. భగవంతుని శరణమునకుఁ బోయినచో సమస్త మాయలును వ్యర్థములగును. మాయాప్రభావము క్షణకాలము సఫలముగ గోచరించును. కాని చివరకది విఫలమగును. ఏలయనఁగా మాయాశక్తి స్థిరమైనది కాదు. స్థిరత్వము భగవానుని యందే కలదు. భగవద్భక్తియే స్థాయియైనది. భక్తునిబలమే నిలుచునది, ఆసురీ మాయ నశ్వరమైనది.

శ్రీశుకదేవు డిట్లనెను :- రాజా! అందఱును దమతమ ప్రతిద్వంద్వుల నెన్నుకొనిన మీఁదట వారిలో వారికి ఘన ఘోర యుద్ధము రోమహర్షణము జరిగెను. అది యుద్ధము కాదు. ఆ సమయమునఁ బ్రళయకాలము వచ్చినట్లుండెను.

బలి చక్రవర్తి పది బాణములను గొట్టి దేవేంద్రుని గాయ పఱచెను. మూఁడు బాణములను నాతని వాహనమగు నైరావతము వీపునకుఁ గొట్టెను. నాలుగు బాణములచే నాయైరావతము నాలుగు వైపుల నున్న రక్షకులను గొట్టెను, ఒకదానిచే మావటి వానిని గాయపఱచెను. ఈ విధముగఁ బది, మూఁడు, పదమూఁడు, పదు మూఁడు నాలుగు పదునేఁడు, తరువాత నొకటి పదునెనిమిది బాణ ములు కొట్టెను.

ఇది విని నవ్వుచు శౌనకుఁ డిట్లనెను :- "సూతా! ఆబాణ ములను యుద్ధములోఁ గూర్చుండి లెక్కించిన వారెవరు?"

అంత సూతుఁ డిట్లనెను :- "స్వామీ! లెక్కింపవలసిన యావశ్యకత యేమున్నది? మా గురుదేవుని గురువగు వ్యాస మహర్షి సమాధిద్వారా సమస్తమును బ్రత్యక్షమొనర్చుకొని వ్రాసెను. దివ్యదృష్టిద్వారా భూతభవిష్య ద్వర్తమానముల నన్నిటి నెఱుఁగ వచ్చును."

శౌనకుఁ డిట్లనెను :- "అయితే తరువాతనేమైనది? ఆ బాణ ములచే దేవేంద్రుఁడు వ్యథితుఁడైనాఁడా?"

సూతుఁ డిట్లనెను :- "లేదుస్వామీ! దేవేంద్రుఁడు నవ్వుచు లీలగా నా బాణములను ఖండించెను. నా గురుదేవుఁడు పరీక్షిన్మహా రాజునకు దేవేంద్ర బలిచక్రవర్తుల యుద్ధమును విశదముగ వర్ణించుచు నిట్లు చెప్పెను. బలి బాణములు వ్యర్థములుకాఁగా నాతఁ డింద్రునిపై నొక బలవతియగు శక్తిని విసరెను. కాని శతశత్రువు వెంటనే ఆతఁడు వదలుటకు పూర్వమే దానిని ఖండించెను.

అస్త్ర శస్త్రములచే నింద్రుని జయింపఁజాలమని బలి చక్ర వర్తి తెలిసికొని వెంటనే అంతర్ధాన మయ్యెను. అంతర్ధానుఁడై యాతఁడు భయమును గలిగించు నసురమాయ నాశ్రయించెను. మాయ అనేక వస్తువులను నిర్మించి దేవతలసేనను వ్యథిత మొన ర్చెను. ఆకాశమునుండి దడదడ తడతడ శబ్దములు రాఁజొచ్చెను. గొప్పగొప్ప బండలు దేవసేనపైఁ బడఁజొచ్చెను. పర్వత శిఖర ములు పడి, సురసైన్యము నలిగి నలిగిపోయెను. దావాగ్నిచే నచ్చటి వృక్షములు తగులబడసాగెను. కత్తెరరాళ్ళుందఱ పొట్టలపైఁ బడు చుండెను. పెద్దపెద్ద సర్పములును, తేళ్ళును బైనుండి పడి సైనికు లను గరచుచు, మ్రింగుచుండెను. పెద్దపెద్ద వ్యాఘ్రములు పై నుండి పడి నోరులను దెరచుకొని సేనలోని యేనుఁగులను భయ పెట్టసాగెను. మిక్కిలి భయంకరా కారముగల రాక్షసులు తలలు విరియఁబోసికొని, చేతిలోఁ త్రికూటములను ధరించి మొండి మొల లతోఁ బైనుండిదిగి రణభూమియందు 'కొట్టుడు కోయుఁడు' అనీ వల్కుచు విహరించుచుండెను. అవి క్రోధముతో నిండియుండెను. దంతములను బటపటఁ గొరుకుచుండెను. దేవతలను భయపెట్టు

చుండెను. కర్కశవాక్కులతో నరచుచుండెను. ఇంతలోనే ఆకాశ మునుండి అగ్నివర్షము కురియుచుండెను. మెఱపులు మెఱయ సాగెను. భీభత్సముగ దామినీ వెలుఁగుచుండెను. దేవసేనలో నగ్ని యుత్పన్నమై సైనికులను, సామగ్రులను స్వాహా చేయసాగెను. భీభత్సవాయువు వీవఁదొడంగెను. ఒక్కొకప్పుడుత్తాల తరంగములు లాకాశము నంటునంతటివిగ నుండిన నపారసాగరము కనబడెను. నలువైపులను హాహాకారములు వ్యాపించెను. సుర సైనికులు ధైర్యములను వీడిరి. మాయా ప్రభావముచే సమస్తమైనవారును దుఃఖితులై తోహి తోహి యనుచుండిరి.

ఇప్పుడు దేవేంద్రుడును జింతితుఁడయ్యెను. వారికి మాయా నాశనమున కుపాయము తోఁచలేదు. వారికి విపత్తుపడఁగానే విపద్విభంజనుఁడగు శ్రీహరి స్మరణమునకు వచ్చెను. వారు నీనులై విశ్వభావనుఁడగు భగవానుని ధ్యానింప సాగిరి. వారార్తస్వరమున నిట్లనిరి :- ప్రభూ ! మాకు విపత్తులు సంభవించినప్పుడు నీవు వచ్చి మమ్ములను రక్షించితివి. మమ్ముల నసురులు స్వర్గభ్రష్టులను గావించిరి. అప్పుడు మాకు సముద్రమంథనము చేయుఁడని ఆజ్ఞాపించితిరి. మీరే మాకు నచ్చఁజెప్పి యుక్తులను నేర్పి అసురుల కడకు బంపితిరి. వారలు మామాటనువినునట్లుగ వారి బుద్ధులను మార్చితిరి. మేము మందర పర్వతమును దెచ్చుచు నలసిపోయి నప్పుడు మీరు గరుడుని మూఁపుపై మంథరమునెత్తి క్షీరసాగరమునకుఁ దెప్పించితిరి. క్షతవిక్షతులగు సురులను స్వస్థులఁ గావించితిరి. సర్పముఖ జ్వాలలనుండి రక్షించుటకై యుక్తిగా మాకుతోక

వైపుబట్టుకొనునట్లొనర్చితిరి. మునుఁగనున్న మందరమును గూర్మావతార మెత్తి రక్షించితిరి. మందరముపైన గూర్చుండి, పైనుండివారిని గసరుచు వాసుకికి నిద్రారూపమునఁ బ్రవేశించితిరి. దేవాసురలందు శక్తివై బలప్రదానమును గావించితిరి. ఇంత చేసినను నమృతోత్పాదనము కాకపోఁగా నీ చతుర్భుజములచే స్వయముగ సముద్రమును మథింపసాగితివి. మిక్కిలి యుక్తిగా దానినుండి పుట్టిన రత్నముల నిరుపక్షముల వారికినిఁ బంచి సంతుష్టులను గావించుచుఁ బంచితివి. చివరకమృతోత్పాదనమైన మీఁదట, దుష్టదానవులు నీ యంశావతారమగు ధన్వంతరి చేతినుండి అమృతకలశమును గైకొని పారిపోఁగా నప్పుడు మోహినీయవతారమును ధరించి వారి నుండి అమృతమును లాగుకొంటివి. పిపాసులమగు మాకమృతమునుబోసితివి. పండితమ్మన్యుల మనుకొను యసురులను మోహింపజేసి మూరుల నొనర్చితివి. ఇప్పుడీ యుద్ధమున మాయావులగు నసురులు మమ్ములను మోహమునఁ బడవైచిరి. మాయాపతీ మమ్ములనీ యాసురీ మాయనుండి రక్షింపుఁడు. నీయాశ్రిత భక్తులను శీఘ్రముగ వచ్చి రక్షింపుఁడు. ప్రభూ ? ఇది వఱకు సర్వత్ర రక్షించి నట్లే యా యవసరమునను నన్ను రక్షింపుఁడు."

శ్రీశుక దేవుఁడిట్లనెను :- "రాజా ? దేవతలీవిధముగ దీనులై ఆర్తస్వరమున నాయా త్రిహరుఁడరు నచ్యుతుని స్తుతింపఁగా శరణాగత వత్సలుఁడగు భగవంతుఁడా సమయమునఁ బ్రత్యక్షమయ్యెను. ఆసమయమున భగవానుని శోభ అద్భుతముగ నుండెను. ఈ నమయమున నాతఁడష్ట భుజములను ధరించియుండెను. నవ పద్మ

దళాయ తీక్ష్ణుఁడగు వాసుదేవ భగవానుఁడు తనసుంతర సుకమల విశ్వమదిత చరణకములను గరుడుని మూఁపుపై నుండెను. ఆతని శోభ ఆకథనీయముగ నుండెను. కర్ణములందు బహుమూల్యములగు రత్నశోభిత కనకకుండలములు కదలుచుండెను. వక్షఃస్థలమందు లక్ష్మీదేవియును గౌస్తుభమణియును వివిధ మణిమయహారములును శోభించుచుండెను. భగవానుడు వెంటనే ప్రత్యక్షమగుటచే దుఃఖితు లగు దేవతల హృదయములు మరల పచ్చఁబడెను వారికి మంచి యాధారము చిక్కెను. వారిప్పుడు సురక్షితులమనుకొనుచుండిరి.

......

## అసురమాయానాశము-అసుర వినాశము

శ్లో॥ తస్మిన్ ప్రవిష్టేఽసురకూటకర్మజా
మాయావినేశురుక్మహినా మహీయసః।
స్వప్నో యథాహిప్రతిబోధ ఆగతే
హరిస్మృతిః సర్వవిపద్విమోక్షణమ్॥

శ్రీభాగ. ౮ స్కం. ౧౧. అ. ౫౫ శ్లో॥

చ॥ అసురుల మాయలన్నియును నబ్జదళాక్షుఁడు వచ్చినంతటన్
గసిబిసియై నిరర్థమయి గ్రక్కునఁబోయెను నిద్రనొందినం
తసమున మేలుకొన్న గతిఁదాల్చి చెలంగిరి వేల్పులందఱుం
బన సెడ కేల యుండు హరిపాద పరిష్కృతి సేయ
నాపదల్ ॥

శ్రీమదాంధ్ర భాగవతము

శరీరము ధరించిన తరువాత సుఖమును గలుగును దుఃఖమును గలుగును. శరీర ధారులకెన్నడును సుఖము సుఖము కాఁబోదు. దుఃఖము దుఃఖమును గాదు. ఈ దేహము ప్రారబ్ధముచేఁ ప్రాప్తించును. సుఖదుఃఖములు ప్రారబ్ధాధీనములు. నిప్పుడెట్టి కాలము సంభవించునో అప్పుడట్టి ఘటనము కలుగును. జ్ఞానులు సుఖదుఃఖముల రెండింటిని దీనదయాళుఁ డొసంగినవేయని యధికముగ దుఃఖింపరు సుఖములందుబ్బి పొంగిపోరు. సుఖములు వచ్చుచుండును బోవుచుండును. దుఃఖములు వచ్చుచుండును. అవియును నొకానొక దినమున నంతముకాఁగలవు. సదా ఐశ్వర్యోపభోగమును చేసినవాఁడు లేఁడు. దేవతలును నప్పుడప్పుడు స్వర్గమును వదలవలసి వచ్చును. ఇంద్రుడైనను దానిసమయము వచ్చినపుడింద్రాసనమును దిగవలసి వచ్చును. ఒక్కొక్కప్పుడు దైత్యులును స్వర్గమునకు ప్రభువులగుదురు. వారును నొక్కొకప్పుడు త్రిలోకములను శాసించెదరు. రాజగుటయును, శాసన సూత్రమును జేతిలోనికిఁ గొనుటయును, యుద్ధమున విజయమును బొందుటయును, విషయ

భోగములను ప్రచురముగ గూర్చుకొనుటయును నివి యున్నతికి లక్షణములు కావు. వీని నసురులును సమకూర్చుకొందురు. ఇంతే కాదు సురలకంటె నసురులే యింద్రియ సుఖోపభోగముల నెక్కుడుగ జేయుచుందురు. వీరు తమ శరీరమును శాశ్వతముగ బోషించుకొనుటకు బ్రయత్నించుచుందురు. పరపీడన మొనర్చి, తనయింద్రియములను సుఖముగ నుంచుకొనుటయును, ప్రాణము లందు రమించుటకే ఆసురీ భావమనిపేరు. సుఖదుఃఖములందు సర్వత్ర శ్రీహరిని స్మరించుటయే ఉన్నతి. సుఖమువచ్చినపుడు దానినిగూడ సర్వేశ్వరునకు సమర్పించుటయును, దుఃఖము వచ్చినపుడును నాతనినే చింతించుటయును మంచిది. సారాంశమేమనగా సర్వత్ర సర్వకాలములందును సర్వభావములతో శ్రీహరిని హృదయమున ధరించుటయే సుఖము. అదియే సర్వశ్రేష్ఠ సాధనము. ఇదియే జీవనమునకు సార్థకత.

శ్రీశుకదేవుడు పరీక్షిన్మహారాజుతో నిట్లనెను :- "రాజా ! ఇంద్రాది దేవతలు బలియొక్క ఆసురీమాయకు భయపడి శ్రీహరిని స్మరించిరి. అప్పుడు భక్తవత్సలుడగు భగవానుడచ్చట ప్రకటమయ్యెను. భగవానుడు ప్రత్యక్షము కాగానే ఆసురీమాయ సూర్యోదయము కాగానే అంధకారము నశించినట్లును, రవి యుదయింపగనే నీహారము మటుమాయమైనట్లును, జ్ఞానోదయము కాగానే అజ్ఞానము నశించినట్లును, జ్ఞానోదయము కాగానే అజ్ఞానము నశించినట్లును, భక్తి యుదయింపగానే దుఃఖ శోకములు నశించినట్లు సురీమాయనశించెను. భగద్దర్శనముచే దేవతలు పరమప్రసన్నులైరి. ఇప్పుడువారు తమ దుఃఖములు పోయెననుకొనిరి.

దేవతల పక్షము వహించుటకు శ్రీహరి వచ్చినాఁడని తెలిసి కొని దైత్యులాతనిపైఁ గూడ ప్రహారమొనర్పఁ జొచ్చిరి. కాలనేమి యను మహాబలవంతుఁడగు దైత్యుఁడు తపస్సుచే ననేక వరములను బొందియుండెను. ఆతఁడెల్లప్పుడును దనేక విజయమనుకొనుచుం డును. ఆతఁడు ముందుకు వచ్చి శ్రీహరి నెదుర్కొనెను. ఆతఁడు సింహవాహనుఁడై తర్జన గర్జన లొనర్చుచు, సింహమునురికించుచు నాతఁడు చేతిలోఁ ద్రిశూలమును దీసికొని గరుడవాహనుఁడగు భగ వానుని మీఁదకురికెను. భగవానునకు యుద్ధముకొఱకై చేతులకు జిలపుట్టుచుండెను. ఆతఁడు తనయస్త్రములచే నాదైత్యులను జంపి వారికి తపఃఫలము నొసంగవలసి యుండెను. ఏ భాగ్యశాలురగు దైత్యులు వైరభావముతో భగవంతుని భజించిరో, శత్రుత్వముతో నెవరు భక్తి యొనర్చిరో వారిని శ్రీహరి తన శస్త్రముచేఁజంపి సద్గతి నొందించును. ఈ కాలనేమియును భగవంతునెడల వైర భక్తినిఁ జేయుచుండెను. ఆతఁడు మిక్కిలి బలముకొలఁది భగ వంతుని వాహనమగు గరుడుని మస్తకముపైఁ ద్రిప్పి త్రిశూలమును విసరెను. ఆ త్రిశూలము వచ్చుటను గ్రహించి పరమచతురుఁడును రణ ప్రవీణుఁడునగు విష్ణుమూర్తి పండునుబట్టుకొని లీలగా మధ్య లోనే ఆ త్రిశూలమును నవ్వుచుఁబట్టుకొని యిట్లనెను:- "వీరవరా! ఇప్పుడు చెప్పుమేమిచేసెదవో ?"

తన యస్త్రము వ్యర్థమగుటనుగాంచి యాయసురుఁడు త్రిదోష మందు మానవుఁడు వాగునట్లు వాగదొడంగెను. ఆతఁడు కాళ్ళు చేతులను గొట్టుకొనుచుండెను భగవంతునిపైఁ బ్రహార మొనర్చు చుండెను. భగవాను డదే త్రిశూలమును గట్టిగాఁ గొట్టఁగా నా దై

త్యుఁడు తనవాహననుగు నాసింహముతోఁ గూడ నేలపైఁబడి చచ్చెను. రాజా! ఈ కాలనేమియే భగవానునితో విరోధించి చివరకు గంసుఁడయ్యెను. చివరకాతఁడు భగవంతునిచేఁ జచ్చి ముక్తుఁడయ్యెను.

ఇది విని శౌనకుఁ డిట్లనెను :- "సూతా! కాలనేమి యసురుఁడు కదా ఆతఁడు నిశుద్ధక్షత్రియుఁడగు నుగ్రసేనునకెట్లు జన్మించెను?"

సూతుఁడిట్లనెను :-"స్వామీ! ఇది చాల పెద్దకథ. దీనిని నేను మరలఁ జెప్పెదను. ఇప్పుడు మీరు దేవాసుర సంగ్రామ విషయమును వినుఁడు."

శౌనకుఁ డిట్లనెను :- "మంచిది, తర్వాతనేమైనది?"

సూతుఁ డిట్లనెను :- "మా గురుదేవుఁడు పరీక్షిన్మహారాజుతో నిట్లుచెప్పుచున్నాఁడు! "రాజా కాలనేమి దైత్యుఁడు మరణింపఁగానే పగతీర్చుకొనుటకై అత్యంత ప్రాచీనులు విశ్వవిజయులగు నసురులు మాలి, సుమాలి, మాల్యవంతులను ముగ్గురును భగవానునితోఁబోర నేతెంచిరి. భగవానుఁడు మొదట నవ్వుచు నవ్వుచు లీలతో యుద్ధమొనర్చెను. దీనిచే నసురుల కుత్సాహ మినుమడించెను. చివరకు శ్రీహరి తనతీక్ష్ణ చక్రముచే మాలి, సుమాలులను ఫలపుష్ప సమన్వితమై ఫలించిన పైరును గోసినట్లు వారి శిరస్సులంటఁ గోసివైచెను. మాలియును, సుమాలియును మరణిం

పఁగా మాల్యవంతుఁడు భగవానునితోఁ బోరవచ్చెను. ఆతఁడును నాతనిసోదరులు పట్టిన త్రోవనే పట్టెను. ఈ నల్గురు దైత్యులును మరణింపఁగా నసురసేనయందాహాకారములు చెలరేగెను. దేవతలు యుత్సాహమినుమడించెను. అసురమాయచే మోహితులయి యచేత నులుగఁ బడియుండిన వారు హరిల ప్రభు ప్రతాపముచే సచేతను లైరి. వారుమరల నసురసేనను సంహరింపఁ జొచ్చిరి. రణములోఁ దమ ప్రతిపక్షులను బడఁగొట్టుచుండిరి. సింహనాద మొనర్చుచు నుత్సాహవంతులై అరవఁజొచ్చిరి.

ఇప్పుడు శచీపతియగు నింద్రుఁడు పరమోత్సాహితుడయ్యెను వారిరక్తమందు నవజీవనము మరల సంచరించుచుండెను. ఆతఁడు తన దివ్య వజ్రమును గైకొని బలినిఁ జంపుటకుఁ బరువిడెను. బలి చక్రవర్తి తనయెదుటనే నిలుచుండి యుండెను. ఆతఁడు గొప్ప శూరవీరుఁడు, మనస్వి, తేజస్వి, పరమజ్ఞాని, ఇంద్రుఁడు ప్రహరించుటను గాంచి యాతఁడు తనస్థానమునుండి కదలను లేదు మెదలను లేదు. అదే విధముగ సుమేరువువలె నచలభావముతో నిలుచుండెను. బలి యీ విధముగ నిశ్చలముగను నిర్భయముగను నిలువఁబడియుండుటను గాంచి దేవేంద్రు డాతని యుత్సాహమును భంగ మొనర్చుటకై అత్యంత తిరస్కారముతో నాతని గద్దించుచు నిట్లనెను. "ఓరీ! మూఢా! నీవు మాయనొనర్చి నన్నును మాయేశునిగ మోహింపఁ జూచుచున్నావు. మాయావి యగు నటుఁడు మూర్ఖులదృష్టినిఁ గట్టి నానాప్రకారములగు విచిత్రమగు ఖేలనము

లొనర్చుచు మోసగించునట్లు నీ వాసురీ మాయచే మమ్ములను వంచింపఁ జూచుచున్నావు. మేము నీమాయలోఁ బడజాలము. మాయద్వారా నేను త్రిలోకములను జయింపగలనని నీవనుకొని యుండవచ్చును. స్వర్గస్వామివై మోక్షమును బొందఁగోరుచున్నావు ఇది నీ భ్రమ, అజ్ఞానము, మూర్ఖత, దుర్లభమనోరథము, నేను నీ భ్రమను నివారించెదను. నీకన్నులను దెఱపించెదను. నీవు చేసిన దానికి ఫలమనుభవింపఁ జేసెదను. నీమనోరథము నసంభవము కావించెదను. నేఁడు నిన్ను యుద్ధములో జయింపనీయను. నీమాయ నంతను వ్యర్థము కావించి, నీ బంధువులకును బాంధవులకును సైని కులకును యమపురమందిర ద్వారమును జూపించెదను. నీశిరస్సును ఛేదించెదను. నూఱంచులు గల నావజ్రముచే నీశిరస్సును ఖండించి బంతివలెఁ బైకెగుర వైచెదను."

ఇదివిని పరమజ్ఞానియగు బలియిట్లనెను :- "ఇంద్రా ! నీవు సహస్రాక్షుఁడవయ్యును నంధుఁడవే. ఎవరెవరినిఁ జంపగలరయ్యా! ఎవరెవరినిఁ బరాజితులొనర్పఁ గలరు ? ఇదంతయును గాలప్రేరణ ముచే జరుగును. మాకు కాలమనుకూల మగుచో నిన్ను స్వర్గము నుండి బడవైచెదము. పరాజితు నొనర్చెదము. కాలము మాకు ప్రతికూలమైనపుడు మేమోడి పోవుదుము. రెండు పక్షములు పోరాడును, ఒకసారి ఒకరికిని మఱియొకసారి యింకొకరికిని విజ యము ప్రాప్తించును. నీ వంటి మూర్ఖులీ విజయము నీ పురుషార్థము వలన లభించిన దనుకొనుచుందురు. నీ బలముచేఁ బరపక్షమును బరాజిత మొనరించితిననుకొందువు. నీవంటి మూర్ఖుఁడును, బిచ్చి

వాఁడును స్వాత్మోత్కర్షను జేసికొనుచుఁ బ్రలాపించుచుందురు. దీనికి నాకు హర్షశోకములు లేవు. అన్నియును గాలకృతములని నేనను కొనుచుందును. రమ్ము తలపడుము. ఎవరికికాలమనుకూలమో వారికి విజయశ్రీ లభింపఁగలదు. జయము వారి కంఠముననే విజయమాలను వేయఁగలదు."

శ్రీశుక దేవుఁడిట్లనెను :- "రాజా ! ఈ విధముగ బలియును బలారియగు నింద్రుఁడును దిరస్కార మొనర్చుచు ఘనఘోర యుద్ధమొనర్ప సాగిరి.

.....

## దేవేంద్రుఁడు నముచిని వధించుట

శ్లో॥ జంభం శ్రుత్వా హతంతస్య జ్ఞాతయో నారదాదృషేః॥
నముచిశ్చ బలః పాకస్తత్రాపేతుస్త్వరాన్వితాః ॥
శ్రీభాగ. ౮ స్కం. ౧౧ అ. ౧౯ శ్లో॥

చ॥ చని సురనాథుచేఁగలన జంభుఁడు నచ్చుటనారదుండు సె
ప్పిన విని వాని భ్రాతలు గంభీర బలాధికుఁడా బలుండు పా
క నముచు లాపురందరునిఁ గాంచి ఖరోక్తులఁ దూలనాడు
చున్
ఘనబలధారలన్ నగముఁగప్పిన చాడ్పునఁ గప్పిరమ్ములన్॥
శ్రీమదాంధ్ర భాగవతము

భగవంతు డెవరికెంత శక్తిని బ్రసాదించునో వాఁడంతటి పౌరుషమును జూపఁగలఁడు. అసురులలోను, సురలలోను నాతని శక్తియే కలదు. ఆత డసురులను వృద్ధి చేయదలఁచుచో నసురులను బలవంతుల నొనర్చును. అప్పుడు వారు దేవతల నోడించెదరు. ఆతఁడు సురలను వృద్ధి నొందింపదలచినచో సురలకు శక్తిప్రదానము గావించును. ధర్మమును బలవత్తర మొనరింపఁదలఁచినచో నందఱను ధార్మికులుగ నొనర్చును. కృత, త్రేతాది యుగములు ప్రవృత్తిని జెందును. అధర్మవృద్ధి కావలసివచ్చినప్పుడు ధర్మమునకు నెమ్మది నెమ్మదిగ గ్లాని యేర్పడును. ధర్మము నిర్బలమైపోవును. అధర్మము ప్రబలును. కలియుగాదులు ప్రవృత్తిని జెందును. భగవంతుఁడీ ప్రపంచమునకుఁ బరుఁడు. ఈతని కేమియును గోరికలేదు. స్పృహలేదు. కేవలము లోకవల్లీల యొనర్చును.

శ్రీశుక దేవుఁడిట్లనెను :- "రాజా ! ఇంద్రునకును బలిచక్రవర్తికిని తుముల యుద్ధము జరిగెను. ఇవ్వుడు బలి ధనుర్బాణములను గైకొని, ఆకర్ణాంతములాగి యింద్రునిపైఁ బ్రయోగించెను. ఇట్లొకటి తరువాత నొకటి బాణములు వదలుచుండెను. ఇంద్రుని శరీరముమీఁద బాణములు ముద్దపడి శరీరముమీఁదనున్నట్లు గ్రుచ్చుకొనెను. శత్రుప్రహారముచేఁ గ్రుద్ధుఁడై దేవేంద్రుఁడంకుశముచేఁ గొట్టఁబడిన కరీంద్రమువలె వికలతను జెందెను. ఇప్పుడాతఁడు బలిమీఁద నెప్పుడును వ్యర్థముకాని దధీచి మహాముని

తేజోమయాస్త్రములచేఁ జేయఁబడిన తన వజ్రమును వదలెను. ఇంకే మున్నది. వజ్రము తగులఁగానే ఱెక్కలు తెగిన పర్వతమువలె దైత్యరాజగు బలి మూర్ఛితుఁడై నేలపైఁ బడిపోయెను.

బలి పడిపోఁగానే దైత్యసేనయందు సర్వత్రా హాహా కారములు వ్యాపించెను. బలికి అత్యంత ప్రియసఖుఁడగు జంభాసురుఁడీ సమాచారమును వినగానే నిర్ఘాంతపోయెను. వెంటనే సమరసామగ్రిచే సన్నద్ధుఁడై సురేంద్రునితో సమర మొనర్చుటకై సమరభూమికి బయలుదేరెను. గదనుగైకొని వాయువేగమునఁ దనవైపునకు వచ్చుచున్న జంభాసురుని గాంచి దేవేంద్రుఁడు సావధానుఁడయ్యెను. ఆ దుష్టదైత్యుఁడొక గొప్ప బలిసిన సింహముపై నెక్కియుండెను. ఐరావతమును దినుటకు నోరును దెఱచుకొని సింహమును, గదను త్రిప్పుచు వచ్చుచున్న దుర్మదుఁడగు దైత్యుని గాంచి దేవేంద్రుఁడేమాత్రమును జలింపలేదు. జంభాసురుఁడు రాఁగానే ఐరావతమును మస్తకముమీఁదనొక్క దెబ్బ కొట్టెను. ఆయాఘాతముచే నైరావతము విచలించెను. నోటి నుండి రక్తమును గ్రక్కసాగెను. అది ముందునకుఁ బోలేకుండెను. ఆ సమయమున నింద్రునియొక్క చతురసారథియగు మాతలి సహస్రాశ్వములు కలదియును, సువర్ణమండితమైనదగు దివ్య రథమును గైకొని వెంటనే అచ్చటికి వచ్చెను. కింకిణుల యొక్క గణగణ శబ్దములును, రథముయొక్క ఢణఢణ శబ్దములను విని శచీపతి పరమ సంతోషమును జెందెను. దగ్గఱకు రాఁగానే ఆతఁ డైరావతమును వీడి వెంటనే రథముపైఁ గూర్చుండెను. దీనిని గాంచి జంభా

సురుఁడు మిక్కిలి సంతసించెను. ఆతఁడు మాతలినిఁ బ్రశంసించుచు నిట్లనెను :- "మాతలీ ! నీవు నిజముగ స్వామిభక్తుఁడగు సారథివి. నీవు సమయము నెఱింగినవాడవు సమయమును బోనాడని ప్రత్యుత్పన్నమతియగు రథవాహకుఁడవు. సారథి యిట్లే యుండవలెను. ఆతఁడెల్లప్పుడును స్వామి హితమందే తత్పరుఁడై యుండవలయును. ధన్యవాదములు, ధన్యవాదములు, మంచిది, నీవును బ్రసాదమును గైకొనుము. నీవును యమపురయాత్రను జేయుము. అంత్యకాలమున స్వామి ఋణమును దీర్చుకొనుము." అని పలికి ఆతఁడు యుద్ధక్షేత్రమున నవ్వుచు నొక జాజ్వల్యమానమగుఁ ద్రిశూలమును వానిపైఁ బ్రయోగించెను. త్రిశూలము తగులఁగానే మాతలి యచేతనుఁడయ్యెను. కాని యాతఁడు గుఱ్ఱములనుగాని రశ్మలనుగాని వదలలేదుగాని చేతిలోని కొఱడాను జారవిడిచి, క్షణములో ధైర్యమును ధరించి మిక్కిలి కష్టముతో నాతఁడా త్రిశూలముయొక్క అసహ్యబాధను సహించెను.

తన సారధి దుఃఖితుఁడును, బీడితుఁడగుటను గాంచి ఇంద్రుని క్రోధమునకు మేఱలేకుండెను ఇప్పు డాతఁ డీ దుష్టునిపై నన్య సాధారణ బాణములను వదలక అమోఘమగు వజ్రమును బ్రయోగించెను. ముందునకుఁబోయి రథముమీఁద నుండియే దేవేంద్రుఁడు వాని శిరమునకు గుఱిపెట్టి వజ్రమును బ్రయోగింపఁగానే వానిశిరము తెగి తటుక్కున నేలపైఁబడెను. అసురుఁడు చావఁగానే సిద్ధులును గంధర్వులును సాధు సాధువని పలికిరి. ఇంద్రునిపైఁ బుష్పవృష్టి కురిసెను.

క్షణకాలములో నీ సమాచారము దైత్యసేనలో వ్యాపించెను దేవర్షియగు నారదుఁడును నాకాశమున నిలుచుండి యుద్ధానందమును జూఁచుచుండెను. జంభాసురుఁడు మరణింపఁగానే ఇంకే యసురునకును దేవేంద్రునితోఁబోర సాహసము లేక పోయెను. 'అయ్యో! అప్పుడే ఆట ముగింపఁబోవుచున్నట్లున్నదే యనుకొని నారద మహర్షి గబ గబ పరువిడి, పరమ పరాక్రమ వంతుఁడును, తపస్వియును, తేజస్వియును, దేవతల పీచమడిచిన వాఁడును నగు నముచి కడఁకుబోయెను. నముచి ఘోర తపంబొనర్చి తాను శుష్కమైన వస్తువుచేఁగాని, తడిసిన వస్తువుచేఁగాని చావఁగూడదను వరము బొందియుండెను. దీనివలననాతఁడు తన్నజరామరునిఁగ దలఁచుకొనుచుండెను. వాని పేరును జెప్పిన దేవతలు గడగడలాడుచుండిరి. త్రిలోకములందును నాతని బలమునకు విఖ్యాతి కలదు. దేవర్షియగు నారదుఁ డాతనితో నిట్లనెను :-"అసుర శిరోమణియగు నముచీ! పరమ పరాక్రమ వంతుఁడును నీకు సోదరుఁడునగు జంభుని నింద్రుఁడు చంపిన సంగతి నీకు దెలియదా యేమి ?"

నారదుని నోట తన సోదరుఁడగు జంభుఁడు చచ్చుటను విని పరమ క్రుద్ధుఁడై ఆతఁడు బలములను నస్త్రములను దీసికొని అత్యంత శీఘ్రముగ సురేంద్రునితోఁ బోర సమర భూమికిఁబోయెను. వచ్చి యాతఁడిట్లనెను :- "ఓరీ దుర్బుద్ధీ దేవేంద్రా! నీకు మిక్కిలి యహంకారము ప్రబలినది. నీ యహంకారము నణఁచెదను. నీ వొనర్చిన యకృత్యములకు ఫలము ననుభవింపఁ జేసెదను. ఇప్పుడు నీవు సావధానుడవై చచ్చుటకు సిద్ధపడుము" ఇట్లాతఁడు

నిర్లక్ష్యముగ నసంఖ్యాకములగు బాణములను దన సోదరులతోఁ గూడి వర్షముగఁ గురిపించెను. అది ఘన ఘోరమగు మేఘము పర్వతముపై వర్షమును వర్షించుచున్నట్లుండెను. మునుముందుగా బలుఁడను దైత్యుఁడొక్కసారిగా సహస్ర సాయకములను సంధించి యింద్రుని రథమునకుఁ గట్టిన సాహస్రాశ్వములను నొప్పించెను. పాకుఁడను దైత్యుఁడు నూరు బాణములను సంధించి ఇంద్రుని సారథిని గాయపఱచెను. రథమును బాణములచేఁ గప్పివైచెను. ఈ విధముగ నలువైపులనుండియును రథము దెబ్బతినఁగా స్వయముగ నముచి సువర్ణపక్షములుగల పదునైదు బాణములను గొట్టి వజ్రపాణియగు దేవేంద్రుని నొప్పించెను. ఈ విధముగ నింద్ర సారథిని రథమును సాంగోపాంగముగ వేధించి, ఇంద్రుని బాది, ఆదుష్టదైత్యుఁడు జలభరితములగు మేఘములవలె భయంకరనాదము నొనర్చి గర్జించెను. ఇంద్రుఁడు బాణములచే నలువైపులను వర్షాకాలములో సూర్యుఁడు మేఘములచేఁ గప్పఁబడినట్లు కప్పఁబడెను.

ఇంద్రుఁ డీవిధముగా బాణములచేఁ గప్పఁబడఁగా దైత్యులు దేవసేనపైఁ బ్రహార మొనర్చుచుండిరి. దైత్యుల ప్రహారములను సహింపఁజాలక దేవతలయొక్క పరాజితసేన రణరంగమును వీడి పారిపోయిరి. అచ్చట వరుణ, కుబేర, సూర్య, చంద్రాదులును, నితరలోకపాలురును, వసు, ఆదిత్య, మరుద్గణాదులుండిరి. కాని అందరకు నధినాయకుఁడగు దేవేంద్రుఁడు మాత్రము కనఁబడుట లేదు. అప్పుడు దేవతల ధైర్యము జారిపోయెను. యూథపతి లేక యూథములోనున్నవారు దుఃఖితులగున్నట్లు నాయక హీనులై దేవ

కలు దుఃఖితులైరి. సముద్రములో నౌక పగిలిపోగా వ్యాపారులును వారియనుచరులును కుయ్యోమొఱ్ఱో యనుచు శోకాకులులైనట్లు దేవేం ద్రుఁడు లేక దేవతలు దుఃఖితులైరి. కొలఁది క్షణములలో మూర్ఛా భంగముకాఁగా దేవేంద్రుఁడు తన శక్తిచే నా శరపంజరమును జించి కుహరమును వెలువడి సూర్యుఁడు వెలువడినట్లును, బోనునుండి సింహము బయలువెడలి వచ్చినట్లును వెలువడెను. ఆతని రథము యథాప్రకారముగనుండెను. సారథి, అశ్వములు, ధ్వజము, రక్ష కులు మొత్తమందఱును సురక్షితముగ నుండిరి. దైత్యప్రహారముచే క్షతవిక్షతమగు దేవసేన నటునిటు పాఱిపోవుటను నాతఁడు గాంచెను. అసురులు పాఱిపోవుచుండిన సేన నెదుర్కొనుచుండిరి. అప్పుడాతనికి మిక్కిలి క్రోధము కలిగెను. ఆతఁడు వజ్రమును దీసికొని శత్రుసేనపై విఱుచుకొని పడి వారిని సంహరింపసాగెను. సమ్ముఖమున నాతనికి బల, పాక, నముచ మొదలగువారు యుద్ధ మొనర్చుటను గాంచెను. ఒక్క వజ్రపాతముచే నాతఁడు బల, పాకులను నేలఁబడగొట్టెను. ఇద్దరి యొక్క ప్రాణ పతంగములు వారి శరీరరూపములగు పంజరములను వదలి యెగిరిపోయెను. ఆ యిద్దరును జచ్చుటను గాంచి కొందఱింకను దుమికిరి. వారిని గూడ కూల్చి ప్రోవులు పెట్టెను. కొందఱు పాఱిపోయిరి. కొందఱస్త్ర శస్త్రప్రయోగ మొనర్చి యచ్చటనే పడిపోయిరి. మహావీరుఁడగు నముచి పాఱిపోవువారికి ధైర్యమును జెప్పుచు, ధర్మములుపలికి, స్వయ ముగ గదనుబట్టుకొని ఘోరాదుటా కింద్రుని సమ్ముఖమునకు వచ్చెను.

తన సోదరులగు బలపాకులు మరణింపఁగా నముచి అత్యంత క్షుభితుఁడయ్యెను. ఆతఁ డసహిష్ణుతతోడను, శోక రోషముల తోడను మిక్కిలి వేగముతోడను నింద్రునిఁగొట్టుచు-చెను. ఆ సమయమున నాతఁడు ప్రళయానలమువలెఁ దోఁచుచుండెను. చేతిలో నాతఁడు సువర్ణ ఘటికల నలంకరించుకొనెను. త్రిశూలమును గైకొని ఆతఁ డింద్రునిఁజంపు సంకల్పముతో నాతనిపైకురికెను. "ఇంద్రా ! నీవు చచ్చితివిరా ! నీవు చేసిన దానికి ఫలము ననుభవింపుము." అని పలుకుచు నాతఁడు వేగముగ జాజ్వల్యమానమును, ప్రకాశమానమునగు త్రిశూలమును నింద్రుని మీఁదకు విసరెను. ఆ త్రిశూలము ప్రకాశముతో గ్రహమువలెఁ దనవైపునకు వచ్చుచుండుటను గాంచి దేవేంద్రుఁడొక దివ్యబాణమును సంధించి యా త్రిశూలమును మధ్యలోనే ముక్కలు ముక్కలు చేసివైచెను. ఇంకొక యస్త్రమును గ్రహించుట కవకాశ మొసంగకయే వజ్రముచే వానికంఠమునఁ బ్రహార మొనర్చెను. ఆ వజ్రము నముచి శరీరములోనికి దిగి మరల తిరిగి రాలేదు. దీని కింద్రుఁడు మిక్కిలి యాశ్చర్యమును జెందెను. ఈ వజ్రము తగులఁగానే నముచి చచ్చునని యింద్రునకు విశ్వాసము. కాని ఆతఁడు మరణించుట అటులుంచి వజ్రము వాని సప్తత్వచలలో నొక్క త్వచనైన ఖండింపఁజాలకపోయెను. దీనికి దేవేంద్రుఁడు పరమ విస్మితుఁడై యిట్లనుకొనెను:- "నేఁడీ వజ్రమునకేమి సంభవించినది? దీని తీక్ష్ణధార యసురుని శరీర సంసర్గముచే నేలకుంఠితమైనది. ఈ వజ్రము దధీచి మునియొక్క తపస్తేజముతోఁగూడిన అస్థులతోఁజేయఁబడినది.

విశ్వకర్మ దీనిని నిర్మాణము కావించెను. భగవంతుని శక్తి దీనిలో విశేషరూపమున వ్యాపించినది. ఇది గొప్పగొప్ప శూరమ్మన్యులను, ప్రబల పరాక్రమవంతులను, విశ్వవిజయులునగు దైత్యులను వధించినది. వృత్రాసురుఁడు తా నజరామరుఁడననియును త్రైలోక్య విజయుఁడననియు ననుకొనుచుండెడువాఁడు. ఇది యాతని శిరమును ఖండించినది. పర్వతముల ఱెక్కలచేఁ బ్రాణులు పీడనుజెంది నన్ను శరణు వేఁడిరి. అప్పుడీ వజ్రముచే నేను పర్వతముల ఱెక్కలను ఖండించితిని. నశించు ప్రజలను, పర్వత పక్షములను ఖండించి రక్షించిన యీ వజ్రము నేఁ డేలకుంఠితమైనది? ఇప్పటి కెందరనో ఈ వజ్రముచే నేను జంపియుంటిని. నేఁటివఱకిది యెన్నడును వ్యర్థము కాలేదు. నేఁడిది శక్తిహీనమేల యైనది? ఘోర తపోబలముచేతను, బలముచేతను, వరదాన దర్ప దర్పితులైన నసంఖ్యాకులగు నసురులను నిది యమసదనమునకుఁ బంపినది. అట్టిది నేఁడేమైనది? వృత్రాసురుఁడే యస్త్రశస్త్రముచేతను జంపఁబడఁడు అతని ముందీ నముచి యేమి లెక్క? ఆ దైత్యునిఁజంపిన యమోఘ వజ్రమీ దైత్యునికడ మోఘమైనది. దీనిలో బ్రహ్మతేజము వ్యాప్తమైనను నిది నన్ను యుద్ధసమయమందు శత్రు సమ్ముఖమున లజ్జితు నొనర్చినది. కావున నేఁటినుండి నేను దీనిని ధరింపను."

శ్రీ శుకదేవుఁ డిట్లనెను :-"రాజా! త్రిలోకేశుఁడగు నింద్రుఁ డిట్లనుకొనుచుండ నంతలో నాకాశమునుండి అరూపమగు వాక్కు వినఁబడెను. ఆ యాకాశవాణి యిట్లనెను :-"ఇంద్రా! హతోత్సాహుఁ దవ్వకుము. ఇదివఱకే యసురుఁడు గొప్ప తపస్సును జేసినాఁడు.

అప్పుడు నేనీతనికి శుష్కవస్తువుచేఁ గాని, తడివస్తువుచేఁ గాని, చావురాదని వరమొసంగితిని''. ఆ వరప్రభావమున నీ వజ్రము వ్యర్థమైనది. ఇప్పుడీవరమును దృష్టియందు బెట్టికొని వెంటనే వీనినిఁ జంపుట కేదైన నన్యోపాయమును వెదుకుకొనుము."

ఈ విధమగు నాకాశవాణిని విని యింద్రుఁడు సావధానుఁ డయ్యెను. ఇట్లు చింతించుచుండు నంతలో సమ్ముఖమున నాతనికి క్షీరసాగర భాగము కనఁబడెను. ఆ సముద్ర ఫేనము వాయువు వీచుటచే నెండి పోయినట్లుండెను. నీటిలో నుండుటచేఁ దడిసినట్లుం డెను. కావున నది తడిసినదనియును జెప్పుటకును వీలులేదు, ఎండినదనియును జెప్పుటకును వీలులేదు. ఆ ఫేనమయమగు వజ్ర ముచే నా నముచి శిరమును ఖండించి వైచెను.

మహాబలియును, బరమపరాక్రమశాలియునగు నముచి మర ణించిన తరువాత చరాచరప్రాణులన్నియును నింద్రునిఁ బ్రశం సించిరి. సిద్ధ, చారణ, ఋషి, మునిగణ మింద్రునకు సాధువాదము లొనర్చిరి. గంధర్వులాతని గుణములను గానము చేయసాగిరి. అప్సరసలు నృత్యము చేయసాగిరి. సారాంశమేమనఁగాఁ ద్రిలోక ములందును సర్వత్ర ఆనందము వెల్లివిరిసెను. అందఱును నీ నముచి వలన దుఃఖితులైరి. ఇప్పుడు నముచినిఁ జంపి ఇంద్రుఁ డందఱను నిర్భయులఁగావించెను. ఇప్పుడందఱకును నుత్సాహ మినుమడించెను. అందఱును తమ ప్రతిపక్షులను బరాజితుల

నొనర్చుచుండెను. సింహము మృగములను జీల్చి చెండాడి నట్లిప్పు డందఱును నుత్సాహవంతులై ప్రతిపక్షులను బరాజితులఁ గావించు చుండెను.

శ్రీశుక దేవుఁడిట్లనెను :- "రాజా! బలి సంజ్ఞా శూనుఁడై మృతునివలెఁ బడుటచేతను, జంభ, బల, పాక, నముచి మొదలైన వారు చచ్చుటచే దైత్యులు శక్తిహీనులైరి. కృషికుఁడు పైరును గోసినట్లు దేవతాగణము వారినిఁగోయుచుండెను. దేవసేనలో హర్షమును, అసురసేనయందు సర్వత్ర విషాదమును వ్యాపించెను.

....

## దేవాసుర సంగ్రామ సమాప్తి

శ్లో॥ బ్రహ్మణా ప్రేషితో దేవా న్దేవర్షి నారదో నృప।
వారయా మాస విబుధాన్ దృష్ట్వా దానవ సంక్షయమ్॥

శ్రీభాగ. ౮ స్కం. ౧౧ అ. ౪౩ శ్లో॥

తే॥ అల్పమృగముల సింహంబులట్లతొలి
రమరవర్యులు దనుజుల నదుటు వాయ
నజుఁడు పుత్తేర నారదుఁడరుగుదెంచె
దైత్యహరణంబు వారింప ధరణినాథ॥

శ్రీమదాంధ్ర భాగవతము.

ప్రపంచము ద్వంద్వములచే నున్నది. మంచికిఁదోడుగా చెడ్డ యునుండిననే ప్రపంచ చక్రము నడచును. విద్యలో సృష్టి లేదు. అవిద్యలోనే సృష్టి. కేవలము ధర్మముతోడనే పని జరుగుచో నధర్మమేల సృష్టింపఁబడును. కృతయుగముతోఁ బాటుగాఁ గలియుగ మేలవచ్చును. దేవతల తోడనే పని జరుగుచో నసురులను సృజింపవలసిన ఆవశ్యకతయేమున్నది? శరీరములో ధాతువులును గలవు మలమును గలదు. సంపూర్ణముగ మలక్షయమగుచో జీవితమేలేదు. మలమందును జీవితముకలదు. శుక్రమునను గలదు. దేవాసురు లందఱును బ్రహ్మచే నిర్మింపఁబడినవారే. సృష్టికిద్దరును నవసరమే. ఇద్దరకును బ్రహ్మనే తండ్రి, చరాచరములాతని వలననే యుత్పన్నమైనవి. అందువలన నాతని లోకపితామహుఁడని నారు. ఎవఁడైన నన్యాయమొనర్చు చున్నను, మితిమీఱినను, వానిని యథాస్థానమునకు దెచ్చుటకు దండించుటయు నాతఁడును గోరునుకాని యెవ్వరిని సర్వథా నాశన మొనర్చుటను గాంక్షింపఁడు. ఈ ద్వంద్వములనట్టె యుంచ గోరుచుండును.

శ్రీశుకదేవుఁ డిట్లనెను .- "రాజా ! దేవతాసురులకు ఘోర సంగ్రామము సంభవించెను. బలి పోరాడు చున్నంత వరకు అసురులు మిక్కిలి శ్రద్ధగా సంగ్రామమందు సన్నద్ధులై యుండిరి, కాని బలియును మూర్ఛితుఁడు కాఁగానే, వరములను బొందినను నముచి యింద్రవజ్రముచే మడియఁగానే అసురులసు సాహసము నడలెను. వారుభయపడిరి. దేవతల యుత్సాహ మినుమడించెను. వారొక ప్రక్కనుండి దైత్య దానవులను దరుగుచుండిరి. చంపుచుండిరి.

దైత్యదానవులు వ్యర్థముగ సంహరింపఁ బడుచుండిరని బ్రహ్మలోక మున నున్న బ్రహ్మ తన దివ్యదృష్టిచేఁ జూచెను. అట్లు జరుగుట అతని కిష్టము లేదు. ఆతఁడు నారదుని స్మరించెను. స్మరింపఁ గానే బ్రహ్మపుత్రుఁడగు దేవర్షినారదుఁడు వెంటనే తనతండ్రి సమ్ముఖమున నుండెను, ఆతఁడు ప్రణామ మొనరించి చేతులు జోడించుకొని యిట్లనెను :- "తండ్రీ! నాకేమి యాజ్ఞ ?"

బ్రహ్మమిక్కిలి ప్రేమతో నిట్లనెను :- నాయనా! క్షీర సాగర తటమున జరుగు దేవాసుర సంగ్రామమందు భగవంతుని విశాల బాహువుల ఆశ్రయమున దేవతలకు విజయశ్రీ వరించినది. వారు విజయ మదమున వ్యర్థముగ దైత్యదానవులను సంహరించు చున్నారు. నీవుపోయి దేవతలకు యుద్ధమును మానుఁడని చెప్పి ఆసురులను సురలనుండి రక్షింపుము. సృష్టిలో నేబీజమును నశింపరాదు.

బ్రహ్మపలికిన యీ మాటలను విని మనోవేగమునకంటెను శీఘ్రగతిని బోఁగల దేవర్షియగు నారదుఁడు వెంటనే క్షీరసాగర సమీపమునకు వచ్చెను. అచ్చటికిఁ బోయి చూడగా దేవతలు దైత్యు లను దఱిమి తఱిమికొట్టు చుండిరి. నారదుఁడు తనచేతిలోనికిఁ బీతాంబరమును గైకొని దేవతలను యుద్ధమును మానుఁడని సంకే తము చూపించెను. రణాంగమునకు వీణను గైకొని వచ్చిన నారదుఁనిగాంచి దేవతలందరును యుద్ధమును జాలించి ఉత్సాహ పూర్వ కముగ నాతని సమీపమునకు వచ్చి ఆతనినిఁ జుట్టుకొని నిలువఁ బడిరి. వారినందఱును గాంచి నారదుఁ డిట్లనెను :-"నాయనలారా! మీరందఱు నిప్పుడు యుద్ధమేలఁ జేయుచున్నారు ?"

దేవతలిట్లనిరి :- "స్వామీ ! వీరు మా పురాతన శత్రువులు."

నారదుఁడిట్లనెను :- "నాయనలారా ! శత్రువులను జయించుటయే తాత్పర్యము. వారిని బీజముతో నాశనము చేయుట ఆశయముకాదు. తమస్వార్థమును నెరవేర్చుకొని విజయమును బొంది శత్రువులను వదలి వేయవలయును. మీకు లక్ష్మి నశించినపుడు శ్రీభగవానుని విశాల భుజాశ్రయముచే మీరందరును గడుపుల నిండ నమృతమును ద్రావితిరి. త్రైలోక్య విజయలక్ష్మి మరల మిమ్ములను వరించినది. మీకు సమృద్ధి కలిగినది. ఇప్పుడీ చచ్చినవారినిఁ జంపుటేమిటి ? పారిపోవువారినిఁ బ్రహరించుటయా ! ఇప్పుడు మీరు స్వర్గమునకుఁబోయి సుఖములను భోగింపుఁడు. యుద్ధము నాపుఁడు. ఇది మీకొరకు కొసంగిన బ్రహ్మాజ్ఞ.

నారదుని నోట లోక పితామహుని యీయాజ్ఞను విని సమస్త దేవతలు యుద్ధమును మానిరి. వారు మునివరుని వచనములను మన్నించి క్రోధమును త్యజించిరి. వారానందముతో, విజయ దుందుభులను వాయించుకొనుచు విజయోల్లాసమునఁ గేకలు వేయుచు స్వర్గమునకుఁ బోయిరి.

ఇది విని పరీక్షిన్మహారాజిట్లనెను :- "స్వామీ ! తరువాత నేమైనది ? అసురులకు మిక్కిలి క్లేశము కలిగియుండవచ్చును. మూర్ఛితుఁడగు బలి మూర్ఛ తేరినాఁడా లేక అట్లే పడియుండి నాఁడా ?"

అంత శ్రీశుకుడిట్లనెను :- "రాజా! దైత్యరాజగు బలిచక్రవర్తి అంతవరకచేతనుడై పడియుండెను. ఆతఁడీ యవస్థలో నుండుటను గాంచి నారదుఁడు మిగిలియుండిన నసురులతో నిట్లనెను :- "నాయనలారా! ఇప్పుడిచ్చట మీరుండుట తగదు ఇప్పుడు మీరు స్వర్గమునకు బోవలదు. ఇప్పుడు స్వర్గములో మరల దేవతల అధికారము వచ్చినది. మీరీ విరోచన నందనుఁడగు బలిచక్రవర్తి నిదే యవస్థలోనే తీసికొని అస్తాచల పర్వతమునకుఁ బొండు. అచ్చటికిఁ బోఁగానే ఆతని మూర్ఛ భంగము కాఁగలదు. ఇంకను జచ్చిన యసురులను, తెగిన తలలు పోకున్నవియు అంగప్రత్యంగములలో నష్టమై పోనివియును వీనినన్నిటిని దీసికొని పొండు. శుక్రాచార్యునకు మృత సంజీవనీ విద్య తెలియును. ఆతఁడు వీరినందరను బ్రతికింపఁ గలఁడు."

నారదుని యీశుభ సమ్మతిని విని అసురులు పరమ సంతుష్టులై చచ్చిన వారిని, గాయపడిన వారిని, దీసికొని అస్తాచలమునకుఁ బోయిరి. అచ్చటికిఁ జేరఁగానే శుక్రాచార్యుఁడు బలిచక్రవర్తిని నందర్శింపఁగానే నిద్రించి లేచిన వారివలెఁ గన్నులు నలుచు కొనుచు లేచి కూర్చుండెను. ఆతఁడు నలువైపులనుజూచి యిట్లనెను :- నేనిచ్చ కేలవచ్చితిని ?

అప్పు డందరును యుద్ధవిషయములను వినిపించిరి. ఆతఁడును గొప్ప వివేకి, జ్ఞాని సంసార తత్త్వమును దెలిసినవాఁడు.

తన పరాజయమును వినియు నాతని కిసుమంతైన దుఃఖము కలుగ లేదు. ఆతఁడిట్లనుకొనెను :- "ఈసంసారెకి జయాపజయములలో నేమున్నది ఇది బాలుర రక్షణిక ఖేలనము. మన మోదకము జగత్తునుండి మనస్సును మరలించి ఆప్రభువును స్మరించి తన్మయుఁ డగుటలోనే విజయము కలదు." ఈవిధముగ నాలోచించుకొని యాతఁడు పరాజయ కారణమున నిసుమంతైన వ్యధితుఁడు కాలేదు.

శుక్రాచార్యుఁడు మిగిలిన క్షతవిక్షితులను, దెబ్బ తినిన నసురుల యంగములను వారివారి శరీరముల కంటించి తనకుగల మృత సంజీవనీ విద్యచే బ్రతికించెను.

శ్రీసూతమహర్షి యిట్లనెను :-"మునులారా! నేను మీకు దేవతల శ్రీ నష్టమైన వృత్తాంతమును, సముద్ర మంథనమును దేవాసుర సంగ్రామ వృత్తాంతమును సంక్షేపముగ, జెప్పితిని, ఇప్పుడు మీరేమి వినఁ గోరుచున్నారు.

.....

## శివునకు మోహినీ దర్శనాపేక్ష

శ్లో॥ అవతారా మాయాదృష్టా రమమాణస్యతే గుణైః
సోఽహం తద్ద్రష్టు మిచ్ఛామి యత్తే యోషితవాద్భుతమ్ ॥

శ్రీభాగ. ౮ స్కం. ౧౨ అ. ౧౨ శ్లో॥

మ॥ ఘనతన్ నీమగపోఁడుముల్ పలు మఱుం గన్నారఁ
గన్నారమే
నిను విన్నారము చూడమెన్నఁడును మున్ నీయాఁడు
జందఃబు మో
హిని వై దైత్యులఁ గన్నుఁ బ్రామి యమృతం బింద్రాది
దేవాళికి
చ్చిన నీరూపముఁ జూపుమా కుతుకముం జిత్తంబునం
బుట్టెడిన్॥

శ్రీమదాంధ్ర భాగవతము.

ఏదేన నపూర్వ వస్తువైనను, అపూర్వమైనదియునను, నూత నాద్భుతమైన దైనను, దానినిఁ జూచుటకు మానవులకుఁ బ్రథమ మున మిక్కిలి సముత్సుకత యుండును. ఎవరికైన రెండు తల లున్న వన్నను, ఇద్దరంటుకొని పోయినా రన్నను నీవేమియును విశేష విషయము కాకున్నను, నిట్టివారు చాల అల్పసంఖ్యలో నుం దురు అందువలన నందఱకును వారినిఁ జూడవలయునని యుండును మొదట విమానము వచ్చినప్పుడు దానినిఁ జూచుటకు దూర దూర ముల నుండి జనులు వచ్చుచుండెడు వారు, కాని అవి నిత్యవ్యవ హారములోనికి రాఁగానే వానినిఁ జూచుట కెవరికిని నుత్సాహము లేదు. క్రొత్తవస్తువును జూడఁగానే కొందరకు విస్మయము కలు గును. అది ప్రాతపడిన తరువాత దానిసరకుగువాఁడే యుండఁడు భగవన్మాయ విచిత్రమైనది. దానిలో నన్నియును సంభవమే

కావున భగవానుని సమస్త ఖేలనములను గాంచి చేతులు జోడింప వలసినదే. వానిని బరీక్షించుటయును, వానిని గాంచి అత్యధి కముగ విస్మితులగుటయును, జింతితులగుటయును మంచిదికాదు.

సూతుఁడు దేవాసుర సంగ్రామమును సమాప్తి యొనర్చుచ నిప్పుడు మీరేమి వినగోరు చున్నారని యడుగఁగా శౌనకుఁ డిట్ల నెను :-"సూతా! నీవు అవతార కథలను విస్తారముగఁ జెప్పితివి, కాని మోహినీ అవతారకథను నత్యంత సంక్షేపముగఁ జెప్పితివి, దీనిని విస్తారముగ జెప్పుడు."

సూతుఁడిట్లనెను :-"స్వామీ! ఈ యవతారము కొన్ని క్షణములే యుండెను అసురులను దన హావభావములచేతను గటా క్షముచేతను మోహింపఁజేసి, సురుల కమృతమునుబోసి అంతర్హిత యయ్యెను. ఈ యవతారము కామ ప్రధానమైనది. కాములు కానందమును గొల్పునది. త్యాగులును, విరాగులు నగు మీవంటి మహాత్ము లీ విషయమును నింతగా నుత్సహించెదరే?"

అంత శౌనకుఁడిట్లనెను :-"సూతా! మేము కా ము కు ల యొక్కయు, కాములయొక్కయు గామమయ కథలను వినరా దనుట నిజమే కాని యిది భగవంతుని విషయమునఁ జెల్లదు. భగ వంతుని లీలలన్నియును దివ్యములే వానిలోఁ గామ గంధమే యుండదు. భగవంతుని యందు మనస్సు లగ్నమగుటయే జీవుని యొక్క పరమ లక్ష్యము. అందఱును భక్తి భావమును గలిగి యుండవలెను. భక్తిలోఁ గూడ ననేక భేదములు కలవు కొందఱు

భగవంతుని సఖునిఁగ భావించెదరు కొందఱు తమ పుత్రునిగ భావించెదరు. ప్రేమ భక్తినిఁ జేయలేనివారు భగవంతుని ద్వేషించి యీ సంసార సాగరమును దాటిపోయిరి కామముచేతను, ద్వేషము చేతను, భయముచేతను, స్నేహముచేతను, భక్త్యాద్యుపాయముల చేతను భగవంతునియందుఁ జిత్తమును నిలిపి చాలమంది కామాది జన్యపాపములచే ముక్తులై అతనిలో సాయుజ్యమును జెందిరి. కావున నేదో యుపాయముచేత మనస్సును భగవంతుని యందు లగ్న మొనర్ప వలయును. కాముకులగు నసురులు భగవానుని యా మోహక రూపమును గాంచి యా మాయలోఁ బడినారేమో కాని మేము భగవదుపాసకులము. అతనినే మేము మా సర్వస్వముగ నెంచుకొందుము. కావున మోహినీ రూప భగవానుని యన్యచరిత్ర శ్రవణముచే మా భక్తి వృద్ధియే కాఁగలదు. స్త్రీరూప ధారియగు నా శ్రీహరి లీల లింకేమైన నుండినచో వానిని మాకుఁజెప్పుఁడు.''

నవ్వుచు సూతుఁడిట్లనెను :—"స్వామీ! మోహింపఁ జేయుటకై సత్యసంకల్పుఁడగు శ్రీహరి యేరూపమును ధరించెనో దానినిఁ గాంచి యెవరును మోహితులు కాకున్నచో భగవంతుఁ డసత్య సంకల్పుఁడు కావలయును. స్వామీ! ఒకరిమాట మన కెందులకు యోగీశ్వరేశ్వరుఁడగు సదాశివుఁడును క్షణకాలము మోహినినిఁగాంచి మాయలోఁబడిపోయెను.

ఉత్సుకతతో శౌనకుఁడిట్లనెను :—''శివుడెట్లు మోహపడినాఁడు సూతా! హరిహర చరిత్రలుండు నీ కథను నీవవశ్యము చెప్పవల యును. ఆ కథ గంగా యమునా సంగమమగు ప్రయోగమువలెఁ బుణ్యప్రదమును బరమ పావనమును గాఁగలదు.''

సూతుడిట్లనెను :-"మంచిది, వినుడు స్వామీ! ఈ హరిహర చరిత్రము పరమ పవిత్రమైనది, భక్తినభివృద్ధి చేయునది. అసురులకుఁ గామవృద్ధిని, భక్తుల భక్తి వృద్ధినిఁ జేయునదై యున్నది ఇది యెంతటి మహత్వపూర్ణ్వమగు చరిత్రమనఁగాఁ బరీక్షిన్మహారాజడుగకయే శుకదేవుఁడీ చరిత్రమును జెప్పినాఁడు. అయితే యిఁక వినుడు. దేవాసుర సంగ్రామ కథను సమాప్తిచేయుచు నాయూపులోనే మా గురువును, పరమహంస చక్ర చూడా మణియును అవధూత శిరోమణియును, దిగంబరియు, సర్వధా కామాది భావరహితుఁడును, బరమ జ్ఞానియునగు శ్రీశుక దేవుఁడు కథాప్రసంగమును బూర్వరీతిని నడుపుచు నిట్లు చెప్పదొడంగెను.

శ్రీశుకుఁడిట్లనెను :-"రాజా! సముద్రమును మథించిన తరువాత, దానినుండి విషముబయలుదేరెను. దానినిఁ ద్రాగుటకందఱును శివునిఁ దీసికొని వచ్చిరి. శివుఁడు విషపానమొనర్చెను. అచ్చట నాతఁడు భగవాను కచ్ఛపరూపమును దర్శించెను. అజితరూపమునను ప్రత్యక్షముగనుండెను. అమృతమును గైకొని ధన్వంతరి రూపమున నావిర్భవించి నప్పుడును వృషభధ్వజుఁ డాతనిని దర్శించెను. అసురు లమృతము కొఱకు పెనుఁగులాడు చున్నప్పుడు శాంతిప్రియుఁడగు శంకరుఁ డచ్చటినుండి వెడలిపోయినట్లు తోచుచున్నది. ఆతఁడిట్లనుకొని యుండును :-''నేనిచ్చట నుండిన యెడల నెవరో ఒకపక్షమును వహింపవలసి యుండును. నాకు దేవతలును భక్తులే అసురులును భక్తులే. ఈ అజిత భగవానుఁడు ప్రత్యక్షముగ దేవతల పక్షమును వహించినాఁడు. అసురులు వచ్చి యేడ్చి మొత్తు

కొనినచో నేను వారి పక్షమును వహింపవలసి వచ్చును. అప్పుడు మా ఇద్దరకును యుద్ధము పొసగఁ వచ్చును.'' అని యాలోచించు కొని యాతఁడు వెడలిపోయి యుండవచ్చును.

భగవానుఁడు మోహినీ రూపమును ధరించి అమృత కలశ మును నసురులనుండి లాగి, అమరులకుఁ బొట్టనిండబోసినాఁడు అప్పుడు దేవతలకు విజయము కలిగినది. అసురులు మడసిరి. ఈ సమాచారము నందరునుబోయి కైలాసమున నున్న కాలకంఠునకు నివేదించిరి.

ఇదివిని భూతనాథునకు మిక్కిలి యుత్సుకతకలిగి ఆతడు మాటి మాటికిట్లనుకొనెను :- ''పురుషుఁడైన భగవానుఁడు స్త్రీయెట్లై నాఁడు ? పురుషరూపమునందే ఆతడింతటి మోహకుఁడైనాఁడే, ఇక స్త్రీరూపమున జడ, కొప్పులను ధరించి, కులుకుచు నడచియుండ వచ్చును. కాముకులగు దైత్యులెట్లు మోసపడినారో గదా! ఆ లక్ష్మీ పతి స్త్రీవేషమున నెట్లలంకారములు చేసికొనినాఁడో కదా ?" ఈ విధ మున నాతని మనస్సున నసంఖ్యాకములగు విచారములు పుట్టెను. ఆతఁడు తన యుత్సుకత నాపుకొనఁ జాలకుండెను. తమ ప్రభు వును వివిధవేషములలోఁ జూడవలయునని అంపరకుండును. తమ ప్రేమాస్పదుని వివిధరూపములలోఁ జూడవలెనని అందరకును స్వాభావికేచ్ఛయుండును. అందువలన మిక్కిలి యుత్కంఠతతో పార్వతితో నాతఁడు నిట్లనెను :- "ప్రియా ! భగవానుని స్త్రీరూప మును జూడవలయునని నాకు తీవ్రేచ్ఛ కలదు."

పార్వతి వ్యంగ్యస్వరమున నిట్లనెను :- మీకెల్లప్పు డిట్టి విషయములే తోఁచుచుండునేమి ? మీరెన్నడును స్త్రీని జూడలేదా ?

సతీపతి యిట్లనెను :- "ప్రియా ! నిజము చెప్పుచున్నాను ప్రపంచములో నే నసంఖ్యాకములగు స్త్రీలనుజూచితిని, కానినీవంటి సుందరిని నేనుముల్లోకములలోఁ జూడలేదు. భగవంతుని ఆరూపము నీరూపముకంటె సుందరమగునో కాదో చూచెదమనుకొనుచున్నాను. ఆతఁడు నీకంటె మోహకుఁడు కాఁడని నాయభిప్రాయము."

లోలోన నానందించుచుఁ బైకి ప్రేమ భావమును బ్రదర్శించుచుఁ బార్వతి యిట్లనెను :- "పోండు ! మీ కెప్పుడును నిట్టి మాటలే తోఁచుచుండును. అన్నింటిని నా మెడకే చుట్టుచుందురు."

అత్యంత ప్రేమతో నామె దృష్టిలో దృష్టినిఁ గలుపుచు సదా శివుఁడిట్లనెను :- "ప్రియా ! నేను నిన్ను దెప్పుటలేదు. నీ మెడకుచుట్టుటయును లేదు. నిజమును జెప్పుచున్నాను. ఆ మోహినీ రూపుఁడగు భగవానుని దర్శింపవలెనని యున్నది. నా కన్య భావము లేదు. నీవుకూడ వెంటరమ్ము. నీవు లేక నే నొంటరిగాఁ బోఁజాలను, ఈ భూతప్రేత పిశాచములును రావచ్చును. అందరును నామోహినీ రూపదర్శనముచేఁ గృతార్థులు కావచ్చును."

ప్రియా ! సాధారణముగఁ దమకంటె నందమైన స్త్రీలను జూచుట కందఱకును గుతూహలముండును. చూడఁగానే వారిలో ననేక దోషముల నెంచుచుందురు. ఏమంత అందకత్తె. ఎంతో ప్రశంసను వింటిమే. అట్లున్నది, యిట్లున్నది, ఏమియునులేదు. మొద్దు ముఖము అనుచుందురు.

పార్వతియును నిట్లనుకొనెను :- "నామీఁద ననురక్తి కలిగిన సర్వజ్ఞుఁడగు శివుఁడు సదా నన్నే తనయంకమున ధరించుచుండును. తన శరీరమును సగము దాచుకొని అర్ధనారీ నటేశ్వర రూపమును ధరించినాఁడు. మోహిని నాకంటె నధికమోహకముగ నుండునా ?" అని యనుకొనుచు బార్వతియును నచ్చటికిఁ బోవుటకు సమ్మతించెను.

ఇంకేమున్నది. ఎద్దుఁమీద గంతవేయఁ బడినది. దానిమీఁద సింహాసనము వేయఁబడెను. భూత, ప్రేత, పిశాచములు హోహో, హూహూ శబ్దములొనర్చుచు డమరును వాయించిరి. యాత్ర సిద్ధమయ్యెను. శివుఁడు పార్వతితో నెద్దుమీఁద నెక్కెను. నిమిషములో కైలాసనాథుఁడు వైకుంఠధామమునకుఁ జేరుకొనెను.

నేఁడు పార్వతీ సహితముగ నుమాపతి ఉత్సాహ పూర్వకముగ వచ్చుటను గాంచి రమాపతి శీఘ్రముగ లేచి నిలుచుండెను. తన పార్షదులను గద్దించుచు నిట్లనెను :- "ఓరీ! మీరూరక మొద్దులవలె నిలుచుంటిరేమిటిరా? విశ్వ భావనుఁడను విశ్వనాథుఁడు వచ్చుచుండుటను జూచుట లేదా! పాద్యమును దెండు, అర్ఘ్యమును దెండు, మాలలను గట్టుఁడు, వాద్యములను ప్రమోగింపుఁడు. ఆసనములు వేయుఁడు."

మిక్కిలి నమ్రమతతో శివుఁడిట్లనెను :- "స్వామీ! ఇవన్నియు నెందులకు? మీ అనుగ్రహమే అన్నిటికంటె గొప్ప సత్కారము."

ఈ విధముగ భగవానుఁడగు శివునకు సముచిత ఆదర సత్కారముల నొనర్చి ఆతనిని దివ్యసింహాసనమునఁ గూర్చుండఁ బెట్టెను. స్వచ్ఛ చిత్తముతో నాసనమునఁ బూజితుఁడైన తరువాత శివుఁడు భగవానుని స్తుతింప నారంభించెను.

దేవాధిదేవా! నీవు జగత్తున సర్వత్ర వ్యాపించియున్నావు. నీవు జగదీశ్వరుఁడవు. జగత్తు నీరూపమే. సర్వ భావములకును నాత్మవు నీవే. నీవే అన్నిటికిని హేతువవు. ఈశ్వరుఁడవు. నీవు జగత్తున కాదివి, మధ్యము, అంతమవు నీవాది మధ్యాంత రహితుఁడవు. నీవు దృశ్యమవు, ద్రష్టవునుగూడనై యున్నావు. భోగమవు, భోక్తవును, సత్యమవు, చేతనుఁడవు, బ్రహ్మవు, నీవందరకు కుపాస్యుండవు. నీ వమృతవు నిర్గుణుఁడవు, నిశ్శోకుఁడవు, ఆనంద స్వరూపుఁడవు నిర్వికారుఁడవు, సర్వమయుఁడవు, అన్నిటికిని వేరుగ నున్నావు. పూర్ణుఁడవు, విశ్వకారణుఁడవు. విశ్వపాలకుఁడవు. విశ్వసంహారకుఁడవు, శాసకుఁడవు, నిరపేక్షుఁడవు. అందరకును ఫలదాతవు, ధాతవు విధాతవు, జ్ఞాతవు, జ్ఞానమవు, జ్ఞేయమవు నీవే కార్యాకారణుఁడవు. అభేదుఁడవు ఉపాధిరహితుఁడవు. కొందరు నిన్ను బ్రహ్మయందురు. కొందరు ధర్మమందురు, కొందఱు ప్రకృతి పురుషులకుఁ బరుఁడందురు. పురుషోత్తముఁడవనియుఁ బరమపురుషుఁడ వనియు, మహాపురుషుఁడ వనియు, నందురు. కొందఱు నిన్నవతారుఁడందురు. నీవజ్ఞేయుఁడవు. నీవు సర్వాత్మకుఁడవు. విజ్ఞాన ఘనమవు, నీవు సర్వత్ర సమాన రూపమున

వ్యాపించి యున్నావు. నీవు సమస్త జగత్తునఁ బ్రవిష్టుఁడవైయుండి దాని చేష్టను, స్థితిని, జన్మనాశములను, ప్రాణుల కర్మలను, సంసార బంధ మోక్షములను బాగుగా నెఱిఁగిన జ్ఞాతవు.''

ఇంత దీర్ఘమగు స్తుతినివిని లక్ష్మీనాథుఁడు నవ్వెను. సర్వజ్ఞుఁడగు ప్రభువన్నియు నెరిఁగియు నెరుఁగని వానివలె నవ్వుచు నిట్లనెను :- ''పార్వతీపతీ ! నేఁడు నీ వింతదీర్ఘస్తుతినిఁ జేసితివేల? స్వామీ ! అన్యథా తలంపకుఁడు. ఇంత పెద్ద స్తుతిలో నేదో హేతువిమిడి యుండవలయును. స్తుతి చాల అయినది. ఇప్పుడు మీ యభిప్రాయమును జెప్పుడు.''

సరళతా స్వరమున శివుఁడిట్లనెను :- ''లేదు స్వామీ ! విశేష విషయమేమియును లేదు. నాకొక కోరిక కలదు.''

భగవానుఁడిట్లనెను :- ''అదియేమి ?''

శివుఁడు కొంచెమాగి యిట్లనెను :- ''స్వామీ ! మీరు ధరించిన సనక, సనందన, సనత్కుమార, సనాతనావతారములను నేను నిత్యమును జూచుచునే యున్నాను. లోకవ్యవహారార్థముగ వారు నాకడ జ్ఞాన జిజ్ఞాసనొనర్చు చుందురు. వివిధప్రశ్నల నడుగుచుందురు. భూమినుద్ధరించుటకై మీరు రసతలమునకు సూకరావతారమునఁ బోయితిరి. దానిని నేను జూచియుంటిని. నారద, నర, నారాయణ, కపిల, దత్తాత్రేయ, యజ్ఞ, వృషభ, పృథు, మత్స్య, ధన్వంతరి, నృసింహ, వామన, పరశురామ, హంస, హయగ్రీవ,

వ్యాస, రామ, కృష్ణ, బలరామ, బుద్ధ, కల్క్యాది యవతారము లందు మీరు దివ్యగుణములనాశ్రయించి క్రీడించుచుండుటను నేను బాగుగా దర్శించితిని. కాని స్వామీ! మీరు స్త్రీరూపమును గూడ ధరించితిరని నేను వినియున్నాను. ఆ రూపమును నేను మరలఁ జూడఁగోరుచున్నాను. తులుకుచుఁ గులుకుచుఁ దిరిగి యుండవచ్చును. కొంచెముగఁ బురుషత్వము గోచరించుచుండునా లేక నూటికినూరు పాళ్ళు స్త్రీరూపమేనా ? మీరు స్త్రీయైనపుడు నేనెన్నడును జూడలేదు.

ఇది విని భగవానుఁడు పకపక నవ్వి యిట్లనెను :- "స్వామీ ! నేను చీరనుగట్టి రవికను దొడుగుకొంటిని. జడవైచి కొంటిని. అసురులకు నావయ్యారములును, టీకు టాకు లును, గులు కులును జూపించితిని.

శివుఁడు పిల్లలవలె మిక్కిలియుత్సుకతతో నిట్లనెను :- "స్వామీ ! నీవు బాణమును సంధింపకయే, విల్లునెత్తకయే, గదను ద్రిప్పకయే, వేణువునూదకయే కేవలము కనుసైగలతోడనే ముఖ మును ద్రిప్పుచునే అసురులచేతినుండి అమృతమును లాగుకొంటివఁట. వారు చూచుచుండఁగనే వారి కన్నుల దుమ్ముగొట్టి దేవతల కమృతమును బోసినావఁట. మూఢులును, గాముకులునగు నాయసు రులు కొయ్యబొమ్మలవలెనై మెదలకుండిరట."

నవ్వి భగవానుఁడు తలనూపి యిట్లనెను :- "అవును అట్లే అయినది."

శివుఁడు శీఘ్రముగా నిట్లనెను :- "స్వామీ! రూపమును
నీను గొంచెముఁగ జూడఁ దలఁచుచున్నాను. ఆకులుకు, మిటారి
వేషమును దర్శింపఁగోరిక కలదు."

భగవానుఁడు నవ్వి యిట్లనెను :- "శివా! నీవు గొప్ప
వృద్ధుఁడవయ్యు నీమాయలోఁ బడెదవేల? అయినదేమో అయినది.
కొయ్యపాత్ర రెండుసార్లు పొయ్యినెక్కదు. నేనట్టి రూపమును
మరల ధరింపఁజాలనేమో! ఆరూపమును నేనేదో కారణవిశేషముచే
ధరియించితిని, అమృతకలశమును బలవంతముగ నసురులు
నాయంశావతారమగు ధన్వంతరి చేతినుండి లాగుకొనఁగా నేను
దేవతాకార్యమును విచారించి దైత్యులను గుతూహలమునఁబడవైచు
టకై స్త్రీ (మోహినీ) రూపమును ధరించితిని. ఆ కామవర్ధకరూపము
దైత్యులకొరకే, నీవుదేవుఁడవేకాదు, మహాదేవుడవు. నీవు దీనినిఁ
గాంచి యేమిచేయుదువు?"

శివుఁడత్యంతోత్సాహముతో నిట్లనెను :- "లేదు స్వామీ!
ఆరూపమును జూడవలయునని నాకుకోరిక కలదు హానియేమ
న్నది? ఒక్కసారి చాలును. మీకివియన్నియును నాటకమేకదా!"

భగవానుఁడు నవ్వుచునవ్వుచు నిట్లనెను :- "మంచిది
స్వామీ! నాకెందులకు? కానిజాగ్రత్తగానుండవలెను. అంతఁ
బార్వతితో నిట్లనెను :- "వినుచుంటివా గిరిరాజకుమారి! భోళా
శంకరునిఁ బట్టుకొని యుండవలయును."

పార్వతి మూర్తి త్రివ్వుకొని యిట్లనెను :- "స్వామీ ! ఇవన్ని యును నీకుదెలియవలెను. వారికిఁదెలియవలయును నేనీ మాయ లలోఁబడుదానను గాను. నీవు దేవివికమ్ము దేవుడవుకమ్ము. మోహినివికమ్ము, మోహనుఁడవుకమ్ము, మీలోమీరు తేల్చుకొనుడు."

శివుఁడిట్లనెను :- "స్వామీ ! మీరుచూపించుడు."

భగవానుడు కొంచెము సంబాళించుకొని యిట్లనెను:-"మంచిది, కాముకులకు మిక్కిలి సమ్మాన నీయమైనదియును, మోహోద్దీపక మైనదియునగు నారూపమును జూపించెదను."

శుకదేవుఁడిట్లనెను :- రాజా ! ఇలుపలికి భగవానుఁడు వెంటనే అంతర్థానమయ్యెను. శివుడు నలువైపులను జకిత నేత్రము లతో మోహినీ భగవానుఁడెటునుండి వచ్చునా యని చూచుచుండెను.

.....

## శివునకు మోహినీ దర్శనము

శ్లో॥ తతో దదర్శోపవనే వరస్త్రియమ్
విచిత్ర పుష్పారుణ పల్లవ ద్రుమే ।
విక్రీడితం కందుక లీలయాలస
ద్దుకూల పర్యస్త నితంబ మేఖలామ్ ॥

(శ్రీభాగ. ౮ స్క. ౧౨ అ. ౧౮ శ్లో॥

సీ॥ ఒక చేతఁ దోఁటలో నొక వీధి నొక నీడఁ
గుచకుంభముల మీఁది కొంగు దలఁగఁ
గ బరికా బంధంబు గంపింప నుదుటిపైఁ
జికుర జాలంబులు సిక్కువడఁగ
ననుమానమై మధ్య మల్లాడఁ జెక్కులఁ
గర్ణకుండల కాంతి గంతులిడఁగ
నారోహ భరమున నడుగులు దడఁబడి
దృగ్దీప్తి సంఘంబు దిశలఁ గప్ప

తే॥ వామకరమున జాఱిన వలువఁ బట్టి
కనక నూపుర యుగళంబు గల్లనంగఁ
గంకణంబుల ఝుణఝుణ త్కార మెసఁగ
బంతిచే నాడు ప్రాయంపు టింతిఁగనియె॥

శ్రీమదాంధ్ర భాగవతము

భగవంతుఁ డీ కన్నులకు వాక్కునీయలేదు, కాని దీనిలో సమస్తశక్తులుండునట్లు చేసినాఁడు. హృదయములోని భావములన్నియును గన్నులలోఁ బ్రతిబింబించును. కన్నులే వానినిఁ జదువఁ గలవు; తెలిసికొనఁ గలవు స్వీకరించును. ప్రాణి వ్యర్థముగ మాటలాడును మాటలాడుట అపూర్ణతకును,నసంయమమునకును, నధీరతకును చిహ్నము. కన్నులు నాలుగయ్యెనా అన్నియు నెఱవేరును. కన్నులకు బాగుగాఁ గనఁబడిన జాలును వినియును, మూఁజూచియును, దాఁకియును భావమును వ్యక్తము చేయవచ్చును, కాని

చూచిన దానిచేఁ గలిగిన ప్రభావము విన్నను, మూఁజూచినను, దాఁకినను గలుగదు. హత్యకు మూలములీ నేత్రములే. ఈ నేత్రములు రూపలోభము కలవి. ప్రపంచములో నున్నవి నామరూపములు రెండే, దృశ్య పదార్థము లన్నిటియందును మంచివి కానిండు, చెడ్డవికానిండు సుందర సురూపమును గాంచినచోఁ గన్నులచ్చట పాదుకొనిపోవును. మనస్సును మాటిమాటికిఁ బ్రేరేపించును.మనస్సు కూడ అధీరమై దానినిఁ బొందుటకుఁ బ్రయత్నించును. అనిత్యములగు నీపదార్థముల రూపమందు చిత్తము లగ్నము గాక నిత్యానంద రూపుఁడగు శ్రీహరి రూపలావణ్యమందు లగ్నమగుచోఁ ధరించి నట్లే, ఈ సంసారములోనికి రాకపోకలు వదలిపోవును. రూప దర్శన వ్యసనమెవరికిఁగలదో అట్టివారు ప్రభు స్వరూపము నవలోకింపవలయును.

శ్రీశుకదేవుఁడిట్లనెను :- రాజా ! భగవానుఁడంత ర్హితుఁడు కాఁగా, శివుఁడు నలువైపులను జూచుచుండెను. ఇంతలో భగవానుఁ డచ్చటఁ బ్రకటమయ్యెను.

శివుఁడు కూర్చుండిన చోటున కెదురుగా శ్రీహరి యొక్క మణిమాణిక్య భవనము కలదు. అచ్చట నత్యంత రమణీయమగు నొక ఉపవనము కలదు. దానిలోఁ బన్నెండు నెలలును ఋతురాజగు వసంతుఁడు మూర్తిమంతుడై నివసించుచుండెను. దానిలో నానా విధములగు ఫల పుష్ప భరితములగు వృక్షములు కలవు. దాని మధ్య స్వచ్ఛసలిలములు గల సుందర సరోవరము కలదు. దానిలోని జలజంతువులు కిలకిలారవము లొనర్చుచుండెను. వివిధ కమల

ములు వికసించి దాని శోభను సహస్ర గుణముల వృద్ధిఁబొందించు చుండెను. సరోవరమునకు నలుదిశలను బంక్తి బద్ధముగ సఘన వృక్షములు నాటఁబడి యుండెను. వానియందు చిత్ర విచిత్రము లగు బుష్పములు వికసించియుండెను. అరుణ వర్ణముగల నవపల్ల వములు వాయుస్పర్శచేఁ గదలుచుండెను. ఒక కొమ్మ వేరొక కొమ్మ కలిసికొని పెనవైచుకొని యుండెను. కొన్ని పుష్ప పరిపూర్ణములై యుండెను. కొన్ని ఫలభార నమితములై యుండెను. సఘన ద్రుమ పంక్తి యెవరో పుష్ప గుచ్ఛము నలంకరించి నట్లుండెను.

శివుఁడా నఘన ద్రుమపంక్తిని. ఆ ఫలపుష్ప సమన్వితము లగు వృక్షములను జూచుచుండఁగా నొక నవయౌవన యువతి యావృక్షముల మాటున నుండి మేఘములలోని మెఱపు తీఁగవలె వెలువడు చుండెను. ఆమె స్వాభావిక మదముచే నలసతను జెందు చుఁ గందుకము నెగురవేయుచు నటు నిటు స్వేచ్ఛగా గ్రీడించు చుండెను. మాంసలమును, బీననితంబము దేదీప్యమానమై బహు మూల్యమగు నులివిరి వస్త్రముచేఁ గప్పఁబడి యుండెను. దానిమీఁద సువర్ణమయమగు మేఖల కొంచెముగ వ్రేలాడుచుండెను. శ్రోణీ భారమున నమితయై, స్తనములును, వాని పైనఁబడిన చంద్రహారము ముక్తారము, వనమాలాదుల అధిక భారముచే నామె సన్నని

నడుమును గసుగసకు నూగుచు తెగినదానివలె నుండెను. తన చంచలారుణ పల్లవములను నిర్దయతా పూర్వకముగ నిటునుండి ఆటు గొనిపోవుటచే, వానికి నలంకరింపఁబడిన నూపుర మంజీరములు వివిధ శబ్దము లొనర్చుచుఁ గమలముల కంటెను గోమలములగు జరణద్వయము విషయములో నిట్టియన్యాయమును గావింప వలదు. ఈ కఠినమార్గమునఁ బట్టి యీడ్వవలదనుచు నట్లుండెను. కాని స్వాధీన పతికవలె దాని నుపేక్షించుచు నామెకందుక క్రీడలోఁదన్మయమై యుండెను. తనకోమల కరములతోఁ గందుకమును వయ్యారముగఁ గొంచెము పైకెగురవేయుచు, గొంచెము సేపు పైనుండి క్రిందనే యాడించుచుండెను, వచ్చుచుండిన బంతినిఁ బట్టుకొనుటకై దృష్టిని దానిమీఁద సారించుచు నామె పరుగిడుచున్నప్పుడామె యొక్క ఉన్నతమైన వక్షఃప్రదేశ మింకను నూగుచుండెను పైఁటను చాలిగించుచుండెను. రవిక వదలుపోరు చుండెను. కోమల పదములటునిటు స్ఖలితమైనట్లుండెను. శిరముపై నున్న మేలి ముసుఁగు మాటి మాటికినిఁ బైకిఁ జూచుటచే జారి మెడమీఁదఁ బడుచుండెను. కృష్ణ సర్పమువలె నున్న నామె వేణీ వంకరగ నాడుచుండెను. ఆమె క్రీడ ఏదో ఒక్క దిశను లక్ష్యముగాఁ బెట్టుకొన్నట్లుగ లేదు. దిశవిదిశలయందు గందుకమును నెగురవేయుచుఁ చపలత్వముగ నామె యుత్ఫుల్ల సదృశములగు విశాల నేత్రములు చంచలములుగ నుండెను. చకోరద్వయము నడుచున్న చంద్రుని నవేపనిగ నేకా

గ్రముగఁ జూచుచు నట్టాకాశమున నెగరుచున్న బంతిని నామెయేకా గ్రముగఁ దన కమల నేత్రములతోఁ జూచుచుండెను. శోభలోఁ బూర్ణచంద్రుని లజ్జింపఁ జేయునదియును, గోమలతలోఁ గమలమును గూడ తిరస్కరించునదియునగు నామె మనోహరముఖమందువిటియఁ బడిన నల్లని యుంగరములు తిరిగిన ముంగురులు చంద్రుని పత్ని యగు రోహిణి తన ముఖమును బతిముఖమున కానించఁగా నామె నీలాలకములు సజీవములై దానిలోని అమృతమును బానము చేయు చున్నట్లుండెను. ఆమె కర్ణములకుఁగల కమనీయ కనక కుండలములు తమ కాంతిచేఁ గపోలములకు శ్రీవృద్ధినిఁగావించుచుండెను. ఒక్కొ క్కప్పుడు క్రీడా చంచలతయందు చీరతొలఁగిపోవుచుండెను. భూమిమీఁదఁ జీరాడుచుండెను. జడయూడి పోవుచుండెను. దానిలోఁ గూర్పఁబడిన మల్లికా కుసుమమాల వ్రేలాడుచు నూగుచుండెను. అప్పుడామె తన వామకరముచే దానిని సరిచెసికొనుచు, రెండవ చేతితో బంతినెగురవేయుచుండెను. ఆమె కందుకము నెగురవేయుట కాదు. విశ్వవిమోహనమును గావించుటకై అందఱ మనస్సులను నెగురవేయుచుఁ దనవైపునకుఁ బిలుచుచుండెను. ఆమె క్రీడావేగ మున నప్పను. ఒక్కొక్కప్పుడామె చేష్టలు చంచలముగనుండును. ఒక్కొక్కప్పుడు కందుకము మీఁద గోపమును జూపించుచుండును. శ్రమకారణమున నామె ముఖకమలమునందు స్వేదబిందువులు మెరయు చుండెను. ఒక్కొక్కప్పుడామె పైకి దృష్టిని సారించుచుఁ దనపత్ర

ముతోఁ దుడుచుకొనుచు నల్పకాలములోనే మరల లేచును. ఆమె క్రీడయందు దన్మయయై లకహూప సుధను నాయుపవనమందు వెద జల్లుచుండెను. ఆమెకు కందుకము తప్ప ప్రపంచముతోఁ దనకేమి యును లేనట్లనుకొనుచుండెను.

శివుఁడా కందుకక్రీడ నొనర్చు కామినిని గాంచెను. భగవానుఁడు తనకు మోహినీరూపమున దర్శనమొసంగి తన కోరికను నెఱవేర్చుచున్నాఁడను సంగతినాతఁడు మరచి పోయెను. ఇట్టి సుందరి యింట్లొంటరిగ నిచ్చట నేల క్రీడించుచున్నది. ఎవరీమె ? యని యనుకొనుచుండెను. శివుఁడు తదేక దృష్టితో నామెనే చూచుచుండెను. ఆమెకు సంబంధించిన విషయములనే ఆలోచించుచుండెను. ఇంతలోనే ఆ సౌందర్య సాకారమూర్తి శివునివైపునకే బంతిని దొర్లించుకొనుచు వచ్చుచుండెను. కందుక క్రీడా మధ్యలో నప్పు డప్పుడామె సలజ్జస్ఫుట మందహాసమొనర్చుచుఁ గ్రీగంటఁ గటాక్ష బాణములను శివుని లక్ష్యముగాఁ బెట్టుకొని విడుచుచుఁ మిక్కిలి చాతుర్యముగ నాతని హావభావములను గూడ తెలిసికొనుచుండెను.

శ్రీశుకదేవుఁడిట్లనెను :- రాజా ! ఎవరైనను జూచి చిత్తము చంచలతను జెంది యుండినచో నచ్చటనుండి బలాత్కారముగఁ దీసివేయవలయును. మనస్సచ్చటినుండి తొలిగించుటకై యేదైన నత్యావశ్యకమైన కార్యమందు మనస్సును జొప్పింపవలయును.

చిత్తము నెవరైన దొంగిలించినప్పుడు, కోరికయున్నను దృష్టి నట నుండి మరల్పఁ జాలము. లక్షప్రయత్నములొనర్చినను మనస్సన్య కార్యములందు లగ్నముకాదు. హృదయ పటలమందదే చిత్త చోరయై నాట్య మొనర్చుచుండును. చిత్తమునఁ జింతన చేయు టకై ఇంకే విషయమును నిలువఁజాలదు. మాటి మాటికినిఁ జూచు టచే నుత్సుకత వృద్ధినిఁ జెందును. తన్మయత దృఢమగును, వివే కము నశించును. కర్తవ్యాకర్తవ్యతా వివేకముండదు. లోకలజ్జ పారిపోవును. కులము వగైరాలు పారిపోవును. ద్వైతమును నాశ మొనర్చుటకు వ్యగ్రతవృద్ధియగును. దానినిఁ బొంది, దానినిఁ దనలోఁగలుపుకొను నిచ్ఛ బలవత్తరమగును. ఇంద్రియములు బల పూర్వకముగఁ జెప్పకుండఁగనే హఠాత్తుగ నచ్చటి నుండి పరు విడును. ఈక్రీడలన్నిటిని కైలాసపతి ప్రభువు ప్రదర్శించు చుండెను. లౌకికీ గతిని నాట్యమును జూపుచుండెను.

ఇప్పుడు చంద్రశేఖరుని చిత్తమును నా చారుహాసియుఁ జంచ లయు హరించియుండెను. అతఁడు లోకమర్యాదను, కులశీలసంకోచ బంధములను తెగఁద్రెంపి స్వచ్ఛందముగ విహరించుటకు ద్విగ్నుఁ డైయుండెను. ప్రక్కన పార్వతి కూర్చుండియుండెను. ఆమె యిట్లాలోచించుచున్నది :- "నేనాతనికేమి చెప్పి తెచ్చితిని? ఈ నందిభృంగి మొదలైనవారేమనుకొందురో. ఈవిషయములనన్నిటిని వృషభధ్వజుఁడు మరచిపోయెను. ఆతఁడు తన్మయుఁడై ఏకాగ్ర

భావముతో నాకందుకము వెంట కందుకమును దన్ను కామినిని(దప్ప యింకెవరిని జూచుటలేదు.

ఒకసారి యారమణీయరత్నము తన కరకమలములతో విసరిన కందుకము దూరముగ(బో(గా వానిని( బట్టుకొనుట కాత(డు దానివెంట( బరువిడెను. ఆ పరువెత్తుటలో నామె చీరచెఱ(గు ఆమె అంగములనుండి జారిపోయెను. ఆమె క్రీడాభావమును జూపించుచు మాటి మాటికి శివునివైపునకు తీక్ష్ణక్రీగంటి చూపులతో(జూచుచు, ననురాగయుక్తముగ గటాక్షపాత మొనర్చుచు( బరువిడుచుండెను. నేత్రములునేత్రముల భావములను గ్రహించెను. ఆమెయును స్నేహభరితదృక్కులతో( దన్ను( జూచుచున్నదనియు(, దన్ను స్నేహభరిత దృష్టులతోడను, ప్రేమభరితవైఖరితోడను దన్ను(జూచుచున్నదని తెలిసికొన(గానే ఆతని వివేకమాతనిని వీడి లజ్జచే దాగెను. అది దాగ(గనే శివు(డా సుందరకటాక్షశాలినియును, దర్శనీయయును, మనోహరాశియునగు మోహిని వెంట(బడెను. పార్వతి యెంతగానో అడ్డగించెను:- "ఎచ్చటికి వెళ్ళెదరు! ఆగు(డాగు(డు." గణములు మొఱపెట్టుకొనిరి. నంది మాటిమాటికిని భంభమ్మని యఱచెను; కాని శంకరు(డా రూపజాలమున(బడెను ఇప్పుడాతని నడ్డగించు సామర్థ్యమెవరికి( గలదు? లజ్జ భయపడి పారిపోయెను. వినయము దూరమున నిలుచుండెను. శీలసంకోచములు రెండును జారి

పోయెను. కేవలము కామము వెన్నంటెను. అశరీరుఁడగు ననంగుఁడు ముందు ముందుగా గుప్తరూపమునఁ బోవుచుండెను.

తనవైపునకుఁ ద్రిలోచనుఁడగు శివుఁడు వచ్చుటను గాంచి, యా క్రీడాప్రియ, కామిని కందుకమును వీడి అపావృతయగుటచే సిగ్గుపడుచు క్రీడాభావమును బ్రదర్శించుచు, నంగములను దనలోఁ దానే దాచుకొన్నట్లుండి, తన హావభావములచే భవానీశంకరుని లోభపరచుచు, మదవతియై, నవ్వుచు ముందునకుఁబోయెను. ఆమె ద్రుతగతితో వృక్షముల పొదలమాటునకుఁ బోఁదలఁచెను. అంధకారములో మెఱుఁగు మరల మరలఁ బ్రకాశమును జూపించుచు మార్గమును జెప్పునట్లామె మధ్య మధ్య అనురాగభరితములగు తన కటాక్షబాణములను విసరుచు శివుఁడు తనవైపునకు వచ్చుట కాకర్షించుచుండెను. ఆమె దాగుకొను చుండెను. ప్రకటమగుటకు ఆమె దూరముగఁ బోవుచుండెను. ఆతనిఁ గలిసికొనుటకే, ఆమె లజ్జను బ్రదర్శించుచుండెను. నిర్లజ్జను జూపుటకే ఆమె చేయున దొకటి, కాంక్షించునది వేఱొకటి, ఇట్లు ప్రదర్శన మింకను చేయు చుండెను.

శ్రీశుకదేవుఁ డిట్లనెను :- "రాజా ! వివేకమును గోల్పోయిన వారీ స్వచ్ఛందచారిణులగు కామినుల భావముల నెరుఁగఁజాలక పోవుటచే మాయలోఁబడి పోవుచుందురు, లక్ష్యమునుండి భ్రష్టు

లగుచుందురు. శివునకు పథ ప్రదర్శకుడా సమయమున రతిపతి యగు మన్మథుఁడు. అందువలన నాతనికి వశీభూతుఁడై అతఁడా కామిని వెంట మదోన్మత్త కరీంద్రము కరిణివెంటఁబడినట్లు పరువిడు చుండెను.

......

## మహాదేవ మోహినీ సమ్మేళనము

శ్లో॥ సోఽను ప్రవ్యజ్యతి వేగేన గృహీత్వానిచ్ఛతీ స్త్రియమ్
కేశబంధ ఉపానీయ బాహుభ్యాం పరిషస్వజే ॥

శ్రీభాగ. ౮ స్కం. ౧౨ అ. ౨౮ శ్లో

మ॥ ప్రబలోద్యత్కరిణిం గరీంద్రుఁడు మింపన్ వచ్చులీలన్
శివుం
డబలా పోకుము పోకుమీ యనుచు డాయంబాఱి కెంగేలఁద
త్కబరీ బంధము వట్టి సంభ్రమముతోఁ గౌఁగిళ్ళ
నోలార్చె నం
త బహిఃప్రక్రియ నెట్టకేనిఁ గదియం దద్బాహు నిర్ముక్తయై

శ్రీమదాంధ్ర భాగవతము

అధీరతకును విహ్వలతకును ననుభూతి కలుగును. చింత నము కంటె నది చూచినపుడు వృద్ధియగును. చూచుట కంటెఁ దాఁకినను, దాకుఁటకంటె నంగస్పర్శచేతను ననుభూతి కలుగును. పైనుండి క్రిందఁబడిన వాఁడిఁకఁ గ్రిందయనునది లేనంతవరకు పడుచునే యుండును. గంగ బ్రహ్మలోకమునుండి పడినది, తప, జన, మహర్లోకాదులకుండా ధ్రువలోకమునకు వచ్చినది. అచ్చట నుండి స్వర్గము, స్వర్గము నుండి భువర్లోకమునకు వచ్చి శివుని మస్తకముపైఁబడెను. మస్తకమునుండి జారి కైలాసముమీఁదను, దరు వాత హిమాలయము మీఁదను, తదనంతరము భూమిమీఁదను, భూమి నుండియును ప్రవహించి సముద్రమునఁజేరి యుప్పునీళ్లైనది. అందు వలననే వివేకమును బోఁగొట్టుకొనిన నుత్తరోత్తర పతనమగుచునే యుందురని మనీషులు శలవిచ్చిరి.

శివుఁడు మోహినీ మాయలోఁబడి తన సతియగు బార్వతిని, దనగుణములను బొత్తుగా మఱచి యా కపట కామినీ వెంటఁబడి పరువిడుచుండెను. ఆమె వేసికొనిన జడ నిరంతరమూఁగుచుండెను. సదాశివుఁడు దానివైపునకుఁ జేతినిఁజాచుచుండెను. ఆ జడ శివుఁడు కంకణముగ ధరించిన సర్పము జారి తప్పించుకొని పోయి ఒకానొక లతను బట్టుకొని వ్రేలాడుచున్నట్లును, శివుఁడు మరల దానినిఁ బట్టుకొనఁ బ్రయత్నించుచున్నట్లుండెను. కాని వాయువేగముచే లత కదలుచుండుటచే సర్పము చేతికందకున్నట్లుండెను.

శివుఁడు తన బలమునంతను వినియోగించి యా మోహినీ భగవతి వేణినిఁ బట్టుకొని దానినిఁ జుట్టుకొని, ఆమెయొక్క చంద్ర సదృశమగు వికసితాననమును బాహువులచేఁ బట్టుకొని, హృదయ ప్రదేశమున ధరించెను. విశాలమగు శివుని వక్షఃస్థలమున నా యానన నము శరశ్చంద్రుఁడు గగనమందు శోభించుచున్నట్లుండెను. మెడలో యజ్ఞోపవీతస్థానమున నున్న మూఁడు సర్పములతోఁ గలిసి, కృష్ణ వర్ణముగల నింకొక సర్పమును గూడ శివుఁడు నాల్గవ యజ్ఞోపవీతముగ ధరించి నట్లుండెను.

శ్రీశుకదేవుఁ డిట్లనెను :–"రాజా! ఈ లీలావేశమున నీవీ విషయమును మఱవరాదు. ఈ మాయామోహిని యెవరోకాదు. ఈమె త్రిమూర్తులలో సత్వావతారుఁడగు శ్రీ విష్ణువే. నేఁడు హ్యాళ

యములో విష్ణువున్నాఁడనియు విష్ణువు హృదయములో శివుఁడున్నా డనియుఁ దనభక్తులకు ప్రత్యక్షముగఁ జూపించుచున్నాడు. నేఁడు గంగాయమునలవలె హరిహరుల మధురసమ్మేళనము జరుగుచున్నది. నేఁడు భేదభావమును వదలి యిద్దరును నొక్కటగుచున్నారు. శివుఁ డద్వైత ప్రియుఁడు. కాని విష్ణువునకు ద్వైతము ప్రియము ఆతనికి భేదభావముతో భజన మొనర్చుటయే అత్యంత ప్రియముగ నుండును. అందువలన మోహినీ రూపధారియగు హరి అనిచ్చను బ్రకటించుచు, దన హాస్యయుక్తమగు వికసిత చంద్రాననమును నటు నిటుఁ గదలించుచు, జేతులను దీసి పారవేయుచు వదలించు కొని పోవుటకుఁ బ్రయత్నించుచుండెను. ఆ మోహినీ మాయ కొంతసేపటివరకు కిట్టంగములను విసరుచు మరల నొక యుదుటున నామె శివుని నుండి వదలించుకొని ద్రుతగతిని పారిపోయెను. ఆ సమయమున నామె శోభ అద్భుతముగ నుండెను. ఆమె స్థూల నితంబములు పరస్పర మొరుసుకొనుటచేఁ గదలుచుండెను. శ్వాస ప్రశ్వాసల గతి తీవ్రముగ నుండెను. శివుఁడు పట్టుకొనుటచే నామె కుటిల కేశ పాశము విఅయఁబడియుండెను. అవి వాయువశమున నెరుగుచుఁ బుష్పించిన లతపై దృష్టి గుడ్డకట్టఁగా నవి జెండావలె నెగురుచున్నట్లుండెను.

ఇది విని శివునకుఁ బ్రథమ పరాజయము. ఇదివరలో నొక సారి ఆతఁడు కామునిఁ బరాజితుజేయుటయే కాదు, ఆతనిని

గ్రోధాగ్నిచేఁ గాల్చి భస్మమొనర్చెను. ఇప్పుడా మన్మథుఁడే కసి తీర్చుకొనుటకై అశరీరయై గుప్తరూపమున నుండి ఆతని నిచ్చటకుఁ దీసికొనివచ్చి ఒక అబలద్వారా పరాభవింపఁజేసి ప్రతీకారమొనర్చు కొనెను. శంకరుని కిదియొక అద్భుత ఘటనము. ఆతఁడు తన పాతశత్రువగు మన్మథునిచేఁ బరాజితుఁ డయ్యెనా యనునట్లాలీలా మోహినిని మరలఁ బట్టుకొనుటకు పరువిడెను. ఇంతవరకు శివుని తేజ మూర్ధ్వ ముఖముననుండెను. లోకమునందు దానినభివ్యక్తము కావించుటకే శ్రీహరి యిట్టిలీలను రచించెను. ఆతని తేజబిందువీ భూమిపైఁ బడఁగా నప్పుడాతనిశోభ అత్యధికముగ వృద్ధినిఁ చెందెను. అప్పటినుండియే పృథివియందు వెండి, బంగారు గను లేర్పడినవి. పాదరసపు గనులు పుట్టినవి. శివుని ప్రసాదముచే భూమియందు పరమపావనమగు ధాతువులుదయించెను.

ముందు మోహిని పరువిడుచుండెను. శివుఁడామె వెనుకనే వచ్చుచుండెను. నదీతీరము లందును, వనములందును, ఉప వనము లందును, సరిత్తటములందునను, పర్వతములందును, నెచ్చటెచ్చట మునులయాశ్రమములు కలవో అచ్చటచ్చట మోహిని వెళ్ళుచుం డెను. శివుఁ డామెను వెంబడించు చుండెను. ఏ మునులు హరి హరుల నభేదభావమున భజించుచుండిరో, అట్టి భేదమెంచని వారి కందరకును దర్శన మొసంగుచు నిద్దరు దేవతలును బరువిడు చుండిరి శివున కామన మోహాత్మకమగు మోహినీరూపమే కనబడు

చుండెను గాని ఋషులకును మునులకును సాక్షాత్తుగఁ జతుర్భుజుఁడగు విష్ణురూపమునఁ జూచుచుఁ దమ యిష్టదైవముగ నెరిఁగి దండ ప్రణామ మొనర్చుచుండిరి. ఈవిధముగ హరిహరులిద్దరును సమస్త ఋషుల యాశ్రమములకును స్వయముగఁ బోయి వారినిఁ గృతార్థులఁ గావించెను.

ఈవిధముగ మోహినీ రూపమునుజూపి భగవానుఁడు తన యొక్క మోహినీమాయ అతిప్రబలమైనదనియు, దానిలో దేవాధిదేవుఁడంతటివాఁడును బడిపోయినాఁడనియు దెలిపినాఁడు. కాని యెవరి హృదయములలో శ్రీహరిని నిరంతరము నివాస మొనర్చుకొనిరో వారిని శ్రీహరి సర్వత్రరక్షించుచుండును. భగవంతునకన్ని రూపములును గలవు. కాని యేరూపముననైనను దూరము నుండి దండ ప్రణామ మొనరింప వలయును. ఏదో ఒక రూపమును హృదయమునదుంచుకొన వలయును. మనస్సుతో నన్నిటియందు దన యిష్టమునే చూచుచుండుచో మోహము కలుగదు. ఇఁక బంధనమే యుండఁజాలదు. సర్వత్ర అమోహకుఁడగు సర్వేశ్వరుఁడే కనఁబడుచుండును.

శ్రీశుకదేవుఁ డిట్లనెను :- "రాజా! తేజ, బిందు నధో ముఖమైనతరువాత శివుఁడు తన నిష్ఠయందు స్థితుఁడయ్యెను తాను భగవన్మాయా మోహితుఁడైనట్లు, అనుభవ పూర్వకముగఁ దెలిసి

కొనెను. ఇప్పుడాతఁడు విషయాసక్తినుండి సర్వథా నివృత్తి జెందెను.

......

## మోహినీ చరిత్ర సమాప్తి

శ్లో॥ అసద్విషయ మంఘ్రిం భావగమ్యం ప్రపన్నా
నమృత మమరవర్యా నాశయత్సింధు మథ్యమ్ ॥
కపట యువతి వేషో మోహయన్ యః సురారీం
స్తమహ ముపసృతానాం కామపూరం నతోఽస్మి ॥
శ్రీభాగ. ౮ స్కం. ౧౨ అ. ౪౭ శ్లో ॥

మ॥ ఎలమిన్ దైత్యుల నాఁడు రూపమున మోహింపించి పీయూషముం
జలితా పన్నులకున్ సురోత్తములకుం జక్కన్ విభాగించి ని

ర్మంబు రేఖల్ విలసిల్లు శ్రీవిభునిఁ దన్మాయా వధూ
రూపమున్

దలఁతున్ మ్రొక్కెదు నాత్మలోన దురిత ధ్వాంతార్క
రూపంబుగన్ ॥

శ్రీమదాంధ్ర భాగవతము

ఒక దుంగ భ్రమవశమున దయ్యముగఁ దోచినచో దాని చేష్టములన్నియు దయ్యపు చేష్టములుగనే యుండును. అది ఆకాశ మంత యెత్తుగ నున్నట్లుండును. దానికి భయంకరములగు కోఱలు కనఁబడును. దానికి కాళ్లు వెనుక కున్నట్లుండును. దాని యవయవ ములు వ్రేలాడుచు భయంకరములుగఁ గనఁబడును. శరీరము భయ కారణమున వణఁకును. మనకు మృత్యువాసన్నమైనట్లు తోఁచును. వెలుఁగురాఁగానే, లేక దగ్గఱకుఁ బోవుటచే లేదా యెవరైనను జెప్పు టచే మన భ్రమ దూరమగును. అప్పుడు దానికిఁ గన్నులు గాని చెవులుగాని, పండ్లుగాని, పాదములుగాని యుండవు. అది అప్పుడు దుంగగానే తోచును. దానిలోనికి ఇదివఱలో భూతము వచ్చి కూర్చుండి నదియును లేదు. ఇప్పుడు పోయినదియు లేదు. అది ఇదివఱకును దుంగయే. యిప్పుడును దుంగయే దానిలో భూతము లేనే లేదు. భ్రమవశమున మోహకారణమున మనకట్లు కనఁబడినది. భ్రమ దూరము కాఁగానే భయము పాఱిపోవును.

శ్రీశుకదేవుఁ డిట్లనెను :- "రాజా! ఈమె స్త్రీకాదు. భగవానుఁడు నా కోరికను నెఱవేర్చుటకై నాకు మోహినీ రూపమున జూపించుటకై యిట్లు చేసినాఁడని యీశ్వరుడు తెలిసి కొనఁగానే, ఆతఁడు మధుసూదనుని యొక్క అచింత్య మహాత్మ్యమును దెలిసి కొని ఆతఁడా ప్రయాస నుండి నివృత్తినిఁ జెందెను.

భూతనాధున కాశ్చర్యమును గలుగలేదు. లజ్జా విషాదములును గలుగలేదు. ఆతఁడు ప్రకృతిస్థుఁడై భగవద్ధ్యాన నిమగ్నుఁ డయ్యెను. మాటి మాటికి కాతని యద్భుత అలౌకిక మోహినీ రూపమును స్మరించుచుండెను. ఇంతలోనే నవ్వుచు భగవానుఁడా తని సమ్ముఖమున నిలుచుండెను. ఇప్పుడాతఁడు మోహినీ కాదు. మోహనుఁడు. ఇప్పుడాతడు చీరెను ధరింపలేదు. పీతాంబరమును జుట్టుకొనెను. ఇప్పుడాతడు కందుకమును ద్రిప్పక సుదర్శన చక్రమును ధరించెను. అతని మనోహరిణియగు వేణి యిప్పు డుంగరములు తిరిగిన నలకావళి రూపమునఁ బరిణిత మయ్యెను. ఇప్పుడాతఁడు కటాక్ష బాణములను విసరక మంద మందహాసము లొనర్చుచుండెను. ఇప్పుడాతనికి గాజులు గలగల లాడుటలేదు. సువర్ణ కంకణములు కరముల కాంతి నిను మడించుచుండెను. నవ్వుచు భగవానుఁ డిట్లనెను :-"శివా! నమస్కారము. నామోహినీ రూపమును జూచితివా?"

శివుఁడు భక్తి భావముతో నిట్లనెను :-"ప్రభూ ! నీయొక్క మాయామయ, మాధురీ, మనమోహనరూపమును గాంచితినిస్వామీ ! నేను మోసపోయితిని. నీ యొక్క స్త్రీరూపమగు మాయచే నత్యంత కామవశుఁడనై మోహపడితిని. స్వామీ ! నీ వెవరిమీఁదఁ గృపఁ జూపెదవో వారే యీ మాయను దాటఁగలరు. నీవే మోహమునఁ బడవేయఁ దలఁచినచో నాతఁడెట్లు రక్షింపఁబడఁగలఁడు ?

నవ్వుచు భగవానుఁడిట్లనెను :-"భోళాశంకరా ! నీవు ధన్యుఁడవు. యధార్థముగ నీవు మహాదేవుఁడవు అందువలననే నాయీ మహిళా రూపమగు మోహినీమాయకు క్షణకాలమత్యంత మోహితుఁడవయ్యును జివరకు సంభాళించుకొంటివి. కానున్న స్వామీ ? నాయీ స్త్రీరూపిణియగు మాయ అగాధమగు నంధకారకూపము వంటిది. దీనిలో నొక్కసారి కూలెనా ఇంక జీవితాంతము వరకు దానినుండి బయటపడుట అత్యంత దుష్కరము. స్వామీ ! చేఁప ముల్లును ఖాద్యపదార్థమని భావించి, తెలియక మ్రింగి చిక్కుకొనును, కాని యీ ప్రాణి తెలిసి తెలిసి మాయాజాలమునఁబడుచుండును. నవ్వుచునవ్వుచుఁ బాడుచుఁ బాడుచు, మేళతాళములతో నందఱను సంతోషపెట్టుచు, పెండ్లి వేడుకలతో మాయను దెచ్చుకొనుచున్నాము. దాని వలన నెన్ని యిబ్బందులు వచ్చినను జీవితాంతము వఱకు

దానిని వదల నిచ్చింపము. ఈ తృష్ణ చచ్చునప్పుడును శాంతింపదు. ఈ పిపాసను స్మరించుచుఁ బ్రాణములను బరిత్యజించును. మరల జన్మించి దానినే ప్రాప్తించును. నీవు దేవశ్రేష్ఠుఁడవు, ఈశ్వరుఁడవు, సర్వజ్ఞుఁడవు, సర్వవిదుఁడవు కావుననే క్షణములో మరల నీనిష్ఠలో నుండఁగలిగితివి. ఇది మిక్కిలి శ్రేయస్కరమగు విషయము."

శివుఁడు సంకోచస్వరమున నిట్లనెను :- "ప్రభూ! నేను వివేక విహీనుఁడనైతిని నీమోహినీ మాయయొక్క వివిధ భావములగు చేష్టలచేఁ గామాతురుఁడనై సిగ్గులేని వానివలెఁ బరువిడితిని. నీవు నీయపారకృపను బ్రదర్శించి దాటించితివి. దానియొక్క యథార్థ రహస్యమును దెలిపితిని."

ఇది విని శ్రీహరి యిట్లనెను :- "విభూ! నానా ప్రకారములగు హావభావములను బ్రదర్శించునదియు, హృదయమున, నేత్రములయందు, సమస్తశరీరమున సరసతా ప్రదానము గావించునాదుస్త్యజమగు మాయను నొక్కసారి యుపభోగించి దానిని స్వేచ్ఛచేఁ ద్యజించు సామర్థ్య మెవరికిఁగలదు? దేవాధిదేవా! అజితేంద్రియులగుఁ గాముకులకు జీవితాంతము వరకును ద్యజించుట కష్టమైనది. ఒక్కసారి దీని బాహుపాశమునకుఁ జిక్కినా ఇక వదలించుకొనుట కష్టముఁ దానిని దాటుట సాధారణ సాహసమగు కార్యముకాదు."

శివుఁ డిట్లనెను :- "స్వామీ! ఇంతటి యాకర్షణము నీలో గూడ లేదు. ఈమాయ నీకంటెను గొప్పదిగఁ దోఁచు చున్నది."

అప్పుడు భగవానుఁ డిట్లనెను :- శివస్వామీ! సృష్టికి కారణ భూతములను, గాలరూపమును, బరమేశ్వరుఁడను నగు నాయందొక యంశమాత్రమున నిది నిలిచియున్నది. నామాయలోఁ బడినవారు పరిపూర్ణుఁడనగు నన్ను సహజముగఁ బ్రాపింపఁజాలరు. నాకంశభూతమగు నీమాయ యందే యింతటి యాకర్షణముండఁగా నాయందెంతటి ఆకర్షణముండవలయును. దీనిని మాయాబద్ధులగు ప్రాణులు తెలిసికొనఁ జాలరు. పొమ్ము, నిన్ను నేఁటినుండి యీ గుణమయమగు మాయ నిన్నుఁబరాభవింపఁ జాలదని నేను వర మొసంగుచున్నాను. నేఁటినుండి నీవీమాయలోఁ బడవు."

!

శ్రీశుక దేవుఁడు పరీక్షిన్మహారాజుతో నిట్లనెను :- "రాజా ఇట్లుపలికి భగవానుఁడు శివుని వెంటఁ బార్వతీదేవి రుద్రగణములతోఁ గూర్చుండిన చోటునకు వచ్చెను. భగవానుఁడు పార్వతీ పరమేశ్వరులను గణములను సత్కరించెను. ఈ విధముగ భగవానునిచే సత్కృతుఁడై మహాదేవుఁడు పార్వతితోడను, గణములతోడను, శ్రీహరి యనుమతినిఁ బొంది, యెద్దుపైనెక్కి కైలాసమునకుఁ బోయెను.

మార్గమున నవ్వుచుఁ బార్వతి యిట్లనెను :- "చెప్పుఁడు స్వామీ ! ఏమి గడబిడ జరిగినది ? మీరు మంత్రింపఁబడినట్లు పరు విడితిరి. ఉచ్చాటన మంత్రమును మంత్రించినట్లుండెను."

శివుఁ డిట్లనెను :- కైలాసమునకుఁ బోయిన తరువాత దీనికిఁ బ్రత్యుత్తర మొసంగెదను."

క్షణములో నందీశ్వరుఁడు కైలాసమందు విశాలమగు వట వృక్షము క్రిందకు వచ్చెను. అచ్చట సనకాది మహర్షులును నితర తేజస్వులును, దపస్వులును, బ్రహ్మనిష్ఠులు భవానీనాథునికొఱకై ప్రతీక్షించుచుండిరి.

అందఱును నందికేశ్వరుని పాదపద్మములకుఁ బ్రణమిల్లిరి. భగవానుఁడు యోగపీఠమునఁ బార్వతీసహితుఁడై విరాజమానుఁడు కాఁగానే సమస్త ఋషులును, మునులును గూర్చుండిరి. సత్సంగ ప్రసంగమును నెఱపుటకై పశుపతియగు ప్రభువు తన ప్రియయగుఁ బార్వతితో నిట్లనెను :- "ప్రియా ! నీవు పరదేవతయును బరమ పురుషుఁడును, నజన్ముఁడు నగు శ్రీహరి మాయను దర్శించితివా?"

నవ్వుచుఁ బార్వతి యిట్లనెను :- "మాయా దర్శనమును జేసితిని. మీ దర్శనమును......"

గంభీరుఁడై సదాశివుఁ డిట్లనెను :- "దేవీ ! నీవు పరిహాస మొనర్పకుము. పరాత్పర ప్రభుని మాయయే యింత ప్రబలమైనది నేను భగవంతుని కళలలో సర్వశ్రేష్ఠుఁడుగను, పరమస్వతంత్రుఁడుగను నెన్నఁబడు చుండును. నాయంశచేతనే యుత్పన్నమైన మాయచే నేను మోహితుఁడనైనప్పుడు, అన్యులగు బరతంత్ర ప్రాణులు మోహితులగుటలో నాశ్చర్యమేమున్నది ? అడిగినచో నిప్పుడు నీపురాతనపు ప్రశ్నకు సమాధాన మొసంగెదను."

పార్వతీదేవి వినయముతో నిట్లనేను :- "స్వామీ ! ఆ పురాతన ప్రశ్నయేమి ? నాకిప్పుడు జ్ఞాపకము లేదు. ఏమైన నడిగియుందునేమో ?"

శివుఁ డిట్లనెను :- "నేను సహస్రవర్ష సమాధిలో నుండి లేవఁగానే నీవు వచ్చి నీవు ధ్యానమొనర్చు పురాణపురుషుఁ డెవఁడని నన్నడిగితివి. ఆ సమయమున నేను బ్రశ్నను దాటవైచితిని. నేఁడు నేను దానికిఁ బ్రత్యుత్తర మొసంగెదను. కాలగతియును, వేద గతియును లేనట్టి యా పురాణ పురుషుఁ డీతఁడే. కాలునకు గాలుఁడును, నెవనిని వేదములు వర్ణింపనే లేవో. అవి నేతి నేతి అనఁగా నిదికాదు ఇది కాదనుచు మెదలకుండినవి. ఆతని మాయకే యిట్టి ప్రభావముండిన నాతని అమిత ప్రభావము విషయమున నింకఁ జెప్పవలసినదేమున్నది ?"

శ్రీశుకదేవుఁడిట్లనెను :-"రాజా ! నేనద్భుతమగు సముద్ర మంథన లీలాప్రసంగమున మోహినీ చరిత్రమును జెప్పితిని. ఈ లీలయందజిత, కచ్ఛప, ధన్వంతరి, మోహినీయను నాల్గవతార ములు వచ్చినవి. ఈ నాల్గింటిలో నీ మోహినీ యవతారము పరమ మోహకమైనది. భగవానుని యొక్క యీ నాల్గు అవతారముల లీలల నెవరు వినెదరో, వినిపించెదరో, చదివెదరో, చదివించెదరో ప్రయత్నము లేవియును నిష్ఫలములు కావు. ఏలయనఁగా వాసుదేవ భగవానుని గుణానువాదము సమస్త సాంసారిక శ్రమను దూరము కావించును. ఈ సాంసారిక కలంకిత కథాశ్రవణముచేఁ గలుషిత మైన కరకుహరముల కీ భగవానుని సరస కథలు పరమౌషధ స్వరూపములు. సమస్త శోక సంతాపములను నాశనము కొఱకై రామబాణమువలె నీ కథలమోఘ సిద్ధప్రదములై యున్నవి."

సూతుఁడు శౌనకాది మునులతో నిట్లనెను :-మహర్షులారా ! ఈ విధముగ మా గురుదేవుఁడీ మోహినీ లీలను సమాప్తికావించుచు అసురులను మోసగించి, సురల కమృతము నొసంగి శరణాగత రక్షణ బిరుదును నిలుపుకొనిన నా భగవానుని మాయా మోహిత యువతీ రూపమునకు శ్రద్ధతోఁ బ్రణామము కావించి యూర కుండెను."

అంత శౌనకుఁ డిట్లడిగెను :- "సూతా ! ఆ తరువాత శ్రీశుకమహర్షి యే కథను జెప్పినాఁడు."

సూతుఁడిట్లనెను - "స్వామీ! మన్వంతర కథ యింకను నిలిచియే యున్నది కదా! ఒక్కొక్క కల్పమునకుఁ బదునాలుగు మన్వంతరములుండును. ఆరవ మన్వంతరావతారుఁడగు నజితుఁడు సముద్రమంథన లీల నొనర్చెను. ఇంకను నెనిమిది మన్వంతరముల కథ మిగిలియున్నది. దానినే శుకదేవుఁడు పరీక్షిన్మహారాజునకుఁ జెప్పినాఁడు. నేనిప్పుడు దానినే మీకుఁ జెప్పెదను. మీరందఱును సావధానులరై శ్రవణమొనర్పుఁడు."



స మా ప్త ము

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మి - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

| | | |
|---|---|---|
| 63. | కలశపూజలు (9ఒకేసారి) | 150-00 |
| 64. | కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) | .... |
| 65. | హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) | .... |
| 66. | గోమాత | 40-00 |

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు<br>పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం | 45-00 |
| 2. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, | 50-00 |
| 3. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, | 50-00 |
| 4. | స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) | 99-00 |
| 5. | లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి | 63-00 |
| 6. | స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ | 108-00 |
| 7. | సర్వదేవతా స్తోత్రమంజరి | 120-00 |
| 8. | సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) | 24-00 |
| 9. | విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) | 25-00 |
| 10. | లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) | 36-00 |
| 11. | లలితా సహస్రనామములు | 24-00 |
| 12. | లక్ష్మీ సహస్రనామములు | 24-00 |
| 13. | దుర్గా సహస్రనామములు | 24-00 |
| 14. | ఆంజనేయ సహస్రనామములు | 24-00 |
| 15. | శివ సహస్రనామములు | 24-00 |
| 16. | విష్ణు సహస్రనామములు | 24-00 |
| 17. | గణపతి సహస్రనామములు | 24-00 |
| 18. | సుబ్రహ్మణ్య సహస్రనామములు | 24-00 |
| 19. | గాయత్రి సహస్రనామములు | 24-00 |
| 20. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు | 24-00 |
| 21. | శ్రీరామా సహస్రనామములు | 24-00 |
| 22. | సరస్వతి సహస్రనామములు | 24-00 |
| 23. | సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం | 24-00 |
| 24. | శ్రీవేంకటేశ్వరసహస్రనామములు | 24-00 |
| 25. | మణిద్వీపవర్ణన (పెద్దది) | 24-00 |
| 26. | సంధ్యావందనం | 24-00 |
| 27. | మంత్రపుష్పమ్ | .... |
| 28. | త్రిభాషా హనుమాన్‌చాలీసా | 15-00 |
| 29. | హనుమాన్ చాలీసా | 10-00 |

| | | |
|---|---|---|
| 30. | మణిద్వీపవర్ణన (పాకెట్) | 10-00 |
| 31. | ఆరు చాలీసాలు | 10-00 |
| 32. | శివారాధన (శివస్తోత్రాలు) | 10-00 |
| 33. | వేంకటేశ్వర సుప్రభాతం (పాకెట్) | 10-00 |
| 34. | ఆరుదండకాలు | 5-00 |
| 35. | వేంకటేశ్వర గోవిందనామములు | 5-00 |
| 36. | అష్టలక్ష్మీ స్తోత్రమ్ కనకధారాస్తోత్రమ్ | 10-00 |
| 37. | దేవీఖడ్గమాలాస్తోత్రమ్ (మహిషాసురమర్దనీస్తోత్రంతో) | 10-00 |
| 38. | సుందరకాండ (పాకెట్) | 10-00 |
| 39. | భగవద్గీత మూలం | 27-00 |
| 40. | రామరక్షాస్తోత్రమ్ | 15-00 |
| 41. | స్తోత్ర రత్నావళి | 36-00 |
| 42. | పురాణపండ లలితా-విష్ణు సహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 43. | పురాణపండ లలితాసహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 44. | పురాణపండ విష్ణు సహస్రనామస్తోత్రమ్ | 10-00 |
| 45. | పురాణపండ ఆదిత్య హృదయం | 10-00 |
| 46. | మంత్రపుష్పం (మినీ) | 10-00 |
| 47. | శివానందలహరి-సౌందర్యలహరి | 36-00 |
| 48. | కుజదోషం | 10-00 |
| 49. | కాలసర్ప దోషం | 10-00 |
| 50. | మీ అప్పులు తీరాలా? | 10-00 |
| 51. | దృష్టిదోషాలు నివారణ | 10-00 |
| 52. | పంచసూక్తములు | 10-00 |
| 53. | సంధ్యావందనం | 10-00 |
| 54. | రుద్రనమకమ్-చమకమ్ | 10-00 |
| 55. | గాయత్రీమంత్రాలు | 10-00 |
| 56. | హయగ్రీవ స్తోత్రమాల | 10-00 |
| 57. | దక్షిణామూర్తి స్తోత్రమాల | 10-00 |
| 58. | ద్వాదశ జ్యోతిర్లింగాలు - పంచారామాలతో | 10-00 |
| 59. | శ్రీసూక్తం పురుష సూక్తం | 10-00 |
| 60. | నవగ్రహస్తోత్రమాల | 36-00 |
| 61. | మహాన్యాసమ్ | 36-00 |
| 62. | సుందరకాండ గానామృతం | 36-00 |
| 63. | గోమాతపూజావిధానము | 10-00 |
| 64. | ఆనందసిద్ధి - 1 శ్రీదేవీ స్తోత్రమాల | 108-00 |

| | | |
|---|---|---|
| 65. | ఆనందసిద్ధి - 2 ఏ సమస్యకు ఏ స్తోత్రమ్ పారాయణచేయాలి | 108-00 |
| 66. | ఆనందసిద్ధి-3 మానసదేవీ స్తోత్రమాల | 108-00 |
| 67. | శ్రీ కాలభైరవ రక్షా కవచమ్ | 63-00 |
| 68. | అర్చన | 40-00 |
| 69. | నిత్యదేవతార్చన | 40-00 |
| 70. | సర్వదేవతా స్తోత్ర నిధి | 99-00 |
| 71. | శ్రీచక్ర నవవరణార్చన | 63-00 |
| 72. | చండీ సప్తశతి పారాయణ క్రమం | 99-00 |
| 73. | శ్రీదేవి స్తోత్ర రత్నావళి 32 దేవి స్తోత్రాలకు తాత్పర్యంతో | 99-00 |
| 74. | వనదుర్గా మంత్రానుష్ఠాన క్రమమ్ | 63-00 |
| 75. | శ్రీ కాలభైరవ వ్రతము | 63-00 |

## 3. శ్రీ సాయి దత్త గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ సాయిబాబా సచ్చరిత్ర | 120-00 |
| 2. | సంపూర్ణ శ్రీ గురు చరిత్ర | 120-00 |
| 3. | శ్రీ సాయిఆరాధన-షిర్డివైభవం | 120-00 |
| 4. | శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర (క్రౌన్) | 63-00 |
| 5. | శ్రీ గురుచరిత్ర (క్రౌన్) | 63-00 |
| 6. | నవనాధ చరిత్ర | 99-00 |
| 7. | శ్రీసాయిచరిత్ర (బైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 8. | శ్రీగురుచరిత్ర (బైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 9. | సత్యదత్తవ్రతం దత్తాత్రేయపూజాకల్పం,సహస్రంతో | 30-00 |
| 10. | అనఘాదేవీ వ్రతం | 30-00 |
| 11. | భక్తుల ప్రశ్నలకు బాబా జవాబులు | 30-00 |
| 12. | శ్రీ సాయిపూజాకల్పం (సహస్రంతో) | 25-00 |
| 13. | శ్రీ సాయిభజనమాల | 20-00 |
| 14. | శ్రీ సాయి భజన్స్ | 20-00 |
| 15. | శ్రీ సాయిభక్తి గీతాలు | 20-00 |
| 16. | శిరిడిహారతులు (భావంతో) | 20-00 |
| 17. | “శ్రీసాయి”కోటి | 27-00 |
| 18. | “శ్రీసాయిరామ్”కోటి | 20-00 |
| 19. | శ్రీ సాయినాథ స్తోత్రమంజరి | 10-00 |
| 20. | శ్రీ సాయివేయినామాలు | 8-00 |
| 21. | శ్రీ సాయి హారతులు (పాకెట్) | 15-00 |
| 22. | శ్రీ సాయి స్తవనమంజరి | 10-00 |
| 23. | హిందీ శ్రీ సాయి హారతులు | 15-00 |

| | | |
|---|---|---|
| 24. | శని సింగణాపూర్ క్షేత్రమాహాత్మ్యం | 63-00 |
| 25. | ఇంగ్లీషు శ్రీ సాయిహారతులు | 15-00 |
| 26. | షిరిడి దర్శనం-శ్రీసాయి వైభవం | 99-00 |
| 27. | సాయిసత్యవ్రతం | 30-00 |
| 28. | సాయి అనుగ్రహమ్ | 120-00 |
| 29. | నవగురువారాల వ్రతకల్పము | 15-00 |
| 30. | శ్రీదత్తలీలామృతము | 99-00 |
| 31. | హృదయంలో సాయి | 15-00 |
| 32. | శ్రీషిరిడీసాయి లీలామృతం(శ్రీసచ్ఛరిత్ర) | 120-00 |
| 33. | గజాననమహరాజ్ చరిత్ర | 99-00 |

## 4. జ్యోతిషాలు

| | | |
|---|---|---|
| 1. | 'కాలచక్రం' గంటలపంచాంగం (గార్గేయ) | 72-00 |
| 2. | గ్రహభూమి పంచాంగము (గార్గేయ) | 108.00 |
| 3. | ఆనందసిద్ధి పంచాంగం (వై.వి.శాస్త్రి) | 63.00 |
| 4. | ములుగు వారి రాశిఫలితాలు (12రాశులువారికి) | 50.00 |
| 5. | ములుగు వారి రాశిఫలితాలు విడివిడిగాఒక్కొక్కటి | 12.00 |
| 6. | కాలచక్రంజ్యోతిషక్యాలండర్ | 25.00 |
| 7. | గ్రహబలం క్యాలండర్ (శ్రీనివాసగార్గేయ-భక్తిటివి) | 25.00 |
| 8. | శుభమస్తు (పిడపర్తి) క్యాలండర్ | 25.00 |
| 9. | సాదా క్యాలండర్ | 5.00 |
| 10. | పాకెట్ క్యాలండర్ | 15.00 |
| 11. | తాజకనీలకంఠీయమ్ | 100-00 |
| 12. | కేరళ జ్యోతిష రహస్యాలు | 180-00 |
| 13. | జ్యోతిష బ్రహ్మ రహస్యాలు | 180-00 |
| 14. | మానసాగరి జాతకపద్ధతి | 180-00 |
| 15. | వరాహమిహిర జాతకపద్ధతి | 180-00 |
| 16. | వధూవర వివాహమైత్రిద్వాదశకూటములు | 99-00 |
| 17. | సింపుల్ రెమిడీస్ | 180-00 |
| 18. | శంభు హోరప్రకాశిక | 250-00 |
| 19. | పూర్వ పరాశరి | 100-00 |
| 20. | పరాశర జ్యోతిషవిజ్ఞాన సర్వస్వం | 200-00 |
| 21. | ప్రశ్న సింధు | 99-00 |
| 22. | నక్షత్ర విశేష ఫలితాలు | 63-00 |
| 23. | సూర్యసిద్ధాంతపంచాంగగణితంచేయడంఎలా? | 180-00 |
| 24. | దృక్సిద్ధాంతపంచాంగగణితం చేయడంఎలా? | 180-00 |

| | | |
|---|---|---|
| 25. | ఆయుర్దాయ నిర్ణయం | 63-00 |
| 26. | జాతక గణిత ప్రవేశిక | 63-00 |
| 27. | జ్యోతిషమర్మబోధిని | 63-00 |
| 28. | జ్యోతిష ప్రశ్నోత్తరమాల | 63-00 |
| 29. | ముహూర్తం నిర్ణయించడంఎలా? | 63-00 |
| 30. | జాతక మకరందం | 63-00 |
| 31. | జ్యోతిష సరస్వతి | 63-00 |
| 32. | మీజననకాల విశేషాలు | 63-00 |
| 33. | ముహూర్త విజ్ఞాన భాస్కరం | 63-00 |
| 34. | జ్యోతిష స్వయంబోధిని | 63-00 |
| 35. | శుభముహూర్త శిరోమణి | 63-00 |
| 36. | నక్షత్ర ఫలమంజరి | 36-00 |
| 37. | పంచాంగం చూసే విధానం | 36-00 |
| 38. | సర్వార్థ జ్యోతిషం | 36-00 |
| 39. | ప్రాథమిక జ్యోతిషం | 36-00 |
| 40. | నవరత్నములు శుభయోగములు | 36-00 |
| 41. | శుభశకునాలు | 30-00 |
| 42. | హస్తరేఖాఫలితాలు | 36-00 |
| 43. | సంఖ్యల్లో భవిష్యత్ | 36-00 |
| 44. | ముహూర్త దీపిక | 99-00 |
| 45. | పుట్టుమచ్చలు ఫలితాలు | 30-00 |
| 46. | కలలు ఫలితాలు | 30-00 |
| 47. | జాతక చక్రం వేయడం ఎలా? | 36-00 |
| 48. | మానసాగరి (ప్రాచీనజ్యోతిషగ్రంథం) -పుచ్చాశ్రీనివాసరావు | 250-00 |
| 49. | జ్యోతిషశాస్త్ర చిట్కాలు | 120-00 |
| 50. | గుప్తా శతాబ్ది పంచాంగం (1940-2050) | 999-00 |
| 51. | ప్రశ్నచండేశ్వరమ్ | 63-00 |
| 52. | ద్వాదశభావ ఫలచంద్రిక | 250-00 |
| 53. | జ్యోతిష శతయోగరత్నావళి (నూరుయోగాలఫలితాలు) | 120-00 |
| 54. | అంగసాముద్రికం | 36-00 |
| 55. | హస్త సాముద్రికం | 63-00 |
| 56. | లాల్ కితాబ్ | 99-00 |
| 57. | శకునశాస్త్రం | 63-00 |
| 58. | ఆధునికప్రశ్నశాస్త్రం | 120-00 |
| 59. | పరాశరజ్యోతిష ప్రశ్నజ్యోతిషం | 180-00 |

| | | |
|---|---|---|
| 60. | అష్టకవర్గు (కొండపల్లి) | 63-00 |
| 61. | బృహత్‌జాతకం (ప్రాచీనప్రతికిపునర్ముద్రణ) | 250-00 |
| 62. | లగ్నరత్నాకరం | 63-00 |
| 63. | షట్పంచాశిక | 120-00 |
| 64. | 40 రోజుల్లో జ్యోతిషంనేర్చుకొనండి | 270-00 |
| 65. | 40 రోజుల్లో సాముద్రికంనేర్చుకొనండి | 180-00 |
| 66. | 40 రోజుల్లో సంఖ్యాశాస్త్రం | 180-00 |
| 67. | 40 రోజుల్లో నక్షత్ర (నాడీ) ఫలితములు | 270-00 |
| 68. | 40 రోజుల్లో వైద్యజ్యోతిషం నేర్చుకోండి | 250-00 |
| 69. | మీ పుట్టినతేదీ అద్భుతరహస్యాలు (సాయిగణపతిరెడ్డి) | 270-00 |
| 70. | కె.పి.జ్యోతిషం (పరిచయం) | 63-00 |
| 71. | ముహూర్తచింతామణి | 99-00 |
| 72. | సూర్యచంద్ర గ్రహణములు | 63-00 |
| 73. | ప్రసిద్ధవ్యక్తుల జాతకాలు (వేరేకొండప్ప) | 180-00 |
| 74. | అదృష్టరెమెడీస్ | 144-00 |
| 75. | గ్రహసంచార ఫలనిర్ణయదీపిక | 63-00 |
| 76. | జ్యోతిష రెమిడీస్ | 300-00 |
| 77. | జాతకమార్తాండం పాతప్రతికి యథాతథం (కొండపల్లి) | 250-00 |
| 78. | జ్యోతిషవిద్యాప్రకాశిక పాతప్రతికి యథాతథం (కొండపల్లి) | 250-00 |
| 79. | నాడీజ్యోతిషం | 63-00 |
| 80. | నక్షత్రపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 63-00 |
| 81. | లగ్నపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 63-00 |
| 82. | గౌతమసంహిత | 63-00 |
| 83. | హోరరత్నమాల | 63-00 |
| 84. | జాతకఫల మణిమంజరి | 200-00 |
| 85. | పుష్కర పంచాంగం (2013-14నుండి 2024-25) | 560-00 |
| 86. | దశాభుక్తిఫల నిర్ణయం | 250-00 |
| 87. | వింత జోస్యములు | 63-00 |
| 88. | షోడశవర్గులు | 200-00 |
| 89. | రవిగ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 90. | చంద్ర గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 91. | కుజ గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 92. | బుధ గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 93. | గురు గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 94. | శుక్ర గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |

| | |
|---|---|
| 95. శని గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 96. రాహు & కేతు గ్రహముల సమస్త ప్రభావములు | 99-00 |
| 97. ఆధునిక గ్రహములు-ఉపగ్రహములు సమస్త ప్రభావములు | 99-00 |
| 98. ముహూర్తమార్తాండం | 63-00 |
| 99. లఘుజాతకం | 63-00 |
| 100. జాతకాలంకారము | 63-00 |
| 101. మేషలగ్న ఫలితములు | 99-00 |
| 102. వృషభ లగ్న ఫలితములు | 99-00 |
| 103. మిధున లగ్న ఫలితములు | 99-00 |
| 104. కర్కాటక లగ్న ఫలితములు | 99-00 |
| 105. సింహలగ్న ఫలితములు | 99-00 |
| 106. కన్యలగ్న ఫలితములు | 99-00 |
| 107. తుల లగ్న ఫలితములు | 99-00 |
| 108. వృశ్చిక లగ్న ఫలితములు | 99-00 |
| 109. ధనుస్సు లగ్న ఫలితములు | 99-00 |
| 110. మకర లగ్న ఫలితములు | 99-00 |
| 111. కుంభ లగ్న ఫలితములు | 99-00 |
| 112. మీన లగ్న ఫలితములు | 99-00 |
| 113. నారద సంహిత | 200-00 |
| 114. పంచాంగపీఠికలేఖికాగణితం | 250-00 |
| 115. తారాబలం - చంద్రబలం (వేరే కొండప్ప) | 99-00 |
| 116. సులభలగ్న సాధన (చిత్రాలగురుమూర్తిగుప్తా) | 200-00 |
| 117. రాహు కేతువుల యోగము | 99-00 |
| 118. ఛాయాగ్రహములు | 99-00 |
| 119. జ్యోతిషవిజ్ఞాన దీపిక | 63-00 |

## బి.వి.రామన్ గారి గ్రంథములు

| | |
|---|---|
| 120. జ్యోతిష విద్యారంభం | 50-00 |
| 121 గ్రహభావ బలములు | 50-00 |
| 122. కాలచక్రదశ | 50-00 |
| 123. అనుభవ ప్రశ్నాజ్యోతిషం | 50-00 |
| 124. జ్యోతిషశాస్త్రంలో వాతావరణ భూకంపాలు | 50-00 |
| 125. పురోగామి జాతకం | 50-00 |
| 126. భావార్థరత్నాకరం | 75-00 |
| 127. భారతీయజ్యోతిష సర్వస్వం | 75-00 |
| 128. అష్టకవర్గ పద్ధతిః | 75-00 |

| | | |
|---|---|---|
| 129. | జ్యోతిషశాస్త్రంలో సందేహాలు,సమాధానాలు | 75-00 |
| 130. | ప్రశ్నతంత్ర | 75-00 |
| 131. | ముహూర్తం | 75-00 |
| 132. | విశిష్ట జాతకములు | 125-00 |
| 133. | భారతీయఫలితజ్యోతిషం | 125-00 |
| 134. | 300 ముఖ్యమైన యోగములు | 125-00 |
| 135. | జాతకంపరిశీలించడంఎలా ? | 300-00 |

**రాష్ట్రపతి అవార్డుగ్రహీత, మహామహోపాధ్యాయ, వాచస్పతి**
**శ్రీ మధురకృష్ణమూర్తిగారి గ్రంథములు**

| | | |
|---|---|---|
| 136. | బృహత్పరాశరహోరాశాస్త్రము-1 | 200-00 |
| 137. | బృహత్పరాశరహోరాశాస్త్రము-2 | 200-00 |
| 138. | బృహత్పరాశరహోరాశాస్త్రము-3 | 200-00 |
| 139. | బృహత్పరాశరహోరాశాస్త్రము-4 | 200-00 |
| 140. | భావార్థరత్నాకరము | 100-00 |
| 141. | ముహూర్త చింతామణి | 100-00 |
| 142. | ముహుర్త చింతామణి-పార్టు2 | 200-00 |
| 143. | స్వప్న శాస్త్రము | 36-00 |
| 144. | శతయోగమంజరి | 50-00 |
| 145. | వ్రతనిర్ణయకల్పవల్లి | 250-00 |
| 146. | దైవజ్ఞవల్లభం | 75-00 |
| 147. | వసంతరాజశకునమ్ (బృహత్శకునశాస్త్రం) | 250-00 |
| 148. | వాస్తుశాస్త్రవివేకము-1 | 100-00 |
| 149. | వాస్తుశాస్త్రవివేకము-2 | 200-00 |
| 150. | వాస్తుశాస్త్రవివేకము-3 | 100-00 |
| 151. | వాస్తుశాస్త్రవివేకము-4 | 200-00 |
| 152. | అనుభవసులభవాస్తు - 1 | 50-00 |
| 153. | అనుభవసులభవాస్తు - 2 | 100-00 |
| 154. | పంచాంగ వివేకము | 99-00 |
| 155. | వశిష్ఠ సంహిత | 360-00 |
| 156. | పంచపక్షి శాస్త్రం (కేస్‌బైండ్) | 200-00 |

## 5. వాస్తులు

| | | |
|---|---|---|
| 1. | 40 రోజుల్లో "వాస్తువిద్య" నేర్చుకొనండి | 180-00 |
| 2. | వాస్తుశాస్త్ర రహస్యములు | 200-00 |
| 3. | వాస్తునుబట్టి మీ ఇల్లు | 63-00 |
| 4. | మీరూ మీ వాస్తు | 63-00 |

